# సుబ్బలక్ష్మి కథలు

శివరాజు సుబ్బలక్ష్మి



ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ-2.

# కథాక్రమం

# ముంజేతి కంకణం

శాంతకి శుభలేఖ చూసినదగ్గరనుంచీ పెళ్ళికి వెళ్ళటమా, మానటమా, అన్న ఆలోచన తెమలటంలేదు. వెడితే జయకి స్కూలు పోతుంది. వెళ్ళకపోతే అన్నగారు ఏమన్నా అనుకుంటాడేమో? ప్రయాణం అంటే మళ్ళీ బోలెడు ఖర్చు. ఏమి చెయ్యాలన్నది తెమలక తలనొప్పి పట్టుకుంది. ఎప్పుడూ ఐదు కొట్టేసరికి ఇంటికి వచ్చేజయ, ఆ రోజు ఎందుకు ఆలస్యం చేసిందో! అని ఎదురు చూస్తోంది శాంత. ఆనందమోహను చాలా వుత్సాహంగా మెట్లు ఎక్కుతున్నాడు. అతన్ని చూడకుండా రోడ్డు చివరకి చూస్తోంది.

"ఏమిటే, రాణీగారు చాలా దీర్ఘాలోచనలో వున్నట్టున్నారే" అని శాంతపక్కకివచ్చి నిల్చున్నాడు.

'జయ ఇంకా రాలేదేమిటి?' అంటూ దూరంగా జరిగింది.

'అదా సంగతి. ఇంకా నాకోసం చూస్తున్నావేమో అనుకుంటున్నా. ఇక లోపలికి దయచేయవచ్చు; ఏలనన పుత్రికారత్నంబు సినిమాకి వెడలినట్లు విన్నవించమని ఆజ్ఞ మంజూరు చేసిరి.'

'అబ్బా, ఏమిటా మాటలు. ఇంకానయం వాళ్ళకి మన భాష తెలవదుకనక సరిపోయింది. లేకపోతే ఎగతాళి చేసేవాళ్ళు.'

'రాణీగారి ఆజ్ఞ శిరసావహించెదగాక; ఈ దీనుడు పోవుచున్నవాడు.'

ఫలహారం తెచ్చి బల్లపైన పెట్టి దూరంగా కూర్చుని, 'చూడండి మీ హాస్యధోరణిని కొంతసేపు వదిలెయ్యండి బాబూ!' అని మూతి ముడుచుకుంది శాంత.

పళ్లెం ఖాళీచేసి మంచంమీద వెన్నే వాల్చాడు.

'అబ్బ, మాట్లాడితే ఆ ధోరణి, లేకపోతే ఈ పరస, విసుగువస్తోంది బాబూ, అంటూ మంచంకోడుమీద కూర్చుంది.

రెప్పవాల్చకుండా శాంత కేసి చూస్తున్నాడు.

'అబ్బబ్బ, ఈ పెళ్ళికి తప్పకండా వెడతా. అప్పుడు కానీ తెలవదు' అని విసుక్కుంది.

'ఈ వుపోద్ఘాతం బంతయు ప్రయాణంబుకా దేవీ! అటుల చెప్పుము. ఏ ప్రాంతంబుకు విజయము చేయుచుంటిరి.'

'నా తలకాయ. ఏడుపొస్తోంది. అన్నయ్యకూతురు పెళ్ళిట, శుభలేఖ తెచ్చి ఇచ్చింది శాంత.

'పైకం ఏమయిన పంపియుండిరా?'

'ఏమిటండీ మీ గొడవ. పైకం లేదు, గియికం లేదు. ఆఖరికి వుత్తరం కూడా రాయందే.'

'అటులైన ఏమి చేయదలంచితిరి?'

'మీ రేమి చెప్తారో అని నేను అనుకుంటే నన్నే అడుగుతున్నారా? బాగుంది.'

మెట్లు తలుపు తెరచిన చప్పుడయి వరండాలోకి వెళ్ళింది శాంత.

'ఆనంద్ గాడు రాలేదా?' అంటూ కోటేశ్వరరావు గుంపు జొరబడింది.

వాళ్ళని చూడగానే వళ్ళు చల్లబడ్డంత పని అయింది శాంతికి. వాళ్లువస్తే వోపట్టాన పోరు. ఒహవేళ వదిలించు కున్నా, కొంత డబ్బు అప్పుపేసుతో అర్పించుకోవాలి. తను వెళ్ళేందుకే డబ్బు వుంటుందో వుండదో; తెలివితక్కువ, కాక పోతే అక్కడే లేరని చెపితే పోయేవాళ్ళేగా? ఇప్పుడు అనుకుని మాత్రం ఏమి లాభం.

వాళ్ళతో కలిసి ఆనంద్ మోహను బయలుదేరాడు. శాంతని తలుపు వేసుకోమని సైగచేశాడు.

మళ్ళా వంటరిగా వుండాలి. పోనీ జయవున్నా కొంత మెరుగు. 'పాపం దానికేం తెల్సు. చిన్నపిల్ల' అని విసుక్కుంది.

ఎన్నో యేళ్ళు ఈ బొంబాయి కాపరంకోసం కలలు కంది. జయ పుట్టేదాకా ఆ మాట నెగ్గనేలేదు.

వచ్చిమాత్రం ఏమి బావుకున్నట్టు? చాలా యేళ్ళు పొద్దున్న వెడితే, రాత్రి పదికొట్టాల్సిందే రావటానికి. కొత్తగా ట్టిన కాపరమని ఎంతో వోర్పుతో మసులుకుంది. ఇప్పుడు ోదా పెరిగి ఇంటికి తొందరగా వస్తున్నారనుకుంటే ఈ గహాలు పట్టుకుంటున్నాయి. ఎంత వస్తుందో ఏమో. నగలన్నీ కర్పూరంలా కరిగిపోయాయి. తనకి వాటిమీద మోజు లేదు. కానీ వెళ్ళేది పల్లెటూరు పెళ్ళికి. వాళ్ళ గౌరవం అంతా మెడ నిండా వుంటేనే, తనకి మిగిలినది అరిగిపోయిన వక్కపేట గొలుసు; చేతులు చూసుకుంది. వక్కజత గాజులు; వుసూరు మంటూ కనపడుతున్నాయి. చీకట్లో చాలాసేపు కూర్చున్నట్టు గుర్తుకివచ్చి లేచి లైటు వేసింది.

స్టౌవును ముట్టించి వంటపనిలో పడింది. ఎన్ని చేసినా టయిము ఎనిమిది దాటలేదు. బట్టలపెట్టి తెరచి ముందుపెట్టు కూర్చుంది. చీరలు అన్నీ రోజూ కట్టుకునేవే. పెళ్లికివెడితే ఏమి కట్టుకోనటం? అన్న కొత్తబెంగ ఇంకొకటి తయారయింది.

జార్జెట్సు ఆ పూళ్ళల్లో కట్టుకుంటే ఏమి బాగుంటుంది? ఏం చెయ్యటం? అదే కట్టుకోవాలి అని పైకితీసి సరిగ్గా మడత పెట్టి మళ్ళా పెట్టేసింది. కాయితాలకట్ట బయటికి తీసింది. ఎప్పుడేనా డబ్బుపెట్టి మర్చిపోయి వుండొచ్చు. చాలా జాగ్రత్తగా ప్రతీదీ రెండేసిసార్లు చూసుకుంటోంది. పొరపాటుసికూడా పెట్టనందుకు విసుక్కుంది. తండ్రి పంపిన దస్తావేజు ముందు దూరంగా విసిరేసినా మళ్ళాతీసి మడత విప్పింది. పదిరూపాయల నోట్లు రెండు – సంతోషంతో గుండెలు కొట్టుకున్నాయి. నిజమో కాదో అని తిప్పి చూసుకుంది.

ఆ దస్తావేజు వోసారి చదువుకుని, కవులు కాయితం ఉండే తప్ప అన్నగారు వక్క దమ్మిడీ తనకి పంపనందుకు కోపం తెచ్చుకుంది. 'వెడుతున్నాగా, దీని సంగతికూడా చూస్తా' నని పెట్టెలో పెట్టుకుంది. పక్కవాటాలోనివాళ్ళు సినిమానించి వచ్చేశారు. మళ్ళా జయకోసం చూస్తూ ముందుకువచ్చి నిల్చుంది.జయని విడిచి, వసంత వెళ్ళటం చూసి శాంత లోలికి వెళ్ళిపోయింది.

జయ మొహమ్మీదికి పడే జుట్టుని వెనక్కి తో కుంటూ పుస్తకాల బాగ్ మోసుకొచ్చి తండ్రి బల్లమీ పడేసి, "చాలా బాగుంది అమ్మా పిక్చరు" అంటూ తల్లి

మెడని చుట్టుకు దగ్గరగా నిల్చుంది. చెయ్యి విడదీసి "వెళ్ళి బట్టలు మార్చుకో" అంది శాంత.

రోజూ స్కూలునించి రాగానే కొంతసేపు తల్లి దగ్గర గారాలు చెయ్యటం అలవాటు పడింది. తల్లి అన్నమాటకి. దుఃఖము వచ్చినంత పనిఅయి అక్కడే కదలకుండా నిల్చుంది జయ.

ఆనంద మోహను రావటం చూసి జయని తీసుకు వంటగదికి వెళ్ళింది శాంత. జయ తింటూనే కునికిపాట్లు పడుతోంది.

శాంతకి ఏమిచేస్తే కోపము వస్తుందో అది చెయ్యటం సరదా; కోపంలో చేసే చేష్టలకి పగలబడి నవ్వటం. అది చూసి శాంత ఇంకా వుడికిపోవడం, చివరికి ఏడుపు మొదలుపెడితే, దేవీ కనికరించి వరాలు కోరుకో అన్నాము' అంటూ ప్రాధే యపడి చాలావాటికి వప్పేసుకుని రాజీ కుదుర్చుకోవడం ఆనం ద్ కి ఆనందం.

ఆ రోజు వరాల్లో వూరికి పంపటం వకటి. జయని జాగ్రత్తగా శాంత వచ్చేటంతవరకూ చూసుకోవటం రెండు. ఈ రెండూ అట్టే ఇబ్బంది పడక్కర్లేదు అనుకున్నాడు. ఇంక మూడోదే కాస్త మడతపేచీగావుంది. పుష్కలంగా డబ్బు ఎక్కడ తెచ్చేదా అని.

అందులో నెల చివర ఎవర్ని అడగటం అన్నదానికి సమాధానం రావటం లేదు. పోనీ వెళ్ళవద్దు అంటే ? శాంతని పిల్చాడు. అప్పుడే నిద్రపట్టినట్టుంది. పలక లేదు. పాపం, కోపం తప్ప ఏమీ తెలీదు. ఇన్నేళ్ళనించీ నోరు తెరిచి వెడతానని

అడగలేదు. అప్పుడే జయకి కొన్ని నెలల్లో పది ఏళ్ళు పూర్తి అవుతాయిలావుంది. తను ఎన్నిసార్లు తన వాళ్ళదగ్గరికి వెళ్ళి వచ్చిందీ గుర్తుచేసుకున్నాడు. శాంత మంచంచివర కూర్చుని అలిసిన మొహంలోకి చూస్తున్నాడు. కళ్ళకింద గీతలు వెక్కిరిస్తున్నాయి. బుగ్గలు లోతుకి పోయాయి. కళ్లు ఇంకా విశాలంగా పొడుగ్గా కనబడుతున్నాయి. చేతిగాజుల్లో వేళ్ళు పెట్టి తిప్పుతున్నాడు. గుండ్రంగా పొట్లాల్లావుండే చేతులు పుల్లల్లా తోచాయి. తన సుఖం చూచుకోదు. ఎప్పుడూ తండ్రీ కూతుళ్ళని మేపడంతోనే సరిపెట్టుకుంటుంది. తిరిగి వచ్చాక శాంత విషయం తను కనుక్కోవా లనుకున్నాడు ఆనందమోహను.

పాలగంటకి వులిక్కిపడి లేచింది శాంత. చీటీ ఇచ్చి సీసా పుచ్చుకుంది. ప్రయాణం సంగతి వాడికి ఎందుకు చెప్పటం అని వూరుకుంది.

రోజూ తెల్లవారేసరికి వంట చెయ్యడం మామూలే. ఆ రోజు రాత్రికి కూడా రొట్టెలు చేసి పెట్టేసింది. స్నానం చేసిన వళ్ళుఆరకుండానే వచ్చిన ఆలోచన చెప్పాలని ఆనందుని లేపింది. చల్లటి చేతులు వంటికి తగలగానే మెళుకువ వచ్చినా కళ్ళు తెరవలేదు. శాంత మొహం దగ్గరగాపెట్టి లేవమని గోణిగింది. ఆనంద్ చేతిలో ఇరుక్కుంది. చెప్పేది వినండి అంటూ విడిపించుకుంటూ చెప్పుకుపోతోంది. ఇప్పుడుమళ్ళా చెప్పు అని నవ్వుతున్నాడు. 'పోండి' అంటూ మెల్లిగాకొట్టి కొంగులో మొహం దాచుకుంటూ తప్పించుకుపోయింది.

మళ్ళీ ఎవరిపనుల్లో వాళ్ళు హడావిడిగా తిరుగుతున్నారు. కారియర్లుసర్ది నీళ్ళసీసాలతోసహా సిద్ధంచేసి వాకిట్లో

పెట్టింది శాంత. ఆఫీసుకు వెళ్ళే వేషంతో వచ్చి శాంత కెదురుగా నిల్చున్నాడు. చేతి కున్న గాజులజత తీసి ఇచ్చింది.

అవి తీసుకునేందుకు మనస్కరించలేదు. 'ఆఖరిజత కాదూ' అని శాంత కళ్ళల్లోకి చూశాడు.

"పోనీ మానెయ్యమంటారా ?' అని అమాయకంగా అడిగింది.

'జయతో చెప్పావా ప్రయాణం సంగతి' అంటూ జయని పిల్చి 'మీ అమ్మ వూరికెడితే మనిద్దరం వుందామా?' అని అడిగాడు.

వుండననీ, వుంటాననీ చాలాసేపు గొడవచేశాక వుండేందుకు వప్పుకుంది.

శాంతని స్టేషనుకి రమ్మనమనిచెప్పి తను అక్కడికేవచ్చి కలుస్తానని చెప్పి ఆనందమోహను వెళ్ళిపోయాడు.

జయ స్కూల్ బస్ హారన్ వినగానే బిక్కమొహం పెట్టింది. 'మళ్ళా ఎప్పుడు వస్తావమ్మా' అని పుస్తకాలసంచి కిందపెట్టి అడిగింది.

శాంతకి కళ్ళు చెమ్మగిల్లాయి. 'ఇదే మొదలు విడిచి వుండటం. తొందరగా వచ్చేస్తాలే. నాన్నగారు వుంటారుగా. భయంలేదు. పక్కఇంటి పాటి నీకు కావల్సినవన్నీ చేసిఇస్తుంది.' అని దగ్గరగా తీసుకు తలనిమిరింది. మళ్ళా హారన్ మోగేసరికి పరుగెత్తుకుంటూ వెళ్ళింది. కిందకెళ్ళి టాటా చెప్పింది.

బస్సు వెళ్ళేదాకా చూసి శాంత లోపలికి వచ్చింది. పోనీ మానేస్తేఏమి అనిపించింది. వీళ్ళని అవస్థపెట్టి వెళ్ళడమేమిటి? అని ఆలోచనలతో సతమత మవుతోంది. పక్కఇంటి

పాటివచ్చి 'బండి ఎన్నిగంటలకి' అని అడిగాక మళ్ళా వెళ్లేందుకే నిశ్చయించుకుని తొందరగా సర్దటం మొదలుపెట్టింది.

పాటి మొల్లో డబ్బుతీసి శాంతచేతిలో పెడుతూ 'మళ్లా నువ్వు ఇచ్చేటప్పుడు మా కోడలు చూడకుండా ఇవ్వు' అని చెప్పింది.

'వద్దులెండి, వారు స్టేషనుకి తెస్తానన్నారుగా' అని చేతులు దాచుకుంది శాంత.

'ఒక సమయంలో రాకపోతే ఏమిచేస్తావు? నువ్వు తిరిగి వచ్చిన వెనక ఇద్దువులే; తొందరేమి' టంది పాటి.

వక్కర్తీ ప్రయాణం చెయ్యటం పుట్టాక అదే మొదలు కానటం మూలాన కొంత ఖంగారుగా వుంది. పాటిని స్టేషను దాకా తోడురమ్మని తీసుకెళ్లింది.

'బండి వచ్చేసింది' మీాఆయన ఎక్కడ! అంటూ వెతుకుతోంది పాటి. 'నీ దగ్గరవున్న డబ్బు ఇవ్వు, టిక్కెట్టు తెస్తా'నని పాటి వెళ్ళబోయింది. ఆనందమోహను హడావిడిగా ముందుకి వెళ్లిపోతుంటే పాటి అరచింది.

అప్పటికే ఎక్కడా ఖాళీ లేదు. అన్ని పెట్టెలూ కిక్కిరిసి వున్నాయి.

'రెండవ తరగతి ఆడవాండ్ల పెట్టె సుమారుగా జాగా వుంది' అని పాటి చూసివచ్చి చెప్పింది. శాంతని ఎక్కించి ఆనంద్ టిక్కెట్టు మార్చేందుకు వెళ్ళాడు.

రైలు కదులుతూండగా వచ్చాడు. కూడా నడుస్తూ టిక్కెట్టూ డబ్బూ చేతికి ఇచ్చి, ప్లాస్టిక్ గాజులు ఎఱ్ఱవి జేబులోంచి తీసి లోపలికి విసిరాడు. రైలు ఎందుకో వక్కకుదుపు

కుదిపి ఆగింది. ఆనంద్ వేగంగా శాంత పెట్టెదగ్గరికి వచ్చాడు. 'నా దగ్గర డబ్బు వుంది. పాటిదగ్గర తీసుకున్నా. మీ దగ్గర పెట్టుకోండి.' అని ఆనంద్ జేబులో పెట్టింది శాంత. ఇంటిదగ్గర ఏర్పాట్లన్నీ ఏకరువు పెడుతోంది. పూర్తికాకుండానే రైలు జరిగింది. పాటితో వెళ్తున్నట్టు చేత్తో సైగచేసింది. చేతికి తొడిగిన గాజులు చూసుకుంది. ఆనంద్ కనబడేటంతవరకూ చూస్తూ వెళుతున్నట్టు చేయి కదుపుతూనేవుంది.

ఎవరిసామాన్లు వాళ్లు సర్దుకుంటూ చాలాసేపు గడిపాక మాటలు, ప్రశ్నలు మొదలుపెట్టారు. శాంత కిటికీలోంచి బయటికి చూస్తోంది. లోనావాల వచ్చేసింది. మేఘాలు కూడా వస్తూన్నట్టు కనపడుతున్నాయి. వాటి ఆకారాల్లో తండ్రీ, పినతండ్రీ, అన్నగార్లూ అంతా కనపడి వెళుతున్నట్టు వూహిస్తోంది. 'ఎన్నేళ్ళ తరువాత మళ్లా ఈదారిని చూస్తున్నా' ననుకుంది.

ఆ పెట్టెలోనే ప్రయాణం చేస్తున్న మరో తెలుగు ముసలమ్మ ప్రశ్నలవర్షం కురిపిస్తోంది. ఏవూరువెడుతూంటా? మీ ఆయనకి ఏమి పని? జీతం ఎంత? అన్నింటికి ముభావంగా సమాధానం చెప్పే శాంతకేసి వకసారి కోపంగా చూసి పక్కకి తిరిగి కళ్ళుమూసుకుంది. అంతదూరం నించి వచ్చినా, నిడదవోలు వచ్చేసరికి ఖంగారు ఎక్కువయింది. తన సామాన్లు అన్నీ గుమ్మందగ్గరికి చేర్చింది; చేగల్లు దాటింది. కాళ్లు చేతులు వణుకుతున్నాయి. కొవ్వూర్లోనే దిగుతానని తనతో కూడా ప్రయాణం చేసిన ముసలమ్మకిచెప్పింది, స్టేషను వచ్చేసింది. ఎల్లాగో కొంత ధయి

(2)

ర్యాన్ని పట్టుకు వెళ్లాడి, మెల్లిగా దిగి, తన సామాన్లు దింపు కుంది. తెలిసిన మొహం ఒక్కటీ కనపడలేదు. తను వెళ్ళాల్సిన చోటికి బస్సులు పడ్డాయట. వెళ్ళేవాళ్ళతో కలిసి బస్సెక్కింది. వంతెన ముందే బస్సు ఆపి దిగమన్నాడు. అక్కడ నించి ఎల్లా వెళ్ళటమా అని దిగులుతో నాలుగుపక్కలా చూస్తోంది.

వీరయ్యతాత కిర్రు చెప్పులు చప్పుడు చేసుకుంటూ అటే వస్తున్నాడు. శాంత ఎదురెళ్లి "తాతా" అని పలకరించింది.

కళ్ళపైన చెయ్యి పెట్టుకు "ఎవరు?" అని అడిగి 'శాంతమ్మవికదూ?' అని గుర్తుకు తెచ్చుకు చాలా సంతోషంగా యోగక్షేమాలు అడిగాడు. "అయితే మీ అన్న వచ్చాడా పిలుపుకి" అని శాంతకేసి చూసాడు. "అబ్బే ఎవ్వరు రాలేదు. శుభలేఖ మాత్రం వచ్చింది." అని వూరుకుంది శాంత.

ముక్కుమీద వేలు వేసుకున్నాడు.

"పట్నం వెళ్ళి మరదల్ని పిల్లల్ని తీసుకొచ్చాడంట. నువ్వా చెల్లిలివేగా! వచ్చావుగా! అయి అన్నీ ఎందుకులే. నా తెలివి నిల్చోపెట్టి మాట్లాడుతున్నా" అని నొచ్చుకున్నాడు వీరన్న.

"ఎవరైనా మనిషి వుంటే, సామాన్లు ఇంటికి పట్టుకురావాలి" అని నసిగింది శాంత.

కళ్ళపైన గెడ్డం ఆన్చి ఎవరైనా వస్తున్నారో ఏమోనని చూస్తున్నాడు వీరన్న.

"అయితే తాతా నా పొలం నువ్వే చేస్తున్నావా?" అని అడిగింది శాంత.

"వక ఏడాదేగా నాకు ఇస్తా. మీ అన్నే చేసుకుంటు న్నాడు. ఏమి ఇస్తున్నాడు ? ఏంటి సిస్తు?" అని వీరన్న అడిగాడు.

'ఇంతవరకూ వక్క దమ్మిడీ పంప లేదు. ఎప్పుడూ నష్టము వస్తోందని ఏటా వో వుత్తరం మాత్రం వ్రాస్తాడు. ఇప్పుడు భూములు ధర ఏమన్నా పెరిగాయా' అని అడిగింది శాంత.

పెరక్కేం, నీ భూమికి యకరం ఐదు, లేకపోతే ఆరు వేలు రావచ్చు. ఏం అమ్మేస్తావా' అన్నట్టు చూశాడు.

'నేను వుండగా బేరం వస్తే బాగుండును' అంది శాంత.

'మీ అన్ననిగాని బేరం పెట్టమంటివా రెండేలుకంటే లేదు అంటాడు ధర. నీ యిష్టం మరి,' చుట్ట దూరంగా పారేస్తూ వీరన్న చెప్పాడు.

"నువ్వు ఎవరికేనా చెప్పి బేరం పెట్టి పెడుదూ. అన్నీ కుదిరాక చెపుతాను" అంది శాంత.

"నేను బేరం పెట్టా"నని తెలుస్తే గోలపెడతాడు. నాతో గొడవ పెట్టుకున్నాడుగా, మాటల్లేవు. అయినా నీ భూమి కనక చెప్పిచూస్తాలే, సాయంకాలంమాటు వోపాలి ఇంటికిరా. మీ మామ్మని కూడా చూడచ్చు. ఎవర్నేనా పిల్చుకొస్తా, శానా సేపు నిల్చున్నావు.ఎప్పుడు తిన్నావో ఏమో" అంటూ వెళ్ళాడు వీరన్న.

వెంట పెట్టుకొచ్చిన కుఱ్ఱాడికి గుర్తు చెప్పి పంపాడు. నీళ్ల బేగ్ శాంత పట్టుకు వాడితో కూడా నడుస్తోంది. చాలా

ఇళ్లు, కొత్తగా కట్టిన డాబాలు, పెంకుటిళ్లు - వూరు ఎంత మారింది అనుకుంది శాంత.

వో కొత్త డాబాలోకి తీసుకెళ్లాడు కుఱ్ఱాడు. పెద్ద పందిరి ముందువున్నా ఇల్లు బాగానే కనపడుతోంది. అరుగుమీద అంతా కొత్తవాళ్లే. అన్నగారు లోపలినించి వస్తున్నాడు. "ఎప్పుడు వచ్చావే" అని వొక్కమాట అని కూర్చున్నవాళ్ల దగ్గరికి వెళ్లాడు.

శాంత మనస్సు చివుక్కుమంది. ఎన్నో ఏళ్లతరవాత వచ్చినందుకు ఎంతో ఆదరణ చూపుతాడు అనుకుంది. సామాను వో మూల పెట్టమంది. వాడి చేతిలో డబ్బులు పెట్టి లోపలికి వెళ్లింది శాంత.

వడ్డాణంబెట్టు వెనక్కి జరుపుకుంటూ వదినగారి చెల్లెలు ఎదురయింది. 'ఏవమ్మో్మావు వదినా' అంటూ కౌగలించుకుని 'ఎప్పుడు రావటం? అన్నయ్యేరీ?' అని అడిగింది.

'నేనే వచ్చా. మీ అన్నయ్యకి శలవుదొరక లేదు' అని చెప్పింది శాంత.

అప్పగారితో 'మీ ఆడబిడ్డ వచ్చిందేవు' అని చెప్పి శాంతని స్నానం చేసేందుకు పిల్చుకెళ్లింది. పెట్టె అవి గదిలో పెట్టించింది రాజ్యం. శాంతకి ప్రయాణం బడలిక అప్పుడు తెలుస్తోంది. వదినగార్ని తనే వెళ్లి పలకరించింది.

'ఏ పదిమంది వున్నారని. వక్కపిల్ల పెళ్లి, నాలుగు రోజులు ముందువస్తా వనుకున్నాము. పోనీలే అసలు వచ్చావు అదే సంతోషం' అంది వదిన ఏదో మాట్లాడాలిగదా అన్నట్టు.

నాలుగు మెతుకులుతిని సామాను పెట్టిన గదిలోకి వెళ్లి వో చాప పరుచుకు పడుకుంది. ఎంతసేపు పడుకుందో ఏమో లేచేసరికి పొద్దు కుంకుతోంది. ఇంకా బద్ధకం వదల్లేదు. వంట గది గుమ్మానికి చేర్లపడి నిల్చుంది శాంత.

వదినగారి సిగకి పువ్వులు చుట్టుతోంది భాగ్యం. 'మీ సొంత ఆడబిడ్డ వచ్చిందిటగా. ఇంక మేము అవసరం వుండంలే.' అని భాగ్యం చెల్లెలు లక్ష్మి చెప్పతోంది.

'ఎక్కడో వుండి ఏటికి కోటికి అన్నట్టివస్తే ఏమి ప్రేమలు వుంటాయి. నిజంచెప్పద్దూ. మీ దగ్గరవున్న చనువు అమ్మాయి దగ్గర నాకు లేనేలేదు. మళ్ళా చెప్పలేదు అనుకునేరు. పెళ్లివారు వెళ్లేదాకా మీరు ఇంక ఇంటికి వెళ్ళడానికి వీల్లేదు, తెల్సిందా. పిల్లతో కూడా మిమ్మల్ని పంపాలని వుంది' అని వదినగారు చెప్పటం శాంత వింది.

పెరట్లో రాజ్యం పువ్వులు గుచ్చుతోంటే శాంత అక్కడికి వెళ్లి కూర్చుంది.

'ఇప్పుడే లేచావా?' అని గుచ్చేసూది శాంత చేతిలో పెట్టి వెళ్లింది రాజ్యం.

టిఫిను కాఫీ తెచ్చి తీసుకోమని శాంతముందు పెట్టింది రాజ్యం.

'ఈ పిల్లకి ఎందుకో తనంటే ఇంతప్రేమ' అనుకుంది శాంత.

'పెళ్లి పిలుపుకి బయలుదేరమని తొందరపడుతున్నాడు పురోహితుడు. ఏమే రాజ్యం అల్లా కూర్చుంటె ఎట్లాగే, పిలు

పుకి వెళ్లాలి లే అని, ఆ పక్కనవున్న శాంతతో, 'నువ్వు కూడా రా వెడదాము' అని వదినగారు పిలిచింది.

'నేను గుచ్చిపెడతా, నువ్వు వెళ్లు రాజ్యం' అంది శాంత.

'మీరు వెళ్లిరండి, నేనూ వదినా కలిసి నరుసుకి జడ కుడతాము' అని రాజ్యం అనటంతో పిలుపుకి వెళ్లటం తప్పింది.

రాజ్యం అందిస్తోంటే శాంత అట్టకి పువ్వులుపెట్టి కుట్టింది. ఇద్దరూ కలిసి ఎంతో అందంగా జడ తయారుచేశారు. గులాబిపువ్వులు రావటంతో రెండు పెద్దదండలు గుచ్చి చెమ్కీ చుట్టింది శాంత.

'ఎంతబాగా గుచ్చిందో చూడ' మని రాజ్యం పందిట్లో వున్న బావగార్ని పిల్చుకొచ్చి చూపెట్టింది.

శాంతపక్కన కూర్చుని 'మీ ఆయన రాలేదేమే' అని అన్నగారు అప్పుడు అడిగాడు.

'శలవు దొరకలేదు. జయకి స్కూలు పోతుందని తీసుకు రాలేదు' అని సర్దిచెప్పింది శాంత.

వచ్చే బంధువులు వస్తున్నారు. ముహూర్తానికి రమ్మని పిల్చేందుకు రాజ్యం శాంత కూడా వెళ్లారు. ముహూర్తం సమీపిస్తున్నా వియ్యపురాలు రాలేదు. ఏమిటి అని ఆరాతీస్తే లక్ష్మిని కాఫీ పంపమందిట. ఇప్పుడు వీలులేదు తెల్లారితేకాని అందిట. దాంతో వాళ్లు రామని కూర్చున్నారని వార్త తెచ్చాడు ఒక పెద్దమనిషి.

ఎవర్నీ అడక్కుండానే రాజ్యం శాంతా బిందెడుకాఫీ చేయించి తీసుకెళ్లి దగ్గరుండి అందరికి ఇచ్చి పిల్చుకువచ్చారు.

మొగపెళ్ళివారికి శాంతమీద రాజ్యంమీద గౌరవం ఏర్పడింది. ఏది కావల్సినా వీళ్ళనే అడుగుతున్నారు. శాంత కూడా వడ్డనలోకి, అదీ పెళ్ళి చేస్తోంది.

వచ్చిన బంధువుల్లో వకావిడ 'నగలు మోటని పెట్టుకో లేదా? లేక మాలాగే లేకా' అని అడిగేసింది శాంతని.

పక్కనవున్న రాజ్యం 'లేకేమి ఖర్మం. ఆ వూళ్లో ఇక్కడలా దిగేసుకుంటే జంతువుల్ని చూసినట్టు చూస్తా' రని ఖచ్చితంగా జవాబిచ్చింది.

ఆవిడ పక్కనేవున్న లక్ష్మి 'అబ్బో చెప్పావులే. మా తోటికోడలు చెల్లెల్ది కూడా బొంబాయే. ఎన్నో కొత్తనగలు పెట్టుకు వస్తూవుంటుంది. అక్కడివాళ్లు బోలెడు పెట్టుకుంటారని కూడా చెప్పింది;' అని రాజ్యంతో అంది.

'ఆవిడ కోతలు వినేందుకు నువ్వు దొరికివుంటావు. లేక పోతే అన్ని నగలు రోజూ పెట్టుకు తిరిగితే ఈపాటికి ఎవడో ఎత్తుకుపోయి వుండేవాడే' అంది రాజ్యం.

శాంత ఏమీ మాట్లాడకుండా ఇంకోచోటికి వెళ్లింది. రాజ్యం కూడా వచ్చి పక్కనే కూర్చుంది.

పెళ్ళివారి అలకలు, తీర్పులు అన్నీ సవ్యంగా జరిగాయి. అప్పగింతలు అయి అంతా శోకాలు పెడుతున్నారు. పిల్లతో వచ్చేవారంతా బయలుదేరండి అని చెప్పి వెళ్ళారు.

'ఎవర్ని పంపమంటావు' అని రాజ్యాన్ని సలహా అడిగింది అప్పగారు.

'నేను రేపు వెళ్ళిపోవాలి కనక మీ ఆడబిడ్డని పంపు' అని చెప్పింది. వెనక నిల్చున్న లక్ష్మి 'శాంతక్క వెడితే మేము వెళ్ళం బాబూ' అని మూతి ముడుచుకుంది.

'మీ అప్పచెల్లెళ్ళు ఇద్దరూ, మా పిన్నీ వెళ్ళండి' అని లక్ష్మికి చెప్పింది వదినగారు.

రాజ్యానికి అప్పగారిమీద కోపం వచ్చినా పయికి తేల లేదు. అసలు ఆడబిడ్డ అంటేలేదు; అన్నదమ్ములాళ్ళ పిల్లల మీద ఎందుకు ఇంత అభిమానమో అర్థంకాలేదు. ఏనా నా కెందుకులే అని సరిపెట్టుకుంది.

పెళ్ళివారు వెళ్ళగానే సందడితగ్గి బావురుమన్నట్లు వుంది ఇల్లు.

శాంతకి విజయ ఏమి చేస్తోందో అని గుర్తుకు రాగానే ఆరోజే బయలుదేరా లనిపించింది. వీరయ్య యింటికి దారి తెలుసుకు వెళ్ళింది. వీరయ్యభార్య ఎదురువచ్చి ఎంతో ఆప్యా యతతో లోపలికి తీసుకెళ్ళింది చిన్నప్పటి ముచ్చట్లు ఎంతో సేపు చెప్పింది. 'మీ నాన్నేనా అమ్మేనా వుండివుంటే ఇన్నేళ్లు చూడకుండా వుండేవారేనా?' అని కళ్లు వత్తుకుంది.

శాంతకి కూడా కళ్లు నీళ్లతో నిండాయి 'అమ్మాయి' అంటూ వీరయ్య లోపలికి వచ్చాడు.

'నీ భూమికి పద్దానుగేలు వచ్చేట్టు బేరం తెచ్చాను. ఓ పోటీమీద వచ్చింది. లేకపోతే ఎనిమిదేలకంటే రాదు. నీ కిట్టమయితే సెప్పు; ఇప్పుడే అగ్రిమెంటు రాయించేత్తా.'

శాంత తన చెవుల్ని తానే నమ్మలేక పోయింది. 'తండ్రి తనకి ఇచ్చినప్పుడు అంతా పట్టుభూమి అని హేళనచేశారు అత్తారి

వేపు. ఇప్పుడు అంతధర పెరుగుతుందని తెలిస్తే, వాళ్లకి తగిన సమాధానం చెప్పివుందును. ఏమిలాభం. ఈ సంగతి వాళ్లకి ఇప్పుడు తెల్సినా అప్పులకోసం పీకుతారు' అనుకుంది.

'ఏటి అమ్మాయి ఆలోసిస్తున్నావు'అని వీరన్న అనగానే, 'అబ్బే ఏమి లేదు. నీ కంటే ఈ వూళ్లో నా మంచికోరే వాళ్లు ఎవరున్నారు? నీకు మంచిదనితోస్తే ఇప్పుడే వ్రాయించెయ్యి. అన్నయ్యకి ఎప్పుడు చెప్పాలి అన్నదే భయంగావుంది' అంది శాంత.

'నన్నేం శాత్తాడులే. నా మీదే సవాల్ చేత్తాడేమో సూడు' అని వీరన్న నసిగాడు.

శాంత వో నిర్ణయానికి వచ్చేసింది. 'ఏమన్నా కానీ అమ్మటం ఖాయం. అన్నగారి సంసారం అన్నివిధాలా బాగున్నప్పుడు, ఇది వాళ్ళకెందుకు వదిలెయ్యాలి? పైగా ఇన్నేళ్ల నించీ దానిమీద వచ్చింది వాళ్లే తీసుకున్నారు. తను వచ్చినందుకు వాళ్లేం ఎక్కువ సంతోషపడటం లేదు. ఎందుకో, ఏమో.'

తండ్రి ఇచ్చింది తనెందుకు అనుభవించకూడదు అనుకుంది. 'పిలిపించి బేరం కుదుర్చు' అని వీరన్నకి చెప్పింది శాంత.

వీరన్న భార్య 'అంత డబ్బు వక్కపాలి ఇత్తాడా?' అని అడిగింది.

'ఆడికాడ వుందిగనకే నేను మాటవరసకనగానే పట్టుకున్నాడు. నాకుమాత్రం తెలవదంటే?' అని భార్యని కసిరాడు.

వీరన్న వెళ్లగానే 'మీ పెద్దత్త పోయేముందు వో గొలుసు, గాజులు చేయించి నా దగ్గరే పెట్టింది. ఏవ్వూసు అన

లేదు అనుకో. శాంతకి వుత్తరం వ్రాయాలన్నా ఆడిసేతేగా రాపించాలనుకునేది. మీ పిన్నత్తకి ఆ వస్తువు సంగతి సెప్పొద్దు అంది. ఎల్లేప్పుడు బాగానేవుంది. అమ్మాయి ఎల్లగానే ఏటో తల్లో మంట అంది అంట. కూసేపట్లో పాణం పోయింది అని సెప్పుకున్నారు. మీ అత్త వడ్డీకిచ్చిన డబ్బు అంతా మీ అన్నే తీసేసుకుని డాబావేశాడు. మీ వదిన వంటినిండా మాలామాపూతలా, ఎంతబంగారం చేసేయించిందోనంట. పెళ్ళికొడుక్కి పదేలు ఇచ్చారంటగా? అని అడిగింది.

తెలవదన్నట్టు పెదిమ విరిచింది శాంత.

'ఇంతకీ నేనుసెప్పేదేమంటే ఆ వస్తువు నువ్వు తీసుకెళ్లు. నేనూ పెద్దదాన్నయ్యాను. తరువాత నీకు ఎవరు చేరుస్తారు కనక?' అని వీరన్నభార్య లోపలికెళ్ళి తెచ్చి కళ్ళకద్దుకు శాంత చేతిలో పెట్టింది. పద్ధాలగు తులాలు గొలుసూ, పదితులాలు గాజులూ' అని చెప్పింది.

పెద్దత్తకి ఎప్పుడూ దూరపు ఆలోచన వుండేది. తన పెళ్ళికి భూమి వ్రాయించిందికూడా ఆవిడే. తండ్రిని పలకసర్లు చేయించమని ఎంతో పోరుపెట్టింది. చేతిలోవున్న పలకసర్లు తిప్పి చూసుకుంది. అసలు మామ్మ ఆ వస్తువు ఇవ్వకపోతే మాత్రం ఎవరు అడగ్గలరు? ఎల్లాగయినా ఆ నిజాయితీ ఆ తరంతోటే ఆఖరేమొ ! తన చిన్నప్పుడు నాన్నదగ్గర వీరన్నతాత ఎంతెంత కట్టలు దాచేవాడో గుర్తుకువచ్చింది శాంతకి.

'ఏటి నవ్వుతున్నావు అమ్మాయి?' అంది.

'అబ్బే చిన్నప్పుడు తాత నాన్నదగ్గరికి డబ్బుకట్టలు తేవడం గుర్తుకొచ్చింది. నేను రోజూ కానీ పుచ్చుకొని గంగి

రెడ్డువాడి కిచ్చి పొగిడించుకోటం గుర్తువచ్చి నవ్వాను' అని శాంత చెప్పి, 'నువ్వు కాబట్టి నాకోసం దాచిఇచ్చావు; మరొహ ళ్ళయితే వారెందుకిస్తారు' అని వినయంగా తాత భార్యతో అంది.

'ఆఁ ముండాది ఇంతమాత్రానికేనా' జనమం అంతా ఎతికితే వకటయినా మంచిపని దొరకలా?' అని నిట్టూర్చింది.

వస్తువులు మళ్ళీ ఇచ్చి, 'వెళ్ళేటప్పుడు తీసుకుంటా. వోసారి చిన్నత్తని చూసివస్తా' నని బయలుదేరింది శాంత.

'చూడు అమ్మాయి డబ్బువూసు ఎత్తమోక, పీక్కుతినెత్తాడు నీ అత్త కొడుకు' అని చెప్పింది మామ్మ.

ఇంటిదగ్గర ఎదురయిన రాజ్యంతో మేనత్తని చూసేందుకు వెడుతున్నానని చెప్పింది. తాను కూడా వస్తానని బయలుదేరింది రాజ్యం. ఢంకెద్దుబండి మాట్లాడింది అప్పలమ్మ. బండి పుంతలోంచి వెడుతోంది. బ్రహ్మజెముడు డొంకలు గులివింద తీగెలు అల్లాగే వున్నాయి. దూరంగా తాటితోపూ, గొడ్ల పాకలూ, అక్కడ అక్కడా చుట్టు గుడిసెలు. పంటకాలవ పైన తాటిబద్దెలు అన్నీ ఎరుగున్న వే. పచ్చటి పొలాలు పలకరించినట్టువున్నాయి. 'ఎన్ని వూళ్ళు తిరిగినా చిన్నతనంలో పెరిగిన చోటు నచ్చినట్టు ఏదీ నచ్చదేమో' అనిపించింది.

"ఎప్పుడో అక్కయ్యతో వోసారి వెళ్ళాను" అని రాజ్యం మాటలు మొదలుపెట్టింది.

"నేను మాత్రం ఏ వకటి రెండుసార్లు వెళ్ళానో అత్తయ్య ఇంటికి. ఎప్పుడూ ఆవిడ నాన్న దగ్గరే వుండేది, మా చిన్నతనంలో" అంది శాంత.

రోడ్డు మరీ బాగుండలేదు. బండికుదుపు భరించలేక రాజ్యం ముందుకి వంగుతూ అంది.

"దేశంలో ఎంత మార్పు వచ్చినా పుంతలో మాత్రం రోడ్డు రాలేదు" అంది శాంత.

బండివాడు చుట్ట పారేసి, "వోట్లకాడ ఆ వూరి ప్రెసిడెంటుగారికి ఈడ నెగ్గిన ధర్మారావుగారికి సెడింది. రోడ్డుకి ఏసిన కంకరు గుట్టలు మళ్లా తీయించేశారండి" అని చెప్పి పాడుబడ్డ గుడి రాగానే 'వచ్చేశామండి వూళ్లోకి' అన్నాడు.

మేనత్తగారి యిల్లు ఏమీ మారలేదు. విరిగిపోయిన మట్టిగోడల మధ్య వున్న పెంకుటిల్లూ, ఇంటి ముందు మురికి గుంటా అల్లాగే వున్నాయి. రాజ్యాన్ని పిల్చుకు లోపలికి వెళ్ళింది శాంత. పెరట్లో చిన్నగుడ్డ చుట్టుకు కూర్చుంది మేనత్త. పరామర్శలు, పలకరింపులు అయ్యాక "అమ్మాయి ఎవరే?" అని అడిగింది మేనత్త.

'మా వదిన చెల్లెలు. మర్చిపోయావా?' అని అడిగింది శాంత.

'ఎవరు రాజ్యమా? ఎవర్నీ గుర్తు పట్టలేకపోతున్నానే; నీ కెందరే పిల్లలు?' అని అడిగి, చూడు మీ వదిన పెళ్ళికి కూడా వచ్చి పిలవలేదు; దాని పొగరు పక్కదాన్ని బతికున్నానుగదా!' అని ఆయాసపడింది మేనత్త.

మాట తప్పించాలని 'ఏదో ఆ హడావిడిలో రాలేకపోయివుంటుంది' అని శాంత అంది.

'ఈ మాటల కేమిలే. అసలు మీ అన్నకి డబ్బదాహం పుట్టింది. అప్ప కూడపెట్టిన డబ్బు అంతా చిల్లిగవ్వ

నాకు ముట్టకుండా తనే తీసుకున్నాడు. మీ వదిన ఎంతో బంగారం కొందిట. అప్పది పెట్టేగా ఈవిడ వడ్డాణాలు గిడ్డాణాలు చేయించింది. నాకు కొంతేనా ఇవ్వచ్చుగా!' అని మూలిగింది మేనత్త.

'మీ కోడలు లేదా' అని అడిగింది. శాంత.

'లేకేం వుంది. కొరివితో తల గోక్కున్న అంత సుఖం, కోడలు మాట్లాడితే. వాడేమో దాని వల్లోపడిపోయె. నాకా వోపికలేదు. అలాగే వార్చి పడేస్తున్నా' అంటూ మళ్ళీ దగ్గటం మొదలుపెట్టింది మేనత్త.

రాజ్యం 'వెడదామా' అని అడిగింది.

'ఏమి పొద్దినే అప్పుడే వెళ్లటమా?' అంటూ కోడల్ని పాలిబొబ్బలు పెట్టింది రమ్మని శాంత మేనత్త.

కొడుకు వచ్చాడు కోడలు బదులు. 'అది ఏదిరా?' అని తల్లి అడిగింది.

"ఎందుకు అల్లా అరుస్తావ్? ఎన్నిసార్లు చెప్పాను, దాని వంట్లో బాగుండనప్పుడు పిలవద్దని," కసిరాడు.

"సడేలే, దానికీ నాకూ బాగున్న దెప్పుడు కనక. శాంత చూస్తుందని పిలిచాను" అంది తల్లి.

శాంతకేసి అదోలా చూసి "ఎవరో అనుకున్నా. నిన్ను గుర్తుపట్టలేదుసుమా? ఇల్లా తయారయ్యావేం? మీ ఆయనకి ఏమిస్తున్నారు?" అంటూ ఆరాలు మొదలుపెట్టాడు, మేనత్త కొడుకు సూర్యం.

మౌనంగా నవ్వి వూరుకుంది శాంత. "సరే కాని బొంబాయినించి ఏమి తెచ్చావే" అని వెకిలిగా నవ్వుతూ అడిగాడు.

భార్య రావటం చూసి" "లక్ష్మి రా, రా, చుట్టం వచ్చింది" అంటూ భయపడుతూ అటు చూశాడు.

ఉన్న నగలన్నీ వంటిని తగిలించుకుంది. మంచి నలుపు రంగు శరీరంమీద బంగారం గంభీరంగా కనపడుతున్నా ఇత్తడి కళ పుట్టిపడుతోంది వాటికి. "అంత తీరిగ్గా కూర్చున్నారేం" అని కోపంగా సూర్యంకేసి చూసింది లక్ష్మి.

"అబ్బే, తీరికా? అమ్మ ఎందుకో పిలిస్తే వచ్చా, ఈవిడ ఎవరో తెలుసు కదూ?" అని శాంతని ఫలానా అని చెప్పు కున్నాడు భార్యకి.

"ఇంకేం మళ్లా వచ్చి ముచ్చట్లు ఆడుకోవచ్చు. ముందు వెళ్లి నోటు రాయించుకురండి" అని వెటకారంగా శాంతకేసి చూసింది లక్ష్మి.

ఈసారి శాంతకి కోపము వచ్చినా పైకి ఏమనలేదు. "వెళ్లివస్తా" అని మేనత్తకి చెప్పి బయలుదేరింది.

"మా ఆవిడ నిర్వాకం వినకుండానే వెళ్ళిపోతావా ?" అని గర్వంగా సూర్యం లక్ష్మికేసి చూస్తూ శాంతని అడిగాడు.

"కనపడుతూనే వుందిగా ! ఇంక వినక్కర్లేదు" అంది శాంత.

"అబ్బో నిన్ను పొగడలేదనా ఆ అక్కసు" అంది లక్ష్మి.

సూర్యానికి మతిపోయింది. చూడ్డానికి వచ్చిన శాంతని లక్ష్మి నోటినించి రక్షించటం ఎల్లాగో తోచక 'అయితే నువ్వు కూడా వస్తావేమిటి?' అని లక్ష్మిని అడిగాడు!

వాళ్ల ముచ్చట్లు వినకుండానే శాంతా, రాజ్యం వాకిట్లోకి వచ్చారు. మేనత్త వెనకాలే వచ్చింది.

శాంత మేనత్తచేతిలో డబ్బుపెట్టి 'పటికబెల్లం తెప్పించుకో' అంది.

'ఎందుకే' అంటూనే లెక్కపెట్టుకు బొడ్డులో దోపుకుంటూ 'వుండు అమ్మా' అని; లక్ష్మీ బొట్టన్నా పెట్టవే' అని కోడల్ని పిలిచింది.

దొడ్లో వాళ్లు పగలబడి నవ్వుకోవడం వినపడుతోంది. రాజ్యం గడపమీద లక్కపిడతలోవున్న కుంకం శాంతకిపెట్టి తనూ పెట్టుకుని 'వస్తా' మని చెప్పి బయలుదేరారు.

బండి మళ్లా వూరు విడిచి వుంతలోకి వచ్చేసరికి చీకటి పడుతోంది.

రాజ్యం 'ఎందుకు వచ్చానా అనిపించింది వదినా' అని చెప్పింది.

'ఎల్లా బ్రతుకుతున్నారో బాబూ? వున్న కాస్సేపూ తేళ్లూ జెర్రులూ పాకినట్టు అయింది నాకు. వకటి రెండు గదుల్లో వున్నా ప్రాణానికి హాయిగా వుంటుంది మాకు. ఆ అందానికి ఆ నగలు, ఆ మాటలు, ఏదో రాక్షసిలా వుంది, చెప్పద్దూ. పోనీ వాటికేంలే అనుకున్నా ఇల్లైనా శుభ్రంగా పెట్టుకోవచ్చుగా! ఆ ముసిల్దానిచేత వండించకపోతే చేసుకో రాదూ?' అని శాంత రాజ్యంతో అంది.

'నాక్కూడా వచ్చినదగ్గర్నించీ చూస్తే అల్లాగే అనిపిస్తోంది. ప్రతిమాట డబ్బుకి ముడి. అది కాకపోతే సినిమా మాటలు, అవీ అయిపోతే, ఎవరెవరు ఎవరితో లేచిపోయారో

చిట్టాలు తిప్పటం; వినలేక విసుగొచ్చి మనం ఏదయినా అన్నామో వ్యాఖ్యానం మొదలుపెడతారు. నరసుక్కూడా ఈ మాటలు బాగా పట్టుబడ్డాయి. ఇంక మా అక్కకి కూతురు ఏది చెప్పినా అదే సమర్థించి మన్నే తిడుతుంది. మన కెందు కనుకో' అని రాజ్యం వూరుకుంది.

శాంతకి భూమిసంగతి రాజ్యానికి చెప్పాలనిపించింది. కొంతసేపు పోయాక, 'మా నాన్న నాకు ఇచ్చిన పొలంవుంది, దాన్ని అమ్మెయ్యాలని వుంది' అని నసిగింది.

'వీళ్ళు దానిమీద రాబడి ఎప్పుడూ పంపటం లేదు. మీ అన్నగారు ఏమీ అనుకోని మనిషికనక సరిపోయింది' అని రాజ్యంతో అంది శాంత.

'మీకు డబ్బు ఇచ్చి వ్రాయించుకున్నారటగా ఆపొలం' అని రాజ్యం అడిగింది.

'ఇదోటా పైగా, అన్నీ వట్టివే' అని శాంత చెప్పింది.

బండి ఇంటి సమీపానికి రావటంచూసి ఇద్దరూ వూరుకున్నారు.

ఏదో గుర్తుకి వచ్చినట్టు శాంత బండిని వెనక సందులోకి తోలమంది. వీరన్న ఇంటిముందు బండి ఆపి లోపలికి వెళ్లింది. వీరన్న భార్య అన్నం వడ్డిస్తోంది. 'తాతా నాన్న వ్రాసిన దస్తావేజు ఇదిగో' అని బాగ్‌లోంచితీసి చేతిలోపెట్టింది.

'ఇది వుంది కదా? మీ అన్న సవాలు చేశాట్ట—ఎల్లా కొంటాడో రాతాకోతా ఏమీ లేదు' అని అంటూ దీపం ముందుకు వచ్చి చదువుకుని, యొల్లో తాళాలు తీసిపెట్టెలో పెట్టమని భార్యచేతిలో పెట్టాడు.

'రేపు పొద్దున్నే వచ్చేస్తా, పూర్తిచేసి మధ్యాహ్నం బండి ఎక్కించెయ్యి నన్ను' అంది శాంత.

'పూర్తిఅవుతే అల్లాగే ఎల్దువుగాని' అని గిన్నె ముందు కూర్చున్నాడు వీరన్న.

శాంతవచ్చి 'ఆలశ్యం చేసినందుకు ఏమీ అనుకోవద్దు' అంది రాజ్యంతో.

ఇంటికి వెళ్లేసరికి వదినగారు రొప్పుతూ శాంతమీద మాటలు విసరటం మొదలుపెట్టింది.

ఏమీ మాట్లాడకుండా తన సామాన్లు వున్న గదిలోకి వెళ్ళింది శాంత. పెట్టిలోవి అన్నీ కిందపడేసి వున్నాయి. అన్నీ సర్దుకుని పెట్టిమీదే కూర్చుంది.

రాజ్యాన్ని అప్పగారు ప్రశ్నలు వేస్తోంది. "అబ్బే ఇం కెక్కడికీ వెళ్ళలేదే. వాళ్ళింటి కెళ్ళి వచ్చేశాము" అని చెప్ప టంతో కొంత సర్దుకుని 'ఆవిడిని కూడా తిండికి పిలు' అని చెల్లె లితో అంది. ఏదో పూర్తిచేసివచ్చి అక్కడే పడుకుంది. కాని తెల్లవార్లూ నిద్దర పట్టలేదు శాంతకి.

రాజ్యంకూడా పొద్దుటే లేచి రాజమండ్రి వెళ్లాలని అప్పకి చెబుతోంది.

ఆ సమయంలోనే తనూ వెడుతున్నా నని శాంత చెప్పింది.

"నువ్వు అసలు పెళ్ళికోసమే వచ్చావా ? మేము పచ్చగా వుంటే చూడలేక, ఆస్తులు అమ్మకాలు పెడుతున్నా

(4)

వుటగా. మేము బాగుంటేనే నీకు ఇంత పెట్టడం" అని మొదలు పెట్టింది వదినగారు.

"నే నేం మిమ్మల్ని పెట్టమని అడగలేదు. నాకు మా నాన్న ఇచ్చిందానిమీద వచ్చేది కూడా మీరే తింటున్నారు. నాకూ మా నాన్న ఇచ్చింది అనుభవించాలని వుంటుంది" అని వుద్రేకాన్ని అణుచుకుంటూ శాంత అనేసింది.

"అబ్బో ఇచ్చాడు. ఎంత చేస్తే అంత మంచిపొలం అయిందో. అసలు ఎవడు కొంటాడో మేమూ చూస్తాము. మీ అన్న కేమీ ఆమాత్రం పలుకుబడి లేకపోలేదు,' అని విసురుగా లోపలికి వెళ్ళిపోయింది వదినగారు.

రాజ్యం శాంతని వూరుకోమన్నట్లు సైగచేసింది. శాంత సామాన్లు బయటికి తెచ్చుకుంది. రాజ్యం చేతిలో వో సిల్కు గుడ్డ పెట్టి కళ్ళనీళ్ళు వత్తుకుంటూ 'నాకు చెల్లెళ్ళు లేరన్న కొరతలేకుండా కూడాకూడా తిరిగావు. మళ్లా ఎప్పుడో చూడటం.' అని 'వెళ్ళివస్తా. అన్నయ్యకి చెప్పు' అని చెప్పింది శాంత.

మళ్ళా వదినగారు వచ్చింది. 'ఈ వూట వెళ్ళేది అదా ఏమిటి చెప్పటం? అయినా మీ అన్నకి నువ్వు అంటే అసహ్యాం వేసే రాత్రి వెళ్ళిపోయారు. చెట్టంతమనిషి ఇంట్లోవుండగా, వూళ్లోవాళ్ళా నీకు బేరాలు పెట్టడం. మాకు తెలియకపోవు. అన్నీ తెలిశాయి. నేను విరోధినీ, నువ్వు చుట్టానివీనా' అంటూ రాజ్యం చేతిలో గుడ్డతీసి విసి రేసింది.

రాజ్యం గుడ్డని తీసుకు కళ్ళకద్దుకుంది.

శాంత వెడుతున్నానని వీధిలోకి వచ్చింది.

'ఎల్లా వచ్చిందో అల్లా మర్యాదగా మధ్యాహ్నంబండికి ఇక్కడినించే వెళ్ళమని. వాళ్ళ అన్న చెప్పారని చెప్పు' అని రాజ్యంతో అంది అప్పగారు.

శాంత కళ్ళు తుడుచుకుని సామాను అప్పలమ్మని తెమ్మని వెళ్ళిపోయింది.

వీరన్న భార్య 'అప్పీ, నువ్వు బస్సుకాడ వుండు' అని పంపేసింది.

శాంత వీరన్న భార్యని కావలించుకుని ఏడ్చి వదినగారు అన్నవి చెప్పకుంది.

ముసిలిప్రాణం కరిగిపోయింది. మాటరాక పెదిమలు వణికాయి.

శాంతని దగ్గరగా తీసుకుని 'ఆళ్ళతోటి ఏటిలే. నువ్వు మీ అమ్మల్లే మంచిపేరు తెచ్చుకున్నావు. నామల్లే చివరంటా సుఖంగా వుండు' అంటూ వస్తువులు చేతిలో పెట్టింది.

'నువ్వే వుంచుకో, నాకెందుకు' అంది శాంత.

'ఎంతమాట అమ్మాయి, నాకెందుకు తల్లీ' అంటూ ఇంత పసుపుమూట చేతిలోపెట్టి ఈ పాతికాపెట్టి కోకా, రయికా కొనుక్కుని కట్టుకో' మంది వీరన్నభార్య.

బస్సుచప్పుడువిని శాంతని తీసుకు రోడ్డుదగ్గరికి వచ్చింది. వస్తానని ఎన్నోసార్లుచెప్పి శాంత బస్సు ఎక్కింది.

అప్పలమ్మ చేతిలో డబ్బు చూసుకోకుండా శాంత మెడ కేసి కన్ను ఆర్పకుండా చూస్తోంది.

'ఏశే, డబ్బులిస్తే తీసుకుపోక' అని వీరన్నభార్య కసిరింది,

బస్సు కదిలింది. వూరి పొలిమేర విడుస్తూంటే శాంత కళ్ళల్లో నీళ్ళు జలజలా రాలాయి. వీరన్న ముందేవున్నాడు. 'వూరుకో తల్లీ' అని పాగా కొంగుతో కళ్ళు తుడుచుకున్నాడు.

వీరన్నతో కూడా బస్సుదిగింది శాంత. ఎక్కడికో తీసుకు వెళ్ళాడు. ప్లీడర్ని పిలిపించి అవతలవాళ్ళకి నచ్చచెప్పించాడు.

అన్నీ పూర్తయ్యాక కొనేవాడు 'అంత డబ్బావ తేలేదు' అన్నాడు.

'ఏటి, నాటక మాడుతున్నావా ?' అని వీరన్న ఎగిరి పడ్డాడు.

'ఇం కెవరో సర్దుతా నన్నారు' అని వెళ్ళి పిల్చు కొచ్చాడు.

'తొందరగా కానివ్వు' అని కసిరాడు వీరన్న.

'పని పూర్తయినా డబ్బు ఎట్టా తీసుకెల్తుద్ది. బ్యాంకి కాయితం తేవాలి' అని బ్యాంకి కెళ్ళాడు వీరన్న.

ప్లాటుఫారంమీద కూర్చున్న శాంతకి వీరన్న మంచి తనమే తిరుగుతోంది బుర్రలో.

"రైలు వచ్చిందా ?" అంటూ హడావిడిగా వచ్చాడు వీరన్న. శాంత చేతిలో చెక్కు పెట్టి "భద్రం తల్లీ" అని చూట్టూ చూసి "లోపల పెట్టెయ్యి" అన్నాడు –

'మీ యిద్దరి రుణం ఎలా తీర్చటం' అంది శాంత.

"మీ నాన్న ఎల్లిపోయాడా ? అల్లాగే నేనూ ఎప్పుడో కళ్లు మూస్తా. నాన్న పేరున పిల్ల పిల్ల అనుభవించాలి. తెల్సిందా ! పాడుచెయ్యక సొమ్ముని జాగ్రత్త చెయ్యి" వంద సార్లు చెప్పాడు.

"రైలు వస్తోంది, మా అన్నయ్య వూళ్ళో లేకుండా వెళ్లి పోయాడు" అంది.

"నీకాడ దస్తావేజు వున్నట్టు తెల్దనుకుంటా. ఆయన వప్పుకుంటేకాని రిజిష్టరు కాదుగా! అందుకని ఎత్తువేశాడు. ఇంక వచ్చాక బలే ఫార్సు జరుగుతుందిలే" అని బోసినోటి నిండా నవ్వాడు వీరన్న. "కొన్నవోడు ఏమీ తక్కువోడు కాడు. చూశావుగా డబ్బు తేలేదని నాటకమాడాడు," అని గర్వంగా చెప్పాడు.

రైలు ఆగినా అంత రద్దీలేదు. ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కించి "జాగ్రత్తగా చేరాక, కార్డుముక్క రాయి" అని మళ్ళీ 'వద్దులే. మీ అన్న కాడికేగా వత్తుంది' అన్నాడు వీరన్న.

శాంత కనపడేటంతవరకు వీరన్న కేసి చూసింది. చెక్కుని భద్రంగా చేతిబ్యాగ్‌లో పెట్టింది. వీరన్నకి అన్నమీద పగతీర్చుకునేందుకు ఇది అదను అయివుంటుంది. అతని ధోరణి కొంచం అల్లాగే అనిపించింది. ఛీ, పాపం తనకోసం ఇంత శ్రమపడితే ఈ ఆలోచనేమిటి అని సమాధానపడింది. ఈసారి రైలుప్రయాణం విసుగనిపించింది. జయ వెళ్ళగానే ఏమిచేస్తుందో! ఇల్లు గుర్తుకి రాగానే ఏవో తియ్యటి కలొచ్చినంత ఆనందంగా వుంది.

బొంబాయి దగ్గరపడింది. తను వచ్చేది తెలియదుగా? ఎవరు వస్తారులే అనుకుంది. ఇంటికి చేరేసరికి పొద్దుతిరిగింది. పక్కవాటాలో సామాను పెట్టిద్దామనుకుంది కాని తలుపులు తీసివుండటంతో కూలివాడిని పంపి తలుపుతట్టింది. ఆనంద మోహన్ తలుపు తెరిచి శాంత అంత తొందరగా తిరిగివచ్చిందే

అన్న సంతోషంతో 'వచ్చావా' అని ఎంతో ఆప్యాయంగా చూశాడు.

శాంతకి దుఃఖం, సంతోషం రెండూ వక్కసారి వచ్చాయి. వెళ్ళినదగ్గరినించీ జరిగినవన్నీ గుక్కతిప్పకోకుండా చెప్పేసింది. గాజులు చూపెడుతూంటే కన్నీటిబొట్లు జారిపడి ప్లాస్టిక్కుగాజు ఎఱ్ఱరంగు కడిగినట్టు మెరిసిపోయింది.

ఆనందుకి శాంతమీద జాలేసింది. ఆప్యాయంగా తల నిమిరాడు. అల్లాంటి క్షణాలు జీవితానికి జీవంపోసి, ఎన్నో ఏళ్ళు ఖాళీగావుండే సంసారానికి ఎండాకాలంలో వర్షపుజల్లులా తెలియని ఆనందాన్ని ఇస్తుంది.

ఆ క్షణాలని నెమరేసుకుంటూ జీవితాన్ని వదల్లేక పడే బాధ, 'నన్నెప్పుడూ ఎక్కడకీ పంపకండేం' అంటూ వచ్చే దుఃఖం ఆపుకుంటూ ఆనంద్ గుండెల్లో మొహం దాచుకుంది శాంత. ఇద్దరి మనస్సులూ కడిగినట్టు నిర్మలంగా వకటయి ఎన్నో ఏళ్ళు వెనక్కి వెళ్ళివచ్చినట్టు నిల్చాయి. మాటలులేని ఆప్యాయత మళ్ళీ ఇద్దర్నీ ఆవహించింది. మళ్ళీ జీవితం ముందుకు సాగిపోయింది.



# సంధ్యా కిరణాలు

సుందరి హాల్లోకి వచ్చేసరికి తల్లీ తమ్ముడూ మాటలు ఆపి, దేనికోసమో చూస్తున్నట్టు కిటికీలోంచి బయటికి చూస్తున్నారు. 'టైము ఎనిమిదయింది. అబ్బా!' అంటూ వంటింటి వేపు వెళ్ళింది సుందరి. కిటికీలు కూడా తెరవలేదు. వంట సామానులు చద్దివాసన కొడుతోంది. లోపల కెళ్ళేసరికి, తొందరగా వెళ్ళాలి తను. కాఫీ ఐనా తాగకుండా ఎల్లా వెళ్ళటం ? అంటుగిన్నెలు మధ్యన పెట్టుకు తాగటానికి మనస్కరించలేదు. అన్నీ కుళాయిదగ్గర చేర్చి నీళ్ళుజల్లి తుడిచింది. కాఫీ ప్రయత్నం మొదలుపెట్టింది. ఎక్కడ ఏమీ వున్నాయో అని డబ్బాలు తీసి చూస్తోంది. చాలాభాగం ఖాళీలే, కొన్ని డబ్బాలు అడుగున కొద్దిగా అతుక్కుని వుండిపోయాయి. పంచదార, కాఫీపొడీ అల్లా దొరికినవే. డబ్బా దులిపి నీళ్లు పోసింది. ఆ యింట్లోనే వుంటున్నా, వంటింట్లోకి వచ్చి యిల్లా చేసుకు తాగి ఎన్నేళ్ళయిందో ! మూర్తి నిజంగా ఏలోటు లేకుండా చేశాడు. కొన్ని సమయాల్లో చంటిపిల్లని మందలించినట్టు బుజ్జగించి టిఫిన్ తింటేకాని వెళ్ళనిచ్చేవాడుకాదు. మూర్తి వెళ్ళిన కొత్తలో కొన్నాళ్ళు మనస్సులోకి రానివ్వకూడదనుకున్నా, కాలం జరిగినకొద్దీ మనస్సులో మూర్తి తిరుగుతున్నాడు. పట్టుదల విడిచి తను ఆరోజే వెళ్ళి తీసుకువస్తే పోయేది—

'ఇదేమిటే ఇల్లుఅలికినట్టున్నావు ముగ్గువెయ్యలే'అంటూ నడుముని చేతులెట్టుకునితల్లి సుందరితో తాపీగా మొదలుపెట్టింది.

సుందరికి తల్లి మీద కోపము వచ్చినా పైకి తేలకుండా 'పనివాళ్ళు రాము అని చెప్పారా ?' ఏమోనమ్మా వాళ్లకి ఏమి రోగమొచ్చిందో ఇద్దరూ వొక్కసారే మానేశారు. అయినా వాళ్లని ఇంటివాళ్లల్లా చూస్తూంటే పని ఎందుకు చేస్తారు ?' 'బాగా చెప్పావు అనుకో. యిప్పుడు చేసేవాళ్లు ఎవ రని ?' అంది సుందరి. 'నాకుబొత్తిగా వోపిక లేదు; పనివాళ్లు నిలనరాయె. నీకా తీరిక వుండదు; ఎల్లా జరుగుతుందా అని ప్రొద్దుటేనించీ అదే ఆలోచిస్తోన్నా' అంది తల్లి. 'నాకు టైమ యింది వెడుతున్నా' అంటూ సుందరి హాల్లోకి వచ్చింది. 'అది వెడుతోందట, నీ ప్రయాణం మాట చెప్పావా ?' అని కొడుకు నుద్దేశించి అంది తల్లి. సుందరి తమ్ముణ్ణీ తల్లినీ చూసింది. తమ్ముడు నసుగుతూ 'పిల్లల్ని, దాన్ని పంపమంటోంది అమ్మ. అది వస్తే నాకు యిబ్బంది అనుకో అయినా మీకోసం పం పాలి.' 'ఆపసిమటుకు చెయ్యక; నువ్వు అవస్తపడి వాళ్లని అవస్త పెట్టడం—వీళ్లు పోతే వేరేవాళ్లని చూస్తా. అమ్మ వాళ్లని నిలవ నివ్వదురా! ఎంతమంది మారారో ఈ ఏడా దిలో' అంది సుందరి. 'చూశావా ముత్యాల్లాంటి మనమల్ని కొడుకుని వదులుకు నీ కోసం నేను అవస్త పడుతూ యిక్కడ వుంటే నన్నే అంటున్నావా ? వో మాటా పలుకా – పని వాళ్లతో సమంగా పడి వుంటున్నా' అంటూ ముక్కూ కళ్లూ తుడుచుకుంటూ–'అది వూరికే అల్లా అంటుంది కానీ, పిల్లలు యింట్లో తిరుగుతూ వుంటే ఎంతో సాయంగానూ వుంటారు, సందడిగానూ వుంటుంది. ఏమంటావే ?' అంది తల్లి.

నువ్వే యింత అవస్థపడుతున్నప్పుడు వాళ్ళు వచ్చి ఏమి సుఖపడతారులే. నీకు ఎక్కడ సుఖంగాఉంటే అక్కడ వుండటమే మంచిది."

"అవున్లే నీకెందుకుంటుంది తల్లిపీనుగని కనక లోకం ఎన్నివిధాల అనుకుంటున్నా, లెఖ్ఖచెయ్యకుండా బిడ్డ నంటరిగా అల్లరిపాలు అవుతుందేమోనని వుండలేక పరుగెత్తుకు వచ్చాను. అయిన కుటుంబంలో పిల్లవి. ఏ చిక్కుల్లో యిరుక్కుంటావో అని అరచేతిలో ప్రాణాలు పెట్టుకు వచ్చాను." సుందరికి కోపంతో పెదిమలు వణికాయి. 'వచ్చి ఏమి చేశావేమిటి?' తల్లినోట ఆ మాట రాగానే జెఱ్ఱులు పాకినంత బాధగా తోచింది. తలవంచుకు 'నేను వచ్చాక వెడుదువుగాని' అని తమ్ముడుకి చెప్పి వెళ్ళిపోయింది.

సుందరి హాస్పటలు వరండాలో నడుస్తూన్నంతసేపూ "లోకము ఎన్ని అంటున్నా" కన్నతల్లిమాట చక్రములా మెదడులో తిరుగుతోంది. తన వార్డులో తిరిగింది. అన్ని కేసులూ సక్రమంగానే వున్నాయి. నర్సులకి చెప్పాల్సినది చెప్పి మేల్ వార్డువేపు బయలుదేరింది. మధ్యలో కెప్టెన్ రావు, 'డాక్టరు సుందరీదేవిగారి దర్శనమేలేదే?' అన్న వెటకారపు పరామర్శకి తెల్లబోయి, కళ్లు అప్పచెప్పి చూసింది. "ఎక్కడికి కెడుతున్నావు, నా వార్డుకి వస్తావా?" అన్న రావు మాటలోని ఏకవచనానికి మనస్సు చివుక్కుమంది. "మీ వార్డు కెందుకులెండి నాకు పని వుంది, వెడతా."

(5)

"ఇప్పుడు గాలి మేల్ వార్డువేపు వస్తుందనుకుంటూ, మీనన్ ఏమంటున్నాడు ఏమిటి? అంటూ తనమాటకి బెల్టుతో బిగించినపొట్ట కదిలేట్టు గట్టిగా నవ్వుకుంటూ టై సరిచేసు కుంటూ కొత్తగా వచ్చిన అసిస్టెంటు, డాక్టరు రావటంచూసి విష్ చెయ్యకపోయినా ఆవిడని పలకరిస్తూ వెళ్ళిపోయాడు. సుందరికి ఎందుకో ఆ సంభాషణ అసహ్యంగా తోచింది. తన లోపమే ఆరకంగా డాక్టరు రావుకి లోకువవటానికి. ఇప్పుడు ఏమి అనుకుంటే ఏమిలాభము. ఆ మాటకొస్తే మిగిలినవాళ్లు మహా యిదిగా వున్నారేమిటి. వాళ్లకంటే తనే నయము. అల్లా తృప్తిపడింది. ఎదురు వరండాలో పక్కకి వెళ్ళే హౌస్ సర్జన్ శాంతని డాక్టరు రెడ్డి నడుముమీద చెయ్యివేసి తన వార్డువేపుకి తీసుకువస్తున్నాడు. సుందరికి విష్ చేసి ఎవరిదారిన వాళ్లు వెళ్ల పోయారు. మేల్ వార్డులో డాక్టరు మీనన్ రూముదగ్గర నిల్చుని వున్న అమ్మాయినిచూసి, "డాక్టరు వచ్చారా?' అని అడిగింది. ఆ అమ్మాయి ఆ మాట విన్నట్టులేదు. తనలో తనే ఏదో ఏదో అనుకుంటోంది చేతులు గుండెలదగ్గర పెట్టుకు, పొట్లంలా తిప్పుతూ నిట్టూరుస్తూ అయోమయావస్తలో వుంది. మీనన్ డాక్టరు సుందర్ని లోపలికి ఆహ్వానించాడు. ఆ అమ్మాయి అప్రయత్నంగా మీనన్ చేతులు గట్టిగా పట్టుకుంది. డాక్టరు నిజంగా చెప్పండి, తగ్గుతుందా లేదా? ఆ మాట చెబితేచాలు, కళ్లల్లో నీళ్లు లేకపోయినా దుఃఖమంతా మొఖములో తుఫా నులా తిరుగుతోంది. మాట తడబడుతోంది. ఆఖరిమాట విన కుండా "నా జీవితం చాలిస్తా" అన్నదామె.

మీనన్ సుందరి కేసి చూశాడు. "రోగానికి మందు యివ్వగలం కానీ చావుబతుకులు మా చేతుల్లో వున్నాయా? పైగా ఏది జరిగినా భరించే ధైర్యం తెచ్చుకోవాలిగాని అధైర్య పడకూడదు" అన్న సుందరి మాటలు పూర్తికాకుండానే ఆ అమ్మాయి చేతులతో ముఖము కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్పు సాగించింది. నా కోసం సర్వస్వం త్యాగం చేశారు ... ఈ స్థితికి వచ్చారు. ఏడుస్తూ పొడిగా మాట్లాడుతూంది. డాక్టరు సుందరి ఆ అమ్మాయి వీపుమీద తడుతూ, 'అల్లా ఏడ్వకూడదు. నిన్ను ఈ స్థితిలో ఆ పేషెంటు చూస్తే నిజంగానే దిగజారిపోతారు." డాక్టరు మీనన్ సుందర్ని వార్డులోకి రమ్మని పిల్చాడు. ఆమె వెనక ఆ అమ్మాయి వెళ్ళింది. అస్థిపంజరానికి చర్మం అంటుకున్నంత నీరసంగా వున్నాడు. చేతిలోకి చెయ్యి తీసుకు చూస్తోంది. సుందరి దృష్టి ఎదుటిమంచంమీదపడింది. ఉలిక్కిపడి సర్దుకు, ఆ మంచము దగ్గరికి వెళ్ళింది. డాక్టరుగా తను కప్పుకున్న తెర జారినా స్త్రీగా ఆమెకళ్ళు చెమ్మగిల్లాయి. ఆ రోజు ఎవరితో మాట్లాడినా కొన్ని మాటలు చివరో మొదలో మధ్యలో ఎక్కడివో మనస్సులో హత్తుకు బాధపెడుతున్నాయి. 'సర్వస్వం' అన్నమాట మనస్సులో వుండిపోయింది. మూర్తి నీరసంగా సగం కళ్ళు తెరిచాడు. సుందర్ని చూసినా గుర్తించనట్టు కళ్ళు మూసుకున్నాడు. నుదుటిమీద చెయ్యి వేసింది. కాలిపోతోంది. మీనన్ సుందర్ని 'వెడదామా' అని తొందరపెట్టాడు. కొంచెము ఐస్ తెప్పించమంది. మీనన్ చార్టుతీసి చూచి "టెంపరేచరు నోట్ చేసినట్టు లేదే?' అన్నాడు. నర్సువచ్చి ఐసుబేగ్ ఇచ్చింది. నుదురుమీద పెడుతూ,

సుందరి, ఏవో మందులు అడిగింది. అక్కడ ప్రస్తుతం లేవు అంది నర్సు. మీనన్ కి తన పర్సులో డబ్బుతీసియిస్తూ తెప్పించ మంది. స్ట్రెక్చర్ తెప్పించి పెట్టించింది. మందు మింగుతూ సుందరి చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు మూర్తి. . మూలుగుతూ "నే నెక్కడ వున్నాను? నువ్వు ఎప్పుడు వచ్చావు?" అన్నాడు. "మాట్లాడకండి, పడుకోండి. జ్వరం తగ్గాక చెప్తాను." నర్సుకి ఆ మందు మళ్ళీ ఎప్పుడు యివ్వాలో చెప్పి అవసర మైతే పిలవమని చెప్పింది సుందరి. మీనన్ ని పర్మిషన్ అడి గింది. తను వచ్చి చూసేందుకు. వార్డు బైట ఆ అమ్మాయి, "మళ్ళీ మీా రేమంటారు, తగ్గుతుందా ?" అని అడిగింది. సుం దరి ఏదో ఆలోచిస్తూ తప్పకుండా తగ్గుతుంది అంది. సుందరి కాళ్లు చేత్తో తాకి కళ్ల కద్దుకుంది. పిచ్చిపిల్ల తగ్గుతుందం టేనే ఎంత సంతోష పడుతోందో అనుకుంది మనస్సులో. ఆరోజు రెండు మూడు సార్లు వచ్చి మూర్తిని చూసివెళ్లింది. కొంం చెము జ్వరము తగ్గింది మూర్తికి; సుందరి కేసి చూసి బాధగా కళ్లు పక్కకి తిప్పి ఏదో చెప్పబోయి వూరుకున్నాడు. జ్వరానికి పగిలిన పెదవులు తడుపుకుంటూ నీళ్లు కావాలన్నాడు. వేడి కాఫీ తెప్పించి పెట్టింది. సుందరి వెడుతోంటే చంటిపిల్లాడిలా "వెళ్లిపోతావా," అంటూ గట్టిగా చెయ్యి పట్టుకున్నాడు. 'మళ్లీ వస్తా నిద్రపోండి' అని చెప్పి వెళ్లిపోయింది. ఇంటికి వెళ్ళటం ఆలస్యం అయింది. తల్లి రుసరుస లాడుతూ. "ఊరి కెడతామని తెలిసి కూడా ఇంత, ఆలస్యంగా వస్తే ఎల్లా ? బండి వెళ్లిపో యిందట: చీకటితో లేచి వెళ్ళాలి," అంది. మూర్తి విషయం చెప్పుదామనుకుని మళ్లీ ఎందుకో వూరుకుంది. మీనన్ ని నైటు

డ్యూటీకి వెళ్ళేటప్పుడు రమ్మనమంది. "మీరు భోజనం చేశారా ?" అని తల్లినీ, తమ్ముణ్ణి, అడిగింది. "ఆ వచ్చింది వంట రాణీగారు, వచ్చిన దగ్గరనించి అవి లేవు యివి లేవంటూ వేధించుకు తినేందుకు, నేను పోతున్నాగా ? రేపటినించి ఆవిడ యిష్టమే యిష్టం. "ఏమి లేకుండా వంట ఎల్లా చేయటం," అంటూ, ఆవిడ మొదలు పెట్టి, సుందర్ని చూసి లోపలికి వెళ్ళి పోయింది. భోజన మయ్యాక సుందరి ఫ్లాస్కులో కాఫీ పొయ్య మంది. 'ఇప్పు డెవరికీ ఆ పాలు?పొద్దున్నకి వుండనీ,' నేను "వచ్చే టప్పుడు మళ్ళీ పాలు తెస్తా కాని, మీరు కలపండి" అని వంట మనిషికి చెప్పింది. ఇంత పొద్దుపోయి మళ్ళీ వెడుతుందిట. మంచంమీద కూర్చుని కాళ్ళు దులుపుకుంటూ చెపు తోంది తమ్ముడితో" తల్లి. డాక్టర్లకి పగలు రాత్రీ ఏమిటి ఎప్పుడంటే అప్పుడే వెళ్ళాలి" అన్నాడు తమ్ముడు. "సర్లే, నువ్వుకూడా తాళము వెయ్యడానికి" అని విసుక్కుంటూ గోడపక్కకి తిరిగి పడుకుంది తల్లి. కారు దిగిన చప్పుడు విని, తమ్ముడుతో "మళ్ళీ గంటలో వస్తా; సీరియస్ కేసు వొకటి వుంది. చూసి వచ్చేస్తా" అంది సుందరి. మూర్తి సుందరివచ్చిన కొంతసేపటికి నిద్ర లేచి, "రాగానే లేపక పోయావా?" అన్నాడు, "ఇప్పుడే వచ్చాను. కాఫీ తాగుతారా ? మళ్ళీ మందు పుచ్చు కున్నారా? జ్వరం పొద్దున్నకంటె తగ్గింది." సుందరి చేతి గాజులు పైకి కిందకీ జరుపుతూ, "నాకు జ్వరము తగ్గకపోతేనే బాగుంటుంది. నేను వుంటే నిన్ను బాధ పెడతాను" అన్నాడు మూర్తి. అప్రయ త్నంగా, 'మీరు లేకపోతేనే ఎక్కువ బాధగావుంది. మళ్ళీ చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళకండేం ?' అంది సుందరి. మూర్తి

సుందరిచెయ్యి తలదగ్గర పెట్టుకు వత్తిగిలి పడుకున్నాడు. వేడిగా నీటి చుక్కలు సుందరి చేతిలోకి జారుతున్నాయి. 'చూడండి యిప్పుడు ఏమీ ఆలోచించకూడదు. నా మాట విని నిద్రపోండి' చివరిమాటలో జాలి ధ్వనించింది మూర్తికి. తను తెచ్చిన దిండు మెల్లగా మూర్తి తలకిందకి జరిపి, రగ్గు పూర్తిగా కప్పి తలకి మప్లర్ చుట్టి 'నిద్ర పట్టించుకోండి. పొద్దుపోయింది' అంది. పదేళ్లక్రితం మూర్తికి జబ్బుచెయ్యటం గుర్తుకి వచ్చింది. హాస్పిటల్ అదే, వార్డు మారింది. నర్సుని ఏదో అడిగితే అప్పుడు విసుక్కుంది. తను కళ్లు తుడుచుకుంటూవుంది మూర్తి కాళ్లదగ్గర నిల్చుని. వాళ్లకెంత లోకువో జబ్బువాళ్లని చూస్తే; మూర్తి దగ్గరకి రమ్మని సైగచేస్తే దగ్గరకి వెళ్లటం గుర్తుకి వచ్చింది. వాళ్ళకి మనలాంటివాళ్లు ఎంతమందో, నువ్వు ఆ పనిలో వుంటే, నువ్వూ అల్లాగే అనివుండేదానివి' నేను వక్క నాటికి చెయ్యను అలా బాగున్నవాళ్లు ఎవరూ వాళ్లపాలిట పడరు కదా ? జబ్బు వాళ్లమీద వీళ్ల ప్రతాపం ? తన చదువుకి నాంది అదేనేమో అనిపించింది. మూర్తికి బాగా నిద్ర పట్టింది. మీనన్ ఎమ్కు వార్డులో పని పూర్తిచేసుకు వస్తున్నాడు. అతనితో కూడా అమ్మాయి వస్తోంది. మీనన్ ఎల్లా వుందన్నట్టు ప్రశ్నార్థంగా చూశాడు సుందరివేపు. 'ఇప్పుడే నిద్రపట్టింది.' టైము చూసుకున్నాడు, 'నిన్ను దింపి వస్తా.' అమ్మాయి దిగులుగా మీనన్ వేపు చూసింది. 'ఇప్పుడు నిద్రపట్టిందా మీవారికి ?' అమ్మాయిని ప్రశ్నించింది సుందరి. పొద్దు గూకితే తెల్లవారే దాకా బెంగ, తెల్లవారితే పొద్దుగూకే దాకా – ఎప్పటికి కనికరిస్తాడో భగవంతుడు

అమ్మాయి కనురెప్పల నీడని తడి మెరిసింది. హాస్పిటల్ వాతావరణం నిశ్శబ్దంగావుంది. అప్పుడప్పుడు నర్సులవి డాక్టర్లవి బూట్లచప్పుడే ఎంతో పెద్దగా వినిపిస్తున్నాయి. కొద్దిగా మూలు గులు కీచురాళ్ళ రొదతో కలిసి మనస్సుకి భీతి కలిగిస్తున్నాయి. మీనన్, సుందరి మౌనంగా నడుస్తూ కారుదాకా వచ్చారు. కారు బీచి వద్దున పోతోంది. "ఏదో దీర్ఘాలోచనలో వున్న ట్టున్నారే?" "అబ్బే ఏమీ లేదు. అమ్మాయి ఆతురత, బాధా చూస్తూంటే చాలా - జాలేస్తోందికదూ?" "ఏమి జాలో నా ప్రాణం తీస్తోంది."

కారు ఆపి సుందరి మొహంలోకి చూస్తూ, "అసలు విషయం చెపితే మీ అభిప్రాయం మారవచ్చు" అన్నాడు. రోడ్డుదీపం కారు అద్దంమీంచి సుందరి మొహమ్మీద కొంత చోటు ఆక్రమించుకుంది. మీనన్ చెప్పేది, ఏమిటో అన్నట్టు మూతి ముడుచుకు, కళ్లు పెద్దవిగా తెరుచుకు చూస్తోంది. మీనన్ ఆవలిస్తూ వళ్ళు విరుచుకు చేతిని సుందరికి దగ్గరగా పెట్టుకు"ని, నిన్నరాత్రి తల్చుకుంటే యింకా భయంవేస్తోంది. "నా గదిలో బట్టలు మార్చుకుంటున్నా. లోపలికి ఎవరోవచ్చిన చప్పుడైె సిస్టరుఏమో అనుకుని, ఏవో ప్రశ్నలు వేస్తున్నా. వీపుమీద చేత్తో రాసినట్టయి వులిక్కిపడి వెనక్కి చూస్తే యీ అమ్మాయి. ఏమికావాలి, అంటే మాట్లాడదు. ఇక్కడ ఈ గదిలోకి మీరు రాకూడదు వెళ్లిపోవాలని తలుపు తియ్యా పోతే తలుపు తియ్యనివ్వదు. పైగా లైటు తీసేసింది. నే వెళ్ల బోతే కాళ్లు గట్టిగా పట్టుకుంది. లేవమని చేతులుతీస్తే ఏమిటో చేస్తుంది, యింకా ఏదో చెప్పబోయి సంశయిస్తూ. ఆ వేళప్పుడు

అనుకోకుండా బాస్‌వచ్చి తలుపు తట్టాడు. నాకు ఏమి చెయ్యాలో తోచలేదు. తలుపుతీసి బైటికిచూస్తే అదృష్టవశాత్తు బాస్ వార్డువేపు నడుస్తున్నాడు. తొందరగా వెనకేవెళ్లి నిద్ర పట్టిందనీ, ఆలస్యానికి క్షమించమని చెప్పుకున్నా. బాసు అదోలా చూసి నవ్వబోయి వూరుకుని తలవూపి "సరే వెళ్లు, 6 వ నెం. బెడ్‌లో పేషెంటు నాకు ముఖ్యుడు. కొంచం జాగ్రత్తగా చూడమని చెప్పిపోవటానికి వచ్చాను." బాస్ వెళ్ళాక చూడాలి, నాఅవస్త. ఆయన లోపలికివస్తే నా పని ఏమయ్యేది? తల్చుకుంటే, వళ్లు చల్లబడ్డంతపని అయింది. అందులో ఆయన చాదస్తుడు. మీకు తెల్సుగా?" సుందరి మౌనంగా వుంది "ఏమో ఆ అమ్మాయిని చూశాక ఆబాధ, ఆవేదన నన్ను వెనక్కి తీసుకుపోయింది. దానికి తగ్గట్టుగా వార్డులోకి రాగానే ఆయన్ని చూసేసరికి, నాలో అజ్ఞాతంగా వున్న బాధ, ఒక్కసారి పైకి వుబికి వుక్కిరిబిక్కిరి చేసింది. మళ్లా అహం అడ్డువచ్చి వెళ్లి చూడకూడదనుకున్నా. ఆ అమ్మాయి మొహం చూస్తే, నాలో ఎందుకు లేదు అంతబాధ? అనిపించింది. నేను అల్లావున్న దాన్నే. ఎంతో కష్టపడి నన్ను చదివించి నాకోసం వూహించలేనంత త్యాగంచేసిన మూర్తిని ఇంట్లోంచి వెళ్లిపోయి, అంత బాధ కలిగించి, దానికి కారణం నేను కాదనే మొండి సమాధానంతో మనస్సుకి ముసుగేసి, చీకూ చింతా లేకుండా కాలం గడుపుతున్న నాలో మార్పు తెచ్చింది. ఆ అమ్మాయే సందేహము లేదు. అమ్మాయి ఆంతరంలో ఏ అగాధాలున్నా నాకు మార్గదర్శకురాల్లా తోస్తోంది. వెనకటికి మా అవ్వ ఒక కథ చెప్పేది. సప్తఋషుల్ని చంపటానికి వచ్చినవాడికి, ప్రాణభీతితో

మంచిమార్గము చెపితే ఏమైనా దారిలోకి వస్తాడేమోనని, భక్తిమార్గము బోధించారుట. వాళ్లు స్వార్థంతో చేసినా, వాళ్ల బోధ వాల్మీకినిచేసి, రాజమార్గంలో వదిలిందని చెప్పేది. "అయితే ఆ పేషెంటు ఎవరూ?" అని మీనన్ అడిగాడు. సుందరి నిట్టూర్చి "ఎవరో అవుతే నాకెందుకుబాధ! మావారే" అర్థంకానట్లు కళ్ళు చిట్లించి సుందరి కళ్ళల్లోకి చూశాడు. "నాకు చిన్నతనంలోనే పెళ్లి అయింది. మావాళ్లు సామాన్యకుటుంబా నికి చెందినవాళ్లే. మా అత్తారు అంతేననుకో, ఇప్పుడు చదివే వాళ్ళంతా గొప్పవాళ్లా ఏమిటి? కానీ అసలు చదువు చెప్పించా లనేదృష్టి మావాళ్లకి ఎవరికీ లేదనేచెప్పాలి. ఈవూళ్లోనే వుద్యోగ మయింది మొదట వారికి. కాపరం పెట్టిన క్రొత్తలో, బీచిలో కూర్చుని, చదువుకున్న అమ్మాయిల్ని చూస్తూ వాళ్లు ఎంత సుఖంగా వున్నారో అనేదాన్ని. ఒకరోజు జీతంతోబాటు పుస్త కాలుకట్ట తీసుకొచ్చారు: అన్నానేకాని మళ్లీ చదవనని మొండి కేశా. పగలంతా కష్టపడి ఆఫీసుపనిచూసుకు, రాత్రులు చాలా పొద్దుపోయేదాకా నా మొద్దు బుఱ్ఱకి ఎక్కేదాకా చదువు చెప్పి, కాలేజీచదువుకి అర్హురాల్ని చేశారు. మెడికల్ కాలేజీలో, నాలుగోఏడు రాగానే నాలో మార్పు వచ్చిందని అనిపిస్తోంది. నేను అప్పుడే డాక్టర్ని ఐనట్టు అస్తమానం అన్నింట్లో కనిపించే టట్టు ప్రవర్తించా లనిపించేది. నాలో మార్పు చూపిస్తూ మూర్తి-అదే మావారు-హేళనచేస్తే చాలాకోపంవచ్చి విసు క్కునేదాన్ని. నాకంటే చదువులో తక్కువనే భావం రావటము మొదలుపెట్టింది. ఏదైనా భావం మంచిఅయినా చెడుఅయినా

పెరగటం మొదలుపెడితే, ఆపడం కష్టంకదా! నా చదువు పూర్తి అవుతున్నకొద్దీ మాయిద్దరిమధ్య కనపడనిగోడ లేస్తోంది. దీనికితోడు కెప్టెన్ రావుగారి ఆదరణకి ... ఎంతో గొప్పగా పొంగి ఇంటికి వెళ్ళినా, అలక్ష్యంగా ఉండటం, నిర్లక్ష్యంగా జవాబు చెప్పటం, మూర్ఖత్వం ఆనపించి, డాక్టరు పట్టాని కప్పు కుంది. కొత్తగా చుట్టూవున్నవాళ్లు డాక్టరు అనటమే కిరీటం పెట్టుకున్నంత సంతోషాన్నిచ్చేది. ఇంటిదగ్గర నిశ్శబ్దాన్ని భరించటం కష్టంగా వుండేది. ఎక్కువ రావుగారితో కూడా తిరగడమే ఘనతగా ఎంచుకునేదాన్ని. మా చదువు వెళ్ళితలలు వేసింది. రావుగారిదగ్గర అసిస్టెంటుగా వేయించారు. ముందున్న గర్వానికి డబ్బు అనే దారం ముడిపెట్టినట్టు, నాకు నేనే తప్ప, యింకొకర్ని గురించిన ఆలోచన నాలోంచి పోయింది. మూర్తి ఎప్పుడయినా కొద్దిగా విసుక్కుంటే, సహించకుండా, నా ఆధి క్యం కనపడేలా చదువు డబ్బు ఏకరువుపెట్టేదాన్ని. ఆ రోజు చాలా పొద్దుపోయింది. వర్షం బాగా పడుతోంది. రావుగారు కార్లోంచిదిగి ఓవరుకోటు సగం నాకు కప్పితే వరండాలోకి వెళ్లాము. కిటికీలోంచి కొద్దిగా వెల్తురు పడుతోంది. తలుపు తట్టబోయిన నన్ను వెనక్కి లాక్కు గట్టిగా గుడ్‌నైట్ చెప్పి వెళ్లిపోయారు. "ఇంత రాత్రిదాకా తలుపులు తీసిపెట్టారు ఎందుకు" అని విసుక్కుంటూ లోపల అడుగుపెట్టా. "అయ్యా గారు ఇప్పటిదాకా బైటే వుండాలి. ఇప్పుడే పైకి వెళ్లా రేమో!" పడుకున్నదిలేచి కొంగుదులుపుకుంటూ విసుక్కుంటూ వంటగదివైపు వెళ్లిందివంటఆవిడ. వీధి తలుపు తెరచు కుంది. కాస్త తడిసిన బట్టలతో మూర్తి లోపలికి రావటం

చూశా. ముందు భయంతో ఏమంటారో అని చూస్తున్నా. చాలా కోపంగా చూస్తూ కాసేపు నిల్చుని, ఏదో అడగా లన్నట్టు కింది పెదవి కొరుకుతూ అటూ యిటూ రెండుసార్లు తిరిగి విసురుగా పైకి వెళ్లిపోయారు. "ఇల్లాఅవుతే పనిచెయ్యటం కష్టం అమ్మగారూ. మీరు తిన్నాక నేను తిని ఈపని పూర్తి చేసుకునేసరికి తెల్లారుతుంది." 'నీ గోలేమిటి మధ్యన. నువ్వు తినకపోయావా?' అన్నాను. "అయ్యగారు తినకపోయె. మీరు యిప్పుడు వస్తిరాయె. నేను ముందుతినేది ఎల్లాచెప్పండి" అంది. "పైకి వెళ్లేసరికి మూర్తి గదిలో పెట్టెమూత వెయ్యడం పెద్ద చప్పుడు చేసింది. ఏమిటి యిది అంతా అని అడగాలని గుమ్మం దాకా వెళ్లి, వెడితే ఎక్కడికేనా మళ్లీ వారం రోజులలో తిరిగిరాడా అన్న గర్వంతో వెళ్లి పడుకున్నా. ఎప్పుడు నిద్ర పట్టిందో లేచేసరికి చాలా పొద్దెక్కింది. కాఫీబల్లమీద పెడుతూ వంటావె "అయ్యగారు చీకటితోటే, పెట్టే పరుపూ తీసుకు వెళ్లిపోయారండీ. ఎప్పుడు వస్తారుబాబూ అంటే, ఏమీ చెప్ప కుండా తలుపేసుకోమని, వెళ్లిపోయారు" అంది.

"సర్లే నీ పని చూసుకో" అని విసుక్కుని పడుకున్నా. ఏదయినా మనసులోది అడిగితే అంతబాధ వుండదు. చెప్ప కుండా వెళ్లట మేమిటి? తనకి ఏమి లోటు చేశానని అంత కోపానికి? తలగడాల్ని కిందకి తోసి మధ్యగా కూర్చుని ఎగిరే జుట్టు ముడి పెట్టుకుంటున్నా. కాయితాలు గాలికి ఎగిరి గది అంతా తిరుగుతున్నాయి. ఒక కాయితం మంచంమీదికి ఎగిరి పడింది. ఇంటి ఖర్చు పూర్తిగా వ్రాసివుంది. అప్పటివరకూ

అయినఖర్చు ముత్యాల్లాంటి అక్షరాలతోటి వ్రాసివుంది. కవరు బల్లమీద కుదురుగా వుంది. "డాక్టరు సుందరి" అని వ్రాసి వుంది. "సీతాకోక చిలకలా, నువ్వు డాక్టరు పట్టాలో వెనకటి జీవితానికి ముసుగువేసి, కొత్తగా గొప్పగా జీవితాన్ని గడపాలని కలలు కంటున్నావు. నేను నీకు ప్రస్తుతం నీ వూహాలకి అడ్డుతగిలే బండరాయిలా వూహించి, అసహ్యించుకున్నట్టు తెలిసికూడా యిన్నాళ్లు ఇక్కడే వున్నాను. నిన్ను బాధపెట్టే మాటలు అనటం రాక కాదు. ద్వేషించుకుంటూ ఇక్కడ వుండటం కంటే, వెళ్లిపోవటమే మంచిదిగా నిర్ణయించుకున్నాను. మళ్లీ మనం కలవటం అసంభవం. నీ కోరిక చెల్లించా నన్న సంతోషం ఏమూలో కదుల్తూవుంటుంది. నీ డబ్బు తాలూకు జమ రాసిన కాయితాలు చూసుకో" – ఇంకేవో ఇంటిగొడవలు. కెప్టెన్ రావు పైకి రావటం కూడా గమనించ లేదు. చేతిలో వుత్తరం తీసుకు చదివి, "కోరిక చెల్లించట మేమిటి చదివించటమా? ఎంతయిందో లెఖ్ఖచూసి పడెయ్యి. అల్లా మాట్లాడేందుకు వుండదు' రావుగారు అంత చనువు తీసుకు అల్లా మాట్లాడ్డం చాలా కష్టం కలిగించినా, ఏమీ అనకుండా కిందకి చూస్తూ కళ్లల్లో నీళ్లు కనపడకుండా కూర్చున్నా. టయిమయిందని వీపుమీద తడితే వెళ్లక తప్పలేదు. మొదట్లో కొన్నాళ్లు కొత్తగా వచ్చిన స్వేచ్ఛకి మనసులో మూర్తి లేడన్నబాధ పైకి రాకుండా స్వేచ్ఛని చుట్టూ పరచుకు తృప్తి పడడంతో కొంతకాలం గడిచినా, బాధలాంటి భయంలాంటి చీకటి మనస్సులో పెరుగుతూ, శూన్యం తెరలా చుట్టుకు స్వేచ్ఛని దూరంచేసి మూర్తిని తెరలోకి తేవాలని వుబలాట

పడినా, అహం తనే రావాలి కాని, నువ్వు లొంగి తప్పు వొప్పుకోకూడదని, మధ్యన నిల్చేది. కెప్టెన్ రావు స్నేహము ద్వేషంగా మార్చుకున్నాడు, డాక్టరు దేవి రాకతో. ఇల్లా చెపుతూపోతే, తెల్లారుతుంది. నీకు చాలా విసుగు కలిగించాను కదూ ? కొంతభారం తీరినట్లు వుంది. అనుకోకుండా కొందరి దగ్గర అన్నీ చెప్పేస్తాము. తీరా ఎవరి దగ్గర చెప్పి క్షమార్పణ కోరాలో వాళ్లదగ్గర మాటల్ని మనస్సులోనే సీలుచేసి, దూరంగా వుండేందుకు ప్రయత్నిస్తామేమో!' మీనన్ దూరంగా చీకట్లో హోరుగా రొదచేసే సముద్రంకేసి చూస్తున్నాడు. వెడదామా అన్న సుందరికేసి తిరిగి, 'నేను ఒకటి అడగాలను కుంటున్నాను.' అన్నాడు వేళ్లతో అగ్గిపుల్ల తిప్పుతూ, అటూ ఇటూ చూస్తూ అడగదల్చింది నెమరువేస్తూ. సుందరి కొంగుతో సగము ఆరిన కళ్లకింద నీటిచారల్ని తుడుచుకుంటూ 'ఇంకేమీ అడగవద్దు మీనన్. నేను ఒక నిర్ణయానికి వచ్చేశాను. నిన్నటిదాకా – ఏమిటి, ఈరోజు ఉదయందాకా రౌతు లేనిగుర్రంలా, నా మనస్సు దారితప్పి తుప్పలూ గుట్టలూ చుడుతోంది. జీను పట్టుకు దారిలో నడిపించినట్టు అమ్మాయి, నన్ను వార్డులోకి తీసుకెళ్లింది.

ఇంక పెంకి గుర్రంలా, వెనక్కిపోనిస్తే, ఆలోచనలు, మంచి నిర్ణయించేసరికి జీవితపు పుటలు మూతపడవచ్చు. "ఒకప్పుడు, చదువులేదే అన్న తహతహతో దుఃఖము పర వళ్ళు తొక్కి, కడలిగట్టులా, కళ్ళ కొలుకుల్లో నిల్చిన నీటి బిందువునిచూసి జాలిపడ్డమూర్తిమీద, కోపంగా వుంది

యిప్పుడు. చదివించకపోతే, అందరిలా నేనూ వున్నదాంతో గడుపుకుంటూ, బీదరికపు రాజమార్గంలో సూర్యకాంత పువ్వులా, అస్తమయంలో మరుగుపడేదాన్ని కదా?" సుందరి కళ్లు చెమ్మగిల్లినా కళ్లల్లోనే నిల్చిపోయింది తడి. కంఠం ఆరిపోయింది. "వెడదామా మీనన్" అంది, పొడిమాటలతో. అగ్గిపుల్ల ముక్కలు బైటికివిసరి, "మీరు వూహించే మార్గంలో యిమిడివుంటా రనుకోవటం అసంభవం, మనకా పిచ్చినమ్మకాలు వుండకూడదు. కెప్టెన్ రావు", అని మీనన్ మాట పూర్తి చెయ్యకుండానే సుందరి చేతుల్లో మొహం దాచుకుంది. నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ, ఏడుపు పైకి వుబికింది. సుందరికేసి చూసి ఏదో చెప్పబోయిన మీనన్ పెదవి విరుచుకున్నాడు. కారు కదిలింది. నెమ్మదిగా, ఇంటిముందు ఆ కారు ఆగినా సుందరి దిగకుండా కూర్చుంది. సుందరి ముందుకువంగి తలుపుతీసి మీనన్ చేతిని పట్టుకుని, "నీ కెల్లా చెప్పాలో తెలీటంలేదు. నాకు స్నేహితుడివి, చుట్టానివి, నువ్వే అనటంలో తప్పులేదనుకుంటా. కానీ నా మీద ద్వేషం, కోపం పెంచుకోవద్దు" సమాధానం కోసం వుబ్బిన కనురెప్పలు పైకి ఎత్తింది. చేత్తో నుదురు రుద్దుకుంటూ, సగమువరకువచ్చి నిల్చిపోయిన నవ్వుతో తలుపు పూర్తిగా తెరచి 'గుడ్‌నైట్' చెప్పి వెళ్లేటప్పుడు, కోపం లేదనుకునేందుకు మరోసారి చెప్పి, వెళ్ళిపోయాడు.

సుందరి కింద హాల్లో, సోఫాలోనే పడుకుంది. తల్లి చేసే హడావిడికి మెళుకువ వచ్చింది. 'మూటలు గుమ్మందగ్గర చాలా చేరాయి. ఇవన్నీ ఏమిటమ్మా' అనే తమ్ముడిని, తల్లి,

నీ కెందుకు బండిలో పెట్టమను, అని కసరడం వింటూ పడు కుంది. వెడతాను అక్కయ్యా, అంటూ చెప్పే తమ్ముని చేతిలో తలకింద బేగ్ తీసి కొంత డబ్బు యిచ్చింది. "ఎంతిచ్చింది? కొద్దిగా నీదగ్గర పెట్టుకు, మిగిలింది నాచేతికియ్యి" అని అడ్డం పడిన తల్లిమీద సుందరికి చాలాకోపం వచ్చింది. 'నీ దగ్గరే వుండనీ' అని తమ్ముడికి చెపుతూ గుమ్మందగ్గరికి వెళ్ళింది. 'నీకు తెలీదులే యింటికెడితే, ఆ రాణీగారివల్లో పడిపోతాడు. ధోరణి మారుతుంది. ఇప్పుడే యివ్వనీ' అన్న తల్లి మూర్ఖపు పట్టు చూస్తే, ఏమిటీ వ్యామోహం డబ్బుమీద అనుకుంది. ఇల్లు వదల్లేక, నాలుగుమూల్లా చూస్తూ 'యింక వంటావిడదే రాజ్యం. నే వెడుతున్నాగా', అంటూ మెట్లుదిగి 'నీకు లేక పోయినా, కన్నకడుపు నేను వుండగల్నేమిటె, చూడకుండా? మళ్ళీ ఎప్పుడు బుద్ధిపుడితే, అప్పుడేవస్తా' ఇనతలకి వచ్చిన మాటని, లోపలకితోస్తూ, మూలుక్కుంటూ, బండి ఎక్కిన తల్లిని చూస్తూ నిల్చుంది.

ఆరోజు తనవార్డులో పనిచూసుకుని, మూర్తిదగ్గరికి వెడు తున్న సుందరికి కెప్టెన్ రావు నవ్వు హేళనగా వెంటవస్తున్నట్టు అనిపించింది. ఎక్కువ టైమ్ మూర్తి వార్డులో గడపటం, మీనన్‌తో మాట్లాడటంతో కెప్టెన్ రావుకి మరీ ద్వేషం పెరిగింది. సుందరిని వేరే హాస్పిటలుకి మార్చేదాకా ఎంతో శ్రమపడ్డాడు. సుందరి యింక తన చుట్టూ తిరుగుతుంది. ఇక్కడే వుండేలా చెయ్యమని. అప్పుడు ఏంచెయ్యాలో కొంత లోపల ఆలోచించినా, పక్కనవున్న కొత్తడాక్టరుతో సుందరిఅంటే, తనకి గౌరవం లేదని, మెడిసన్ చదివినా, ఏమి రాదని, కొత్త విషయాలు

తెలుసుకోదని; మెత్తనివాడూ, తనమాట వినేవాడూ, అని మీనన్‌ని పట్టుకుందని, ట్రాన్స్‌ఫర్ అవటం నాకు సంతోషంగావుంది అని, వూళ్లోనేగా పొరుగూరు అవుతే బాధ పడాలి' అని అతను అన్నట్టు ఆ కొత్త డాక్టరు, మీనన్ వుండగా సుందరికి ఈ వార్త అందచేసింది. మూర్తి పూర్తిగా కోలుకున్నాడు. ఆ రోజు యింటికి తీసుకువెడతానంటే మూర్తి ఇంటికి ఎందుకు అంటూ ఆలోచనలో పడ్డాడు. సుందరికి ఏమి చెప్పాలో తోచక ఎటో చూస్తూ నిల్చుంది. 'ఇంటికి తీసుకు వెడుతున్నారా ? నేను మిమ్మల్ని దింపి, వెడతానండి' అన్న మీనన్ మాటతో సుందరి, మూర్తి ఒకరిని ఒకరు చూసుకున్నారు. ఇంటి దగ్గర వదలి మీనన్ వెళ్లిపోయాడు.

మూర్తిని పైకి తీసుకువెళ్ళింది. కావలసిన వన్నీ తనే తెచ్చిపెట్టింది. మూర్తి మౌనంగా సుందరి తెచ్చినవి తింటూ 'నువ్వూ తీసుకో' అన్నట్టు కళ్లల్లోకి చూశాడు. ఇద్దరూ దగ్గరే వున్నా మనస్సులు దూరంగానే వున్నట్లు, బాధగా చూసింది. ఏవో చెప్పాలనుకుని మొదలుపెట్టి ఏదీ పైకిరాక, వెనకటివన్నీ మర్చిపోయి క్షమించమంది. కుర్చీ చేతిమీద కూర్చుని పక్కకి చూస్తున్న సుందర్ని తన పక్కకి తిప్పుకున్నాడు. నవ్వేందుకు ప్రయత్నించినా కళ్ళల్లో నీళ్లుపొంగి, చెక్కిళ్లని దాటి మూర్తి చేతిలోపడి పాకిపోయాయి. ఏం మాట్లాడేందుకు తోచక, ఏదో వుత్తరం 'వచ్చినట్టుందే' అన్నాడు మూర్తి. సమాధానంగా తల వూపి, కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ వంగి బల్లమీద కవరు చేత్తో తీసింది. 'మా తమ్ముడు వచ్చి వెళ్ళాడు ఈ మధ్య, వాడు రాశాడు చదవండి' అని మూర్తి చేతికిచ్చింది. గాలిలో

కదుపుతూ కవరు టపటపా చప్పుడు చేసి సుందరి వళ్లో పెడుతూ నువ్వు చదువు వింటూ, అని కుర్చీకి తల ఆనించి కూర్చుని సుందరికేసి చూస్తున్నాడు. మొదట విన్నపాలు వగైరా లోపల చదువుకుని, మిగిలింది పైకి చదవటం మొదలు పెట్టింది. 'మేము వచ్చేశాక నువ్వు ఏమనుకున్నావోనని చాలా బాధ పడుతున్నాను. అమ్మ మాటలు నిజమనుకున్నాను. పాత బట్టలంటే నమ్మా. ఇంటి సరుకులు పాత్రలు, బట్టలు చాలా వున్నాయి. వాటితో నువ్వు యిచ్చిన డబ్బు కూడా ఆవిడే తీసుకుంది. అందుకు నాకు విచారం లేదు. ఆ సరుకులు, డబ్బు తీసుకు చెల్లెలుగారి వూరు వెళ్లింది. ఎక్కడ ఏదివున్నా, అక్కడకు చేర్చాలంటుంది. నాకు నిన్ను చూస్తే సంతోషం విచారం కలిగాయి. నేను నీకు రాయకూడదేమో తెలీదు. తప్పు అయితే క్షమించు. బావ ఎక్కడ వున్నాడో తెలిస్తే నాకు వ్రాయవలెను. ఆయన మనస్సు ఎంత విశాలమైందో వూహించ లేకపోతున్నాను. ఆయన సుఖమే చూసుకుంటే నువ్వుకూడా మాలాగే గొడ్డుతోక జీతంగా పిల్లలూ, రోగాలు, తీరని కోరి కలతో ఈ జన్మకు ఆశలు వదులుకు, ఇంకో జన్మలో కావల్సినవి సృష్టించుకుంటూ కాలం గడిపేదానివేమో అనిపిస్తుంది. నిన్ను మనం వూహించని చోటుకి తీసుకువెళ్లాడు. కానీ, బావ వెళ్ళిపోవటం ఆ ఇంట్లో చాలా వెల్తిని చూపిస్తోంది. నీకు తెలిస్తేరాయి. నేను వెళ్లి బతిమాలి తీసుకువస్తాను. మాలాంటి వాళ్లని ఎక్కువ దగ్గర చేర్చుకుంటే నిన్నూ, నీ డబ్బునీ కాక నీ కీర్తిని కూడా మింగేందుకు జంకము. నే రాసినదాంట్లో

తప్పులుంటే క్షమించు. అసలు విషయం మర్చాను. మీ మరదలుకి నెలలు కాకుండానే పిల్లపుట్టి పోయింది. అంతవరకూ సుగుణమే అనుకుంటున్నాను. మీ అత్తగార్ని మీ వూరికి తీసుకు వచ్చారు. ఆడవాళ్లకి పెద్ద వయస్సులో వచ్చే జబ్బట. చాలా నీరసంగా వుంటే ఇక్కడ ఆపరేషను చెయ్యమన్నారుట. నీ పేరు రాసి యిచ్చాను. నిన్ను ఈ పాటికి కలుసుకునే వుంటారని తలుస్తాను. మరి వుంటా'—

సుందరికి వుత్తరంలో కొన్ని మాటలే మెరుస్తున్నాయి మనస్సులో. మూర్తి చొక్కాకింద చర్మాన్ని అంటుకువున్న వూపిరి తిత్తుల్ని మెల్లిగా చేత్తో రాస్తూ, నన్ను చాలా చెడ్డదాన్నిగా వూహిస్తున్నారు కదూ? అంది. దుఃఖాన్ని దాచుకునేందుకు మూర్తి మెడపక్కన తలపెట్టి మొహం దాచుకుంది.

కన్నీళ్లతో గతంలో నలుపుని తడిపి మరుగుపరచి మళ్లీ కొత్తరోజు కొత్త జీవితంలోకి జరిగి, పశ్చాత్తాపం అనే తెరని గతం పైకి దించి, ప్రశాంతంగా కాలం నిల్చినట్టు జరుగుతోంది.

ఆ రోజు సుందరి భారంగా వళ్లు విరుచుకుంటూ మేడ మెట్లు దిగుతోంది. 'వంట్లో బాగా లేదా ఏమిటె, అమ్మడూ?' అన్న అత్తగారి మాట అడ్డుపడ్డంతో నిల్చింది, 'అబ్బే ఏమీ లేదు కాస్త వళ్లు నొప్పులుగా వుంటే మళ్లీ పడుకున్నా. నిద్ర పట్టేసింది. మెళుకువ రాలేదు. పొద్దు ఎక్కింది బాగా' అంది. 'పొద్దుకేంలే, వంట్లో బాగా లేదేమోనని అడిగా' అంది అత్తగారు. సుందరి హాస్పిటల్‌కి వెళ్లేటప్పుడు అత్తగారు 'మళ్లీ ఎప్పుడు పంపుతావే నన్ను. నీ పుణ్యమా అని కత్తులు కోతలు

లేకుండా తగ్గేట్టు చేయించావు. మళ్లీ మనిషిగా చేశావు. ఎన్నాళ్లు వున్నా బిడ్డల దగ్గర వుండాలనే వుంటుంది. మునలా యన్ని ఎన్నడూ విడవలేను. ఏమి అవస్త పడుతున్నారో ఏమో' అంది. 'రేపు వెడుదువుగాని. మీ అబ్బాయితో కూడా చెప్పండి' అని వెళ్లిపోయింది. ఆ రోజు వార్డులో అడుగు పెట్ట గానే ఒక కేసు సీరియస్‌గా వుందని, మీకోసం చూస్తున్నా నంటూ నర్సు హడావిడిగా గదిలోకి వెళ్లింది. మూడు కేసులు సుఖంగా తల్లీ పిల్లలూ వుండటం సుందరి మనస్సుకి ఆనందం కలిగింది. ముగ్గురూ ఆడపిల్లలే. అమ్మమ్మ మాటలు గుర్తుకి వచ్చాయి. కొన్ని నెలల్లో అంతే అనేది.

వరండాలోకి రాగానే సుందరికి కళ్ళు తిరిగినట్టు అయి బల్లమీద కూర్చుంది. కిటికీ అవతలనుంచి మాటలు గట్టిగా వినపడుతున్నాయి. ఆడ కంఠం-'ఇంకా భ్రాంతి పోలేనట్టుందే?' రెండో కంఠము, 'నాకు ఎప్పుడూ ఆ గొడవలేదు. ఆవిడ ప్రాణం తీస్తే తప్పించుకోలేక పోయాను,' ఆ మాటలు కెప్టెన్ రావువే, సందేహము లేదు. లోపలికెళ్లి ఎవరో అని చూడ్డం ఇష్టంలేక ఇంటికెళ్లేందుకు బయలుదేరింది. అసిస్టెంటుకి కేసులు వివరాలు చెప్పి, వంట్లో బాగాలేదు, ఇంటికి వెడుతున్నానని చెప్పింది. కెప్టెన్ రావు, అక్కడికి వచ్చినట్టు తెలిసేందుకో అన్నట్టు గట్టిగా దగ్గటం మొదలుపెట్టి, 'ఏమిటి విశేషాలు. మీనన్ పెళ్లి బాగా జరిగిందా?' అని సుందరిని చూస్తూ అడిగి ఇక్కడ అందర్నీ వదిలేసి ఎక్కడో మారుమూలకి వెళ్లి చేసు కున్నాడేం?' బట్టతలని చేత్తో తడుముకుంటూ అన్నాడు. 'ఈ సంభాషణ ఇష్టంలేనట్టుందే' అంటూ నవ్వటంలో ఈర్ష్య, పళ్ల

సందు నలుపులోంచి, తొంగి చూసినట్టు అనిపించింది సుందరికి. ఎక్కువ మాట్లాడ్డం ఇష్టంలేక 'ఒంట్లో బాగాలేదు. ఇంటికి వెడుతున్నా' అంటూ వెళ్లిపోయింది. హేళనగా నవ్వుతూ కూడా వచ్చే రావుమీద కోపము వచ్చినా తిరిగి చూడకుండా ముందుకి వెడుతోంది. 'అభ్యంతరం లేకపోతే నాతో రావచ్చు' సమాధానం చెప్పకుండా, తల వంచుకొని నడుస్తోంది. పెద్ద చప్పుడు చేస్తూ రావు కారు చాలా దగ్గరనించి వెళ్లిపోయింది. సుందరి గతంలో కొంత మర్చిపోయింది. మరికొంత మర్చేందుకు ప్రయత్నించింది, రావు కొందరికి లేని గతాన్ని కొంత చేర్చి చెపితే ఆ కొందరు ఇంకో కొన్ని చేర్చి అల్లా చెపుతూ పోతే – గతమే బ్రహ్మాండంలా పెరిగి నిల్చిపోతుందేమోనని భయమేసింది సుందరికి. గుమ్మంలో అడుగు పెట్టగానే కాలాన్ని గుర్తుకు తెస్తూ మూడు కొట్టింది గడియారం. హాల్లో ఎవ్వరూ లేరు. పైకి వెళ్లకుండా ముందుగది కుర్చీలో కూర్చుని చేతుల్లో మొహం పెట్టుకు తను జీవితంలో మూడో పాదంలోకి వచ్చేసినట్టు వూహాకి వచ్చేసరికి, ఎవరు ఏమనుకుంటే ఏంలే అని సమాధానపడింది. కావల్సినవి కొన్ని లభ్యమయ్యేసరికి వయస్సుతో పనిలేకుండా సంధ్య వెలుగులా జీవితం చివరికి జరిగి నిల్చినట్టు వుంటుంది. హాల్లో మాటలు ఆలోచనల్ని అడ్డుకున్నాయి అనిపించింది సుందరికి. 'అమ్మాయి భోజనానికి రాలేదు ఎందుకో' అన్న అత్తగారి మాటవిని, 'అది అంతే. బైటకి వెడితే, ఇల్లు తిండి మర్చిపోతుంది.' ఆ కంఠము తల్లిలా వినిపించి వులిక్కిపడింది. 'నా మాట పూర్తిగా వినలేం' అనే తల్లిమాట వినిపిస్తోంది. 'ఈ పిల్లాడిని వీళ్ళదగ్గర వుంచుదామని

తీసుకువచ్చా 'మా అబ్బాయి వచ్చినట్టు తెలీదన్నారు యిం దాకా?' 'మా అమ్మాయి దగ్గరే వుంచుదా మనుకున్నాం సరేనా' 'ఏమో వాళ్ల యిష్టమైతే అట్టేపెట్టుకుంటారు. నా కెందుకు చెప్పటం' అన్నారు అత్తగారు. వాదనలోకి దిగారు అత్తగారు. మాటమార్చి, మా అబ్బాయి కంపెనీ గవర్నమెం టులో కలిసిపోయిందట. ఎవరెవర్ని అట్టేపెట్టేది తేలలేదు. ఇవాళ కాయితాలు వచ్చాయిట. అబ్బాయికి జీతం కూడా ఎక్కువ చేసి వుద్యోగము యిచ్చినట్టు. వీడు ఎక్కడుంటే అక్కడ అదృష్టం కలిసి వస్తుందనుకోండి. అన్న తల్లి వాక్యం పూర్తికాకుండానే, మూడో కంఠం వినిపించింది. 'డాక్టరు అమ్మగారు లోపల వున్నారా, అంటూ. "ఇంకా రాలేదు" అత్తగారి సమాధానం. "అప్పుడే వచ్చారుట. హాస్పటల్ నర్సు చెప్పింది" అని మూడో కంఠము. 'మీకు ఏమిఅవుతారు డాక్టరు; అమ్మగారూ?' "ఆవిడకి కూతురు. నాకు కోడలు. అల్లాకూర్చో. పైనవుందేమోపిలుస్తా.' కర్టెను పక్కకు జరిపి, సుందరిగుమ్మంలో నిల్చుని పలకరించింది.' యిక్కడే వున్నావా? పైనవున్నావేమో పిలుద్దామనుకున్నా" అన్న అత్తగారి ప్రశ్నకి సమాధానంగా కొద్దిగా నవ్వి వూరుకుంది. "హాస్పటలు కెడితే, యింటికెళ్లారని చెప్పారు. ఇంకో మంచిమాట విన్నాను. మీరు చెప్పండి పిన్ని గారూ మూడో మాసం వచ్చిందా? అని సుందరి అత్తగార్ని ప్రశ్నించింది అమ్మాయి. "ఏమో! నాకూ తెలీదు. వారంన్నించి తిండి సరిగ్గా తినకపోతే వంట్లో బాగాలేదేమో ననుకున్నా. మాటకయినా చెప్పావు కాదేమే !" అంటూ నవ్వుతూ సుందరి కేసి చూసింది అత్తగారు. "ఆ అదీ ఐవుండను. దాని చెల్లెలు

మరదలూ విసిగిపోతున్నారు పిల్లలతోటి. ఇది సుఖపడుతోందని వాళ్లెంతో మురిసిపోతున్నారు" అని తల్లి, "అదేమన్నమాట. ఎవరిపిల్లలు వాళ్ళకి" అని అత్తగారు. ఆఅమ్మాయి సంచిలోంచి కొన్ని పళ్లు రెండు పెద్ద పొట్లాలూ తీసి బల్లమీద పెట్టి "మీ దయవల్ల ఆయనగారు బాగుపడ్డారు. మేము వూరికి వెళ్ళి పోతున్నాము. మీరు ఆ హాస్పటలు వదిలాక చూడ్డంపడలేదు. దయవుంచండి వస్తా. మీనన్‌గారు వచ్చారుట. వారి ఇంటికి వెళ్ళి చెప్పి రాత్రిబండికి వెళ్ళిపోతాం. సుందరికిబొట్టుపెట్టి ఆ అమ్మాయికి పెట్టి తనూ పెట్టుకుని, గడపకుపెట్టి, లడ్డూలు కాయి తంలో కట్టి అమ్మాయికిచ్చి, "మంచిమాటచెప్పావు, నేను వెళ్ళేలోపల" అంటూ అప్పుడే అక్కడికి వచ్చినకొడుక్కి ఆవార్త చెప్పి, వేళ్ళతో తలదువ్వుకుంటూ బల్లమీద కూర్చుంది సుందరి అత్తగారు. నాకుచెప్పలేదే! అన్న ఆశ్చర్యం సంతోషం కలసినట్టు సుందరికేసి చూశాడు మూర్తి. సంతోషం వెనక విచారం కనపడ్డా పేలవంగా నవ్వింది సుందరి. 'అబ్బే! అప్పుడే నిర్ధారణగా చెప్పలేం' అంటూ మనవణ్ణి దగ్గిరికి తీసుకుంది తల్లి. సంధ్య కిరణాలు కిటికీ అ వ త ల మె రు స్తు న్నా యి. అందరి చూపులు సుందరి దగ్గిర నిలిచాయి. సుందరి చూపులు దూరంగా జరిగే సంధ్య ఎరుపుకలిసి, పసిపాప నవ్వులా – నిర్మలంగా కదిలి ఇల్లంతా పరుచుకుంటూ జరిగి జ రి గి మూర్తిని కదిలిస్తూ. కాబోయే త ల్లి న నే హుందాతో ఆ వా త వ ర ణం లో ని సంతోషన్ని కూడా తీసుకువెడుతున్నట్లు బరువుగా అడుగులు వేస్తూ మేడమెట్లు ఎక్కింది సుందరి.



# మూతపడని కన్ను.

నారాయణమూర్తి ఆవూరువచ్చి నెల దాటుతోంది. ఇళ్ళకోసం తిరుగుతూనే వున్నాడు. ప్రతీదానికీ ఏదో లోపం కనపడుతోంది. విసుగుపుట్టి కొన్నాళ్ళు ఆ ప్రయత్నము విరమిద్దా మనుకున్నాడు. ఆఫీసునుంచి రాగానే హోటల్ యజమాని పిల్చి "మీకోసం ఎవరో ఒక ఆయన వచ్చివెళ్ళారు సార్. మళ్ళా ఆరుగంటలకి వస్తారట. మీరువస్తే రూములోనే వుండమని చెప్పి వెళ్ళారు" అని చెప్పాడు.

మూర్తికి రోజూ సాయంత్రము సముద్రపొడ్డుకి వెళ్ళే అలవాటు. ఆ రోజు ఆ వచ్చిన వ్యక్తికోసం చూస్తూ గదిలో కూర్చున్నాడు. కిటికీలోంచి రోడ్డు చివరదాకా చూస్తూ కాలక్షేపం చేస్తున్నాడు. తను వున్నగది ఏమంత బాగా లేకపోయినా, బైటచూస్తే దూరంగా మైదానం, అవతల తాటి చెట్లు, చిన్న చిన్న గుడిసెలు, దూరంగా ఆ సముద్రం ఆకాశంలో కలిసినట్టు కన్పిస్తోంది. చీకటిపడ్డా ఎవరూ రాలేదు. విసుగొచ్చి 'ఎవరు వచ్చివుంటారా' అని ఎంత ఆలోచించినా 'ఎవరూ' గుర్తుకి రావటంలేదు. ఆ గది నాలుగుమూలలా తిరుగుతూ, కొంచెముసేపు కిటికీదగ్గర నిల్చుంటూ, చివరకి కాగితంమీద వచ్చిన ఆయన్ని తెల్లవారివచ్చి కలుసుకోమని వ్రాసి హోటల్ యజమానికి ఇచ్చి వెడదామని బయలుదేరాడు. బయటికి వచ్చేసరికి మూర్తి, మామగారు, ఇంకో నలుగురినికూడా తీసుకువచ్చారు. 'ఎవరో' తెలిసిన అతన్ని హాస్పటల్‌లో చేర్చేందుకు వచ్చారట. అనుకోకుండా బయలు

దేరాల్సి వచ్చిందట. మళ్ళా ఆ మరునాడు వెళ్ళిపోవాలట. ఆ సాయంత్రము ఆయన స్నేహితుడి ఇంటికి వెళ్ళినప్పుడు ఇళ్ళ ప్రస్తావనవచ్చి ఎదురింటి మేడమీద ఖాళీగావుంది. కావా లంటే మాట్లాడుదామన్నాడని చెప్పారు.

మూర్తి, మామగారు, ఆయనతో వచ్చినవాళ్ళూ కలిసి ఇల్లు చూసేందుకు వెళ్ళారు. ఇల్లు బాగానేవున్నా లోపలికి వెళ్ళేందుకు సందులోంచి వెడితే మెట్లగది వస్తుంది. కింద రెండుగదులు, పైన రెండుగదులు – బాగానేవుంది. యాభైకి ఒప్పించి అడ్వాన్సు ఇచ్చివచ్చారు. కావుపెడ్డుకూడా వుపయోగించుకోమని తాళము ఇచ్చాడు ఇంటియజమాని. అసలే విశాఖపట్టణం, అందులో డాబాతోటలో అంతమాత్రం విశాలమున్న ఇల్లు అంత తక్కువ అద్దెకి దొరకటం చాలా అదృష్టమని అనుకుంటూ, మామగారి స్నేహితుడిదగ్గర శెలవు తీసుకుని అంతా మూర్తిగదికి చేరారు.

తెల్లవారుఝామున వెడతాననీ, మళ్ళీ పదిరోజుల్లో రావాల్సివస్తుందనీ, వచ్చేటప్పుడు అమ్మాయి పద్మని తీసుకు వస్తానని చెప్పి, ఈలోపల మంచిరోజుచూసి ఆ ఇంట్లో ప్రవేశించమని చెప్పి, అందరూ అక్కడ భోజనం పూర్తిచేసుకుని ఇంకెవర్నో కలుసుకోవాలని వచ్చినవాళ్ళతో కలసి మామగారు వెళ్లారు.

మూర్తికి ఇల్లు దొరికినందుకు సంతోషంగావున్నా, పద్మవచ్చి, వాళ్ళ నాన్న ఒక్కరోజులో ఇల్లు కుదర్చటం, ఇంటికోసం తను ప్రయత్నము చేసివుండనని చెప్పటానికి వీలు దొరికినందుకు కొద్దిగా విచారం కలిగింది.

'పద్మని తీసుకొని బావమరది చంద్రము వస్తున్నా' డని టెలిగ్రా మొచ్చింది. ఎప్పుడూ మామూలుగావచ్చే రైలు ఆ రోజు రెండుగంటలు ఆలస్యమన్నారు. ఆరోజు సెలవుపెట్టి అక్కడే తిరుగుతూ గడపాల్సి వచ్చింది మూర్తికి. తీరా రైలు వచ్చేవేళకి కాఫీకి వెళ్ళిరావటంవల్ల ఆలస్యమవటం, ఆ చివర నుంచి ఈ చివరదాకా వెతికినా బావమరది చంద్రంకాని, పద్మ కాని కనపడకపోవటంతో ఇల్లువెతుక్కుంటూ వెళ్ళారేమోనని, ఇంటికి వెళ్ళాడు. అక్కడకూడా ఎవరూ వచ్చినజాడ లేదు. రోజు అంతా వృధా అయినందుకు విసుక్కుంటూ పైకివెళ్ళి పడుకుందామనే ప్రయత్నంలో వుండగా, 'సూర్యనారాయణ మూర్తిగారి ఇల్లు ఇదేనా' అని 'ఎవరో' అడిగినట్లు వినిపించి కిటికీలోంచి చూశాడు. ఒకజీపు, లారీ ఇంటిముందు వున్నాయి. కిందికివెళ్ళి చూస్తే సామానుతోసహా పద్మ ప్రత్యక్షమయింది మూర్తికి.

"మీ కోసం స్టేషనులోపడి కూచ్చున్నా. మంచిపని చేశారు. కారులో వచ్చేవాళ్లు 'వైరు' ఎందుకు ఇవ్వటం?" అని లేనికోపం తెచ్చుకు మాట్లాడాడు మూర్తి.

"సామాను లారీలోవేసి నేనూ, నాన్న రైలులో వద్దామనుకున్నాము. అన్నయ్య జీపువస్తోందనీ, తనకి పనివుండి వెడుతున్నాననీ చెప్పటంవల్ల నాన్నరావటం మాని అన్నయ్యతో పంపారు" అని చెప్పుకుపోతోంది పద్మ.

సామాన్లు అన్నీ లోపలికి చేర్చారు. 'కూలీలు వుండగానే సామాన్లు ఏవి ఎక్కడ పెట్టాలో పెట్టించమని' పద్మకు అన్నగారు చెప్పాడు.

మూర్తికి ఆ సామాను చూస్తే భయం వేసింది.

"సామానుకి ఇల్లు సరిపోయింది. ఇంక మనం బయట కూర్చోవాలి. ఇంత సామాను ఎందుకు తెచ్చావు, ఏదో కావాల్సినవి తేక? లారీ మళ్ళీ వెళ్ళేదేకనుక కొంత సామాను వెనక్కి పంపెయ్" అని మూర్తి అన్నాడు.

"మీకు తెలవదు వూరుకోండి. ఏమి లేకపోయినా జరగదు" అని చెప్పి తన అన్నయ్యతో "ఈ సామానంతా తిప్పి పంపెయ్యమంటున్నారు చూడరా" అని ఫిర్యాదురూపకంగా అంది.

"బావ అన్నది నిజమే. ఉండేవాళ్ళు ఇద్దరు. ఇద్దరికీ ఇంతసామాను ఎందుకే? నాన్నకి మరీచాదస్తం! ఎవరు వద్దన్నా వినరు. మీరు తిప్పిపంపినా మళ్ళా ఆయన వెంటపెట్టుకువస్తారు. ఇంక కొత్తవిరాకుండా చూసుకోండి" అని నవ్వుతూ సర్దటంలో సాయపడి సాయంత్రానికి సర్దటం పూర్తిచేశారు. చంద్రం మరునాడు వెళ్ళిపోయాడు.

ఇంటివాళ్ళ పనిమనిషినే పెట్టుకోవాల్సివచ్చింది పద్మమూర్తికి. అవుసరమైన పనిచేసేటప్పుడు వాళ్లు పిలవటం, ఆపని అక్కడేవదిలి అది వెళ్ళిరావటం, వేరేవాళ్ళకోసం ప్రయత్నము చేస్తున్నారనివిని అప్పలమ్మ, కోడల్ని తీసుకువచ్చి "పెద్దపనులు నేను చేసుకుపోతా, మీ కూడా తిప్పుకుంటూ ఈ గుంటచేత మిగిలినది చేయించుకో" అని బతిమాలి పనిలోపెట్టి వెళ్ళింది.

పళ్లు ఎన్నివున్నాయోకాని పొట్టిగా, కొండపల్లి బొమ్మలా, అమృత్ షేర్‌గల్ చిత్రంలా మెరిసే నలుపూ, గుండ్రటి మొహము, పెద్దకళ్ళు, నవ్వితే మెరుస్తున్న పళ్లవరుస,

పొట్టిగా చీరకట్టు, నున్నగాదువ్వి గట్టిగా చిన్నకొప్పు - చూడ టానికి చిత్రంగా వుంది. ఒకమాట అర్థమయ్యేటందుకు చాలా సేపు అవుతుంది. 'ఏది' చెప్పినా నవ్వటం. ఎల్లాగో అవస్తపడి కొంచెం పని నేర్పింది. మూర్తి "నీ పేరేమిటి పిల్లా" అంటే, పట్టుకున్న కూజా కిందపడేసి వంటగదిదగ్గరికి పరిగెత్తుకువచ్చి, "మరి అండి, మరి అండి" అనటముతప్ప ఏంజరిగిందో చెప్పదు. ఏమిటో కనుక్కుందామని వెడితే కూజా తాలూకు పెంకులు వరండాలోపడి నీళ్ళు చక్కగా ఎండపెట్టిన వడియాల క్రిందకి జారుకొన్నవి.

"ఏమిటండీ గొడవ" అంటే "ఆ పిల్లని పేరేమిటి అన్నాను - అంతే కూజా అక్కడే పడేసి పరుగుపెట్టింది. దాన్ని మాత్రం పైకి పంపకు." అని విసుక్కున్నాడు.

"దాన్ని పేరడిగేది ఏమిటి? అస్తమానం విరామం లేకుండా నేను 'సింహాచలం' అని పిలవటం వినపట్టంలేదూ ?"

"అడగడముకూడా తప్పే? దాంతో నీళ్ళు తెప్పించి పెట్టు, టైము అవుతోంది" అన్నాడు.

ఇంకోరోజు ఇల్లు వూడ్చేందుకు ఆ పిల్ల పైకివెళ్ళేసరికి మూర్తి మొహానికి సబ్బునురగ రాసుకొనటం చూసి ఆ చీపురు అక్కడేపడేసి పరిగెత్తుకువచ్చి చివరమెట్టు దగ్గర కాలుజారిపడి, ఏడుస్తూ,

"అయ్యగారండీ, ఏసమేసుకుంటే నాకు భయమేసిం దండి" అని గట్టిగా ఏడుపు మొదలుపెట్టింది.

"అయ్యగారు ఏంచేస్తే నీకెందుకే? నీపని నువ్వు చేసుకు రాక" అని కసిరి, కూడావుండి పైకి తీసుకువెళ్ళి తుడిపించింది.

వాళ్ల అత్తనిపిల్చి, "దీనితో చాలా కష్టంగావుంది. రోజూ ఏదో వొకటి పగలకొట్టటం, పైకివెళ్లమంటే వెళ్ళటం, అయ్యగారు 'ఏదైనా' చెపితే 'అది' చెయ్యకుండా నా దగ్గరికి పరిగెత్తుకు వచ్చి కొట్టినట్లు ఏడ్వటమో, లేక ఆగకుండా నవ్వటమో – ఇల్లా విసిగిస్తోందనీ దీనితో పనిచేయించుకోలేననీ" పద్మ చెప్పింది.

ఆ పిల్లని తిట్టి "ఇంటికెళ్ళాక నీ మామకి చెప్పి తన్నిస్తా చూడు, ఎర్రేశాలు వేశావంటే. అమ్మగోరు చెప్పినట్టు యినక పోయినావంటే గంజి యెయ్యను తెల్సిందా?"

అప్పటిదాకా అమాయకంగా కనిపించినపిల్ల "నాకేమి భయమా? మా అయ్యా, అమ్మా లేరా? ఆడకేపోతా, నేను కష్టము చేస్తుంటే యింత వణ్ణము ఏత్తుండావు" అంది. "సూడండి అమ్మగారో దాని బుద్ధులు ఎట్టుండాయో అప్పుడే" అని అత్త చెప్పుతుంటె పద్మ ఆపిల్లని మందలించి, 'మీా అత్తని అల్లా అనకూడదని' బుద్ధిచెప్పి సర్ది పంపింది.

పద్మ అక్కయ్య అత్తగారు ఆవూరు 'ఎవరో' తెలిసిన వాళ్ళ ఇంట్లో పెళ్ళికివచ్చి వాళ్ళఇంటికి వచ్చింది. ఆమె పద్మతో "సముద్రపు ఒడ్డుకి వెళదాము తొందరగా పని పూర్తిచేసుకో" మని చెప్పింది. సాధారణంగా మూర్తి ఆరు గంటలకికాని ఇంటికిరాడు. ఆవేళకి వచ్చెయ్యొచ్చు అని పని పిల్లని తీసుకుని వాళ్లు ఇద్దరూ బయలుదేరారు. పద్మ లేతమబ్బు పెద్ద జరీఅంచువున్న చీరకట్టుకుని ముదురు నీలంజాకెట్టు తొడుక్కుంది. పెద్దజడ, వళ్లువున్నా సన్నటినడుము, జాకెట్టుకీ, చీరకి మధ్య పొట్టమెరుస్తూ చిన్న మడతపడింది.

సముద్రము దగ్గరగా యిసుకలో నడుస్తున్నారు. అలలు దగ్గరికి వస్తోంటే, వెనక్కిరావటం, అవి తగ్గగానే ముందుకి వెళ్లటం — ఇల్లా చేస్తున్నారు. అత్తగారు ఇసుకలో కూర్చుంది.

మూర్తి ఆరోజు తొందరగా ఇంటికి వచ్చాడు. తాళం వేసి వుండటంచూసి, ఇంటివాళ్లని అడగాలనుకున్నా, ఎందుకో బయటికినడిచి, 'ఎటు వెడదామా' అని ఆలోచించి బీచివైపు బయలుదేరాడు. వంటరిగా వెళ్ళే అమ్మాయిలికి అన్వయించే టట్టు మాట్లాడుకుంటూ అబ్బాయిలూ, తమనిగురించి ఏమి చెప్పుకుంటున్నారోనని ఓరకంటచుస్తూ, విననట్టేవింటూ కాలేజీ అమ్మాయిలు వెడుతున్నారు. వాళ్ళని దాటుకు ముందుకు వెళ్ళాడు. చేపలవాళ్ళ చిన్న చుట్టుగుడిసెలు రెండు మూడు వున్నాయి. అక్కడనిల్చుని ఎదుట వచ్చేపోయే వాళ్ళని చూస్తు న్నాడు. ఎవరో దగ్గరగావచ్చి వీపుమీద చెయ్యివేస్తే తిరిగి చూశాడు మూర్తి. వెంకటేశం భార్యని మూర్తికి పరిచయము చేశాడు. వాళ్ళు కొంచెముసేపు ఆఫీసు విషయాలు మాట్లాడు కున్నారు. వెంకటేశముభార్య "చూడండి. అక్కడ కూర్చున్న అమ్మాయిచీర ఎంతబాగుందో, ఆ లేతరంగుకి ఎరుపుఅంచు మీాద జరీమెరుస్తూ చాలా నిండుగావుంది. ఆరోజున నేను తీసు కుంటానంటే వద్దన్నారు" అంటోంది. వెంకటేశం "చీరకంటె అమ్మాయి బాగుందికనక చీరకి అందము వచ్చింది" అని నవ్వు కున్నాడు.

"చీర ఎల్లావుందన్నాకాని, అమ్మాయి విషయము అడగ లేదు" అని కోపంగా చూస్తూ నిల్చుంది. వాళ్లు ఆ విషయమే వాదించుకుంటూ, వెళ్లేందుకు సెలవు తీసుకున్నారు. వెళ్లేవాళ్లు

వెనక్కి-వచ్చి "చూడుమూర్తీ చూడనివాడిని చూడమని మళ్లీ నాపైనే నిందలు వేస్తోంది" అన్నాడు.

"ఆవిడ అడిగినదానికి చెప్పక నువ్వు వేరేచెప్పటం మూలాన్ని వచ్చింది. అప్పుడప్పుడు కొద్దిగా కలహాల్లాంటివి వుండాలి." అన్నాడు మూర్తి.

"నువ్వు వంటరిగా రావటం, ఏదో జరిగినట్లు వుంది?"

"అబ్బే! అదేమీలేదు. ఆవిడ తెమలదు. రమ్మంటె పాలవాడు రాలేదనో, పనిమనిషి రావాలనో, వంటకాలేదనో ఇవన్నీ అయ్యేసరికి మనిషి సంచారం వుండదు. అందుచేత నేనే వస్తూంటాను."

"మా ఇల్లాలు ఎప్పటికప్పుడే తయారుగా వుంటుంది కాని, మళ్ళీ వెళ్ళేదాకా దేనికోదానికి కోపం వస్తూ, పోతూ వుంటుంది-అవునా?" అన్నాడు.

"వూరుకోండి, మరీను-ఆవిడ తెమలినప్పుడే మా ఇంటికి తీసుకురండి" అని చెప్పి వెళ్ళిపోయారు.

ఇంతకీ వాళ్ళ కొట్లాటకి కారణమైన ఆమెను చూడాలని వెనక్కి నడిచేవెళ్లాడు మూర్తి. పనిపిల్ల ఇసుకలో పాతేసినట్లు కాళ్లు జాపుకుని ఇసకనిగుట్టలా పోసుకుంటూ కూర్చుంది. పద్మ కాళ్ళు ముడుచుకు, వో చెయ్యి యిసుకమీద ఆన్చి కొంగు జారుతూంటే పైకివేసుకుంటూ జడ ముందుకువేసుకు వయ్యారంగా కూర్చుని కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా ఆవిడ చెప్పేది వింటోంది.

మూర్తికి నవ్వు వచ్చింది. 'సాధారణంగా ఆడవాళ్లు బయటికి వచ్చేటప్పుడు వాళ్ళలోవున్న అందమంతా కనపడే

అంత నేర్పుగా తయారవుతారు. కాని భర్తలు వీళ్ళని గమనించక, కొత్తవాళ్ళల్లో అందాలు వెతికేందుకు వుపక్రమిస్తారు. తను చేసే పని కూడా అదేనేమో రోజూ! వాళ్ళు మాత్రము ఏమి తీసిపోయారు? 'ఎప్పుడూ వుండేవాడేకదా' అనో ఏమో, ఇంట్లో సాధారణంగా మురికి చీరలో, వెలిసిపోయినవో, లేక బొగ్గుపొడి వగైరాలతో అద్దినవో కట్టుకు అదేరూపు మనస్సులో ముద్దరలా చెరక్కుండా వుండాలనో ఏమో అన్నట్టు కనపడతారు. నోరుజారి భర్త తన ఇల్లాలిని మంచిబట్టలు వేసుకు, పువ్వులు పెట్టుకు, తనకి ఇష్టమైనట్టు తలదువ్వుకో మనండి – వెంటనే వో చిన్న వుపన్యాసము మొదలుపెట్టి – 'మీకు వయస్సు రాను రాను అసందర్భపు కోరికలు వస్తున్నాయి. మీరు చెప్పినట్లుచేస్తే, అంతా దిష్టిపిడతలా చూస్తారు! అని తనకి ఇష్టమైనట్టు చీర కట్టుకొని తనువేసుకున్న ముస్తాబుని భర్త మెచ్చుకోకపోతే అవునులెండి, నేను మీ దృష్టిలో మనిషినేకాను. అసలు నేనేమి చేసుకొన్నా బాగుండను కాదూ?' అంటూ మూతి ముడుచుకుని బిక్కమొహము పెడతారు – ఇల్లా ఆలోచిస్తూ మూర్తి వాళ్ళకి కొంతదూరంలో నిల్చున్నాడు.

పసిపిల్ల కళ్లు మూర్తిమీద పడ్డాయి. ఏదో ఉపద్రవం వచ్చినట్లు 'అయ్యగోరు' అని ఒక్క కేక పెట్టింది. పద్మ ఉలిక్కిపడి 'ఏవిటే' అని చుట్టూచూస్తూ మూర్తివేపు చూపునిలిపి అప్పుడే వచ్చేశారే! అంటూ ఆశ్చర్యంగా నవ్వింది. మూర్తి వచ్చి వాళ్ళకు దగ్గిరలో కూర్చున్నాడు.

"ఈవిడ తెలుసు కదూ; అక్కయ్య అత్తగారు. బంధువుల ఇంట్లో పెళ్లికి వచ్చారుట."

"మా అబ్బాయి అంత మందమతి అనుకోవాలి అని-కాకపోతే నేను ఎవరో గుర్తుపట్టలేడనుకొన్నావా? చూడు నాయనా, అప్పను మించిన గడుసుది, వాళ్ళదగ్గర జాగ్రత్తగా వుండకపోతే మనల్ని బుట్టలో పెడతారు" అంది అత్తగారు.

మూర్తి నవ్వి, ఆవిడ యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. పద్మ 'ఫలానా' అని చెప్పకపోతే మూర్తి ఆవిడని అసలు గుర్తుపట్టలేడు. మూర్తి చూసినప్పటికే ఆవిడ విశాలమైన మనిషి – ఇప్పుడు మరో మూడింతలు పెరిగింది. అంతా ఇంటికి చేరుకున్నారు.

పద్మ మూర్తితో రహస్యంగా "ఆవిడ నన్ను తనతో పెళ్ళివారి యింటికి రమ్మంటోందికాని, మీరు ఏదయినా చెప్పి నన్ను పంపకండి" అంది.

"పద్మా, అతనికి చెప్పిరా, వెడదాము" అంటూ అత్తగారు పైకివచ్చింది.

"ఆ, వస్తున్నా" అని, మూర్తికి చెప్పమని కళ్ళతో సైగచేసింది.

పద్మని ఏడిపించాలని, మూర్తి "మీతో తీసుకువెడుతున్నారా?" అని అడిగాడు.

"మరే, రమ్మంటున్నాను. తను లేకపోతే నీకు ఏమీ తెలీదుట. రానంటూ మారాము చేస్తోంది. వాళ్ళతోటే అంతావున్నట్టు గర్వము అప్పకీ చెల్లెలికీ."

అప్పటికే కందగడ్డలా అయిన పద్మ మొహము చూచి నవ్వుకున్నాడు మూర్తి.

"పుట్టింట్లో వుంటేమాత్రము మనసంగతే గుర్తుండదు. ఇక్కడవుంటేమాత్రము ఒక్కగంట ఆలస్యంగా వచ్చినా సహించదు. ఒక్కరోజు ఎక్కడకీ వెళ్ళకూడదు. మా వదిన గారు కూడా అంతేనా?" అన్నాడు.

"అడగాలీ యింకా? పెళ్లికిరమ్మని బతిమాలా, ససేమిరా రానంది. మీ అబ్బాయి వస్తేనే వస్తానంది – 'వాడికి తీరదాయె. పాపం ఏంచేస్తాడు. పట్టిఅప్పుడు ఎక్కడికీ తీసుకు వెళ్లరని సాధింపు. తీరావెళ్ళమంటే, మీరువస్తేతప్ప వెళ్ళనంటుంది' పద్మా, అయిందా?" అన్న అత్తగారి కేకకి వులిక్కిపడి, ఆవిడ చూడకుండా మూర్తి కేసి తొందరగా చెప్పమన్నట్టు కోపంగా చూసింది.

మూర్తి అంతవరకూ తనకు పద్మ వెడుతుందన్న సంగతి తెలీనట్టు "మీరు ఇప్పుడు పెళ్లివారింట్కి వెళ్లాలా?" అన్నాడు.

"మరే! రాత్రికేగా ముహూర్తం. నువ్వువస్తే బాగుంటుందికాని; ఎవరో వస్తారంది. పద్మని తీసుకువెడతా. పొద్దున్నే వస్తాము" అంది.

"తీసుకువెళ్ళడం తప్పులేదుకాని, వచ్చేది ఆవిడ స్నేహితురాలే, మళ్ళా తెల్లవారుఝామున వెడుతుందిట" అన్నాడు.

"అదేమిటే, అబ్బాయి స్నేహితుడన్నావు— సరేలే, నిజం మాట్లాడ్డం వాళ్ళకి అలవాటు లేదు. అప్పాయిదేవరస, మావాడు చెపితేతప్ప అసలు సంగతి తెలీదనుకో. నువ్వు రానంటే పెందరాళే వెళ్ళేదాన్నిగా?"

"పోనీ మీ అబ్బాయి అక్కడదాకా వస్తారు" అంది పద్మ.

మూర్తి ఆవిడని మహారాణిపేటలో పెళ్ళివారి ఇంటి దగ్గర విడిచిపెట్టి వచ్చాడు. పద్మ మూర్తి వచ్చేదాకా ఎదురు చూస్తూ కిటికీదగ్గర నిల్చుంది. భోజనాల దగ్గర మౌనంగా పూర్తిచేశారు.

పద్మ మంచినీళ్ల కూజాతో పైకివచ్చింది. వరండాలో అటూ ఇటూ తిరుగుతున్నాడు మూర్తి. పమిట చుట్టూతిప్పి గట్టిగా దోపివుండటం, జాకెట్టు పైకిజరిగి, కూజా బరువు రెండు చేతులతోటి పట్టుకోవడం— బిగపెట్టినట్లు గుండ్రంగా చిన్న గుమ్మడికాయలా దీపపుకాంతి పడి ఒకపక్క పొట్ట మెరుస్తోంది. మూర్తి వేళ్లతో కొడుతూ నవ్వుతున్నాడు. పద్మ దూరంగా జరిగి, "ఆవిడతో అల్లా మాట్లాడితే ఏమనుకుంటుంది? ఇంటికి వెళ్లాక అక్కనీ, నన్నూ కూడా కలిపి తిడుతుంది.

"అదా, నీ బాధ? మీ అక్కని తిట్టినా బాధలేదు కాని నిన్ను తిడుతుందని. అంతేనా?" అన్నాడు మూర్తి. 'వూరుకోండి' అంటూ గునుస్తూ వెళ్ళిపోయింది.

కాలం నెమ్మదిగా వొడుదుడుకులు లేకుండా జరుగుతూ, మధ్యలో పద్మని పంపమని తండ్రి వ్రాసే ఉత్తరాలకి పద్మ

ఇప్పుడు వచ్చేందుకు వీలులేదనో, భోజనం కుదరదనో మూర్తి చేత వ్రాయించి, వెళ్ళటం తప్పించుకునేది.

మూర్తి ఆరోజు ఆఫీసుకు తొందరగా వెళ్లాలని బట్టలు పెట్టెలోవన్నీ బైటవేసినా తనకి కావల్సినది కనపడకపోవటంతో మరీ విసుగుపుట్టి పద్మని పిల్చాడు.

"వస్తున్నానంటే వినపడదు బాబు మీకు. అన్ని సార్లు ఎందుకు పిలవటం?"

"అక్కడ మునిగిపోయే పని ఏమిటో? పిలవగానే రారాదూ!" అన్నాడు మూర్తి.

"ఇంటావిడ, అప్పలమ్మ మాట్లాడుతోంటే ఎల్లారాను!"

"ఆమాటలు ఆపి రావాలి. నాజోళ్లు కొంచెము ఇల్లా తెచ్చిపెట్టు. పనిపిల్ల మానేనా?"

"చెప్పేమాట పూర్తిగా చెప్పనిస్తేగా! ఆపిల్ల పెద్ద మనిషి అయిందట వారందాకా ఇంకో మనిషిని పంపుతా నంటోంది పనికి. ఎవరయితే ఏం పంపమన్నా" అని చెప్పింది.

మూర్తి ఇంటికి వచ్చేసరికి చాలా పొద్దుపోయింది. పద్మ తలుపుతీసి నిల్చోలేక అల్లాగే గడపమీద కూర్చుని చేతుల్లో తలపెట్టుకుని ఏదో బాధపడుతూ ''మీరు భోంచెయ్యండి నాకు ఆకలిలేదు" అంటూ లేచి మెల్లగా మెట్లను పట్టుకుని చిన్న పిల్లలు పడకుండా కూర్చుని ఎక్కినట్లు ఎక్కుతోంది. మూర్తి నిల్చుని చూస్తున్నాడు. మొదట ఆలస్యమైనందుకు కోప మనుకున్నా, అవస్థపడుతూ మెట్లెక్కటము చూసి జాలివేసి చెయ్యి పట్టుకు పైకి తీసుకు వెళ్ళాడు. పద్మకి ఆరాత్రి నాలుగైదు వాంతులయ్యేసరికి చాలా భయపడ్డాడు మూర్తి.

"వంట్లో బాగాలేదా" అంటే మాట్లాడదు. "డాక్టరుని పిలవమంటావా" అంటే 'వద్దు' అంటుంది. నీరసంగా కళ్లు మూసుకు మూలుగుతూ పడుకుంది. అడిగితే 'వద్దు' అంటుందని మూర్తి తలుపు వేసుకుని డాక్టరు దగ్గరికి బయలుదేరాడు. ఇంటి యజమాని తల్లి బైట వరండాలో పడుకుంటుంది. సాధారణంగా ఆవిడ మెలకువగానే ఉంటుంది; వుండటమే కాకుండా ఏవో పాడుతూ వుంటుంది. గేటుదగ్గర మూర్తినిచూసి ఆవిడ 'ఎవరు' అని పలకరించింది. 'నేనండి' అన్నాడు మూర్తి.

'ఇప్పుడు ఎక్కడికి నాయనా వెడుతున్నావు?' అని అడిగింది ఆవిడ. 'పద్మకి వంట్లో బాగాలేదు డాక్టరుని పిల్చుకు వద్దామని' అన్నాడు మూర్తి.

'ఆమాత్రము కష్టపడకుండా అబ్బాయో, అమ్మాయో పుడితే ముద్దులాడుదా మనుకుందా? వీటికి ఏమి మందులులే, వెళ్లి పడుకో నాయనా' అంటూ 'అన్నమ్మ ముట్టదూ' అని పాట మొదలు పెట్టింది.

మొదట అయోమయంగా తోచింది. వెళ్లకుండా వెనక్కి వచ్చాడు మూర్తి. అప్పుడే కొంచెము నిద్రపట్టింది పద్మకి. పద్మకేసి చూచాడు. దీపం తీసినా వెన్నెల మొహం మీద పడుతోంది కిటికీలోంచి. గాలికి జుట్టు కొట్టుకుంటోంది. కళ్లకింద రెప్పలనీడ మధ్య వెన్నెలకాంతి పల్చగా కనిపిస్తోంది. కంటికొలికిలో నిల్చిన నీటిపైన పడ్డకాంతి, గాలికి కదులుతూ మెరుస్తోంది. మూతి, బిగబెట్టడంతో ఇంకా చిన్నదిగా సున్నాలా కనపడింది. గెడ్డమువంపు దిండుపైన నీడలో పెద్దదిగా కనిపిస్తోంది. ఎప్పుడూ చిన్న చప్పుడైతేనే నిద్రపోని పద్మ యింత

హాయిగా నిద్రపోవడము తల్లిని కాబోతున్నానన్న గర్వమేమో అనుకున్నాడు మూర్తి. లేపి అడుగుదా మనుకున్నాడు. నీర సంగా పడుకుంటే నిద్ర పట్టివుండవచ్చు అనుకుని కిటికీరెక్క ఒకటివేసి నిద్రపోయాడు మూర్తి.

పద్మ రోజూ ఆ బాధకి అలవాటుపడి అల్లాగే అవస్థ పడుతూ గడుపుతోంది. మూర్తి "మీ అన్నయ్య వస్తాపట రేపు. నువ్వు కొన్నాళ్లు మీవాళ్ల వూరికి వెళ్లివస్తే బాగుం టుందనుకుంటాను" అని పద్మకేసి చూచాడు.

పద్మ తలవంచుకు సిగ్గుపడుతూ, "ఇప్పుడు వెళ్ళను. వెడితే అప్పుడే రానివ్వరు" అంటూ మంచముమీద పడుకుని గోడపక్కకి తిరిగి "మీకు కష్టంగా వుంటే చెప్పండి వెడతా" అని నెమ్మదిగా అంది.

"మీ అన్నయ్య కనక నువ్వు రానంటే వూరుకుంటాడు. మీనాన్నవస్తే నువ్వే ముందు బయలుదేరుతావు. రానన్నా ఆయన ఎల్లాగా తీసుకు వెళ్ళటము మానడు. ఈసారి నువ్వు వెడతానని గోడవచేసినా పంపను. సరేనా? నువ్వు పని చెయ్యటము కష్టమని వెళ్ళమంటున్నా, అల్లా మాట్లాడ వచ్చా? నేను చెప్పినట్లు వింటే పంపను. రేపటినుంచి వంట మానెయ్యి. కొన్నాళ్ళు కేరియర్ తెప్పించుకుందాము" అన్నాడు మూర్తి. "ఎప్పుడేనా చెయ్యలేకపోతే తెచ్చుకో వచ్చు కాని రోజూ ఎందుకు?" అంది పద్మ.

పద్మ అన్నగారు రావటం, పద్మనుచూసి 'చాలా చిక్కి పోయిం'దని జాలి పడటం, తనతో పంపించమనటం, మూర్తి 'మీ చెల్లెలు వస్తానంటే తీసుకువెళ్ళ' మనటం, పద్మ కోపంగా

మూర్తికేసి చూడటం, 'ఇంకా నాలుగు రోజులు వుంటావుగా ఆలోచించుకుందాములే' అని మూర్తి మాట మార్చటం జరిగాయి.

అన్నగారు వున్నన్నాళ్లూ రోజూ సాయంకాలము బీచికి వెళ్ళి రాత్రి హోటల్లో భోంచేసి రావటం మామూలుగా జరిగినా ఆ రోజు దారిలోనే పద్మకు వాంతులు మొదలుపెట్టి, రాత్రి అంతా బాధపడటం చూసి అన్నగారు పద్మని తనతో తీసుకువెడతానని మూర్తికి చెప్పాడు. మూర్తికి మొదట పంపటము ఇష్టంలేకపోయినా, కొన్నాళ్ళు వెళ్లివస్తేనే మంచిదనిపించి, పంపేందుకు ఒప్పుకుని, పద్మని ప్రయాణానికి సిద్ధం చేసుకోమన్నాడు. అన్నగారి ఎదుట కోపము చూపించటము ఇష్టములేక ఎవరూ చూడనప్పుడు కోపంగా మూర్తిని చూసేది పద్మ. తన తాలూకు సామాను ఒక్కటీ వుంచకుండా అవసరం లేకపోయినా అన్నీ తెచ్చిపెట్టెదగ్గర కుప్పగా పెట్టుకుంది పద్మ. మూర్తి అది గమనించినా మాటల ధోరణిలో చూడనట్టు వూరుకున్నాడు. అన్నీ పెట్టెలో పట్టించినా పెట్టె తాలూకు మూత పట్టనని భీష్మించుకుంది. పెట్టె ఒక పక్క నొక్కితే ఇంకోపక్క పైకి లేచి, రెండు పక్కలా గట్టిగా అదిమిపెడితే మధ్యన గొళ్ళెము పట్టక పెట్టెతో పద్మ పడే అవస్థచూసి, మూర్తి సహాయంచేద్దామని వెళ్ళాడు. 'ఇవన్నీ ఎందుకు; పది రోజులుండి వచ్చేదానికి' అంటున్నాడు మూర్తి. పద్మ సమాధానము చెబుదామనే సరికి అన్నగారు వెనక వుండటముచూసి మొహము పక్కకి తిప్పి మూతి ముడుచుకు 'వుండాలిలెండి'

అంటోంది. మూర్తి ఎల్లాగో పెట్టెకు తాళంవేసి 'ఇంక మధ్యలో మాత్రము తియ్యకు' అన్నాడు.

పద్మ పాలవాళ్ళకి ఇవ్వాల్సింది, పనిమనిషికి ఇవ్వాల్సింది, చాకలికి లెక్కచూసుకు ఇచ్చుకోమని, 'సామాన్లు అన్నీ ఎక్కడివి అక్కడ పడేస్తే పోతాయి అని, పనిమనిషి వెళ్ళేట ప్పుడు చూడమనీ,' 'మీ ఇష్టము ఏమి చేసుకుంటారో, నేను చెపితే మీరు వింటారు కనక నా' అని అన్నీ అప్ప చెప్పి తనకి ఆ ఇంటితో సంబంధం లేనట్లు చెప్పటం వింటూంటే మూర్తికి నవ్వు వచ్చింది. వాళ్లు వెళ్లే రైలు రెండు గంటలకి వస్తుంది కనక తను ఆఫీసునుంచి వస్తే ఇంటికి వస్తానని. లేక పోతే స్టేషన్‌కి వస్తానని చెప్పి మూర్తి వెళ్లిపోయాడు.

పద్మ అన్నగారు పద్మని వెయిటింగ్ రూమ్‌లో కూర్చో పెట్టి మూర్తికోసము చూస్తున్నాడు. ఆరోజు రైలురావడం గంట ఆలస్యమని వ్రాసిపెట్టారు. మూర్తి రావటంకూడా అంత ఆలస్యమయింది. ఆఫీసరు క్రొత్తవాడని, ఆరోజు అందరి మీదా చాలా కోపంగా ఉన్నాడని, ఆరోజు శెలవుపెట్టి వుండా ల్సినదని అనుకుంటూ వచ్చానని మూర్తి చెప్పాడు. తను వచ్చే సరికి వాళ్లు వెళ్ళిపోయి వుంటారనుకుంటూనే వచ్చానని చెప్పాడు. ఆలస్యముగా రైలు రావటముకూడా మంచిదయిం దంటూ పద్మ కూర్చున్న దగ్గరికి వెళ్ళాడు. పద్మ ప్రతిక్షణం బైటికిచూస్తూ, ఏం తోచక చీరకొంగు వేళ్లకి చుడుతూ, విప్పుతూ కొంతసేపు ఎదర కూర్చున్న వాళ్ళనిచూస్తూ, కొంచెంసేపు అటూఇటూ తిరుగుతూ విసుగ్గా మళ్లీ వచ్చి కూర్చోటము- ఇలా గడుపుతోంది అంతసేపూ-

రైలు రావటంతోటే జనం ప్లాట్‌ఫారముమీద ముందుకి కొందరు, వెనక్కి కొందరు ఎదటివాళ్ళని చూడకుండా తోసుకొంటూ హడావిడిగా పరుగు పెడుతున్నారు. మూర్తి పద్మ చేతిలో మరచెంబు తీసుకోబోతే వద్దని మొహము ముడుచుకు దూరంగా నడిచివెడుతోంది. అన్నగారు పెట్టె చూపిస్తూ "ఇక్కడే, నువ్వు ఎక్కుముందు" అని లోపల పరిచిన జంబుకానా చూపించాడు. మూర్తి కూలీలచేత సామాన్లు పక్కగా పెట్టించాడు. సంపంగిపూల పొట్లము పద్మకి ఇచ్చాడు.

ఎవరో బైటనుంచి తొంగిచూసి మూర్తిని చెయ్యి పట్టుకు కిందకు లాగుతున్నాడు నవ్వుతూ. ఆకొత్తగా వచ్చినాయన్ని చూసిన గుర్తు లేదు పద్మకి. మూర్తిని నడుముమీద చెయ్యేసిపట్టుకు దూరంగా తీసుకువెళ్ళేడు అతను. మిగిలిన వాళ్ళతో కలిసి గట్టిగా నవ్వులు మాత్రము వినపడుతున్నాయి పద్మకి.

గంట కొట్టారు. అన్నగారు కిళ్ళీ నములుతూ వచ్చి 'అతనేడే' అన్నట్టు పద్మకేసి చూశాడు. సమాధానంగా పద్మ మూర్తి వున్న వేపు చూపించింది. మూర్తి, ఆ కొత్తమనిషి కలిసి గబగబా వస్తున్నారు. మూర్తిని లోపల ఎక్కమంటున్నాడు ఆకొత్తమనిషి. మూర్తి అతనిని నా స్నేహితుడు "మాధవరావు" అని పద్మకి పరిచయం చేశాడు. పద్మ అన్నయ్యని చూపి "ఆయన మా బావగారు" అని నవ్వుతూ మాధవరావుకి చెప్పాడు. రైలు కదిలింది. పద్మకి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. 'వెడుతున్నా' నని తల వూపింది పద్మ.

'నువ్వు వెళ్లటములేదా?' అని మాధవరావు మూర్తిని అడుగుతున్నాడు.

జేబురుమాలుతో మొహము తుడుచుకుంటూ 'లేదు' అన్నట్లు తల వూపాడు. మూర్తి పద్మకేసి చూస్తున్నాడు. వంగి కనిపించేవరకు చూస్తోంది. మూర్తి చేతిరుమాలు వూపుతున్నాడు. అన్నగారుకూడా చేతిగుడ్డ వూపుతున్నాడు కనిపించినంతసేపు.

మూర్తికి ఇంటికివస్తే, ఒంటరిగా వుండటము కొంచెము బాధగా వుండేది కొన్నాళ్లు. స్నేహితుల ఇళ్ళకి వెళ్లి పొద్దుపోయేదాకా వుండి, హోటల్లో భోంచేసి సముద్రపు రొద వింటూ కొంతసేపు ఇసుకలో కూర్చుని ఇంటికి వచ్చేవాడు. పద్మ వెళ్ళి రెండు నెలలు అయినా 'వస్తూన్నట్లు' రాయదు. 'పనిమనిషి వస్తోందా?' 'ఆ పిల్లని పంపుతోందా?' 'మీరు కారియర్ తెప్పించుకుంటున్నారా?' 'స్నేహితులతో సంతోషంగా కాలం గడుస్తుందనుకుంటా'— ఈ రకమైన ఆరాలుతీసే వుత్తరాలు తప్ప 'తను ఏమి అవస్థపడుతున్నాడో అన్న జాలి లేకుండా హాయిగా పుట్టింట్లో మకాము పెట్టుకుని తను రమ్మని వ్రాసినా దానికి బదులుగా ఏవేవో వ్రాయటం' — వుత్తరం వచ్చినప్పుడల్లా కోపము ఎక్కువ అవుతోంది మూర్తికి.

మూర్తి ఆ సాయంకాలము ఇంటికి వచ్చేసరికి తాళము పెట్టిన తలుపుకి అతికించినంత దగ్గరగా ఆనుకుని నిల్చుని, మెళ్లో పూసలు అటూ ఇటూ తిప్పుకుంటూన్న పనిపిల్ల కనిపించింది. పద్మ వెళ్లాక ఆ పనిపిల్ల రావటం ఆ రోజే.

(10)

'ఏం పిల్లా, బాగున్నావా?' అని తలుపుతీస్తూ అడిగాడు మూర్తి. కొంగుతో నోరు నొక్కుకుంటూ అరుగుమీదనుంచి కిందికి దూకి, అరటిచెట్లలో దూరి రెండుచెట్లని పట్టుకుని వింత జంతువుని చూసినట్లు చూస్తోంది మూర్తిని ఆ పిల్ల. కింద పడిం దేమోనని అటుచూస్తే దూరంగా గుంపుగా విచ్చలవిడిగా పెరి గిన అరటిచెట్లమధ్య, పిల్ల నలుపుకి కొత్త అందము వచ్చినట్లు కనిపించింది.

మూర్తి తెల్లవారి లేచేసరికి చాలా పొద్దు ఎక్కింది. తలుపుతీసి పనిమనిషికోసము చూశాడు మూర్తి. కనపడకపోతే తనే వెళ్లుదామని బయలుదేరాడు కాఫీకి. ఫ్లాస్కు పైన వుంది—పైకి వెళ్లి తేవాలంటే బద్ధకంగావుంది మూర్తికి. నెమ్మ దిగా మెట్లు ఎక్కుతున్నాడు. మళ్ళీ 'ఫ్లాస్కు ఎందుకులే' అను కుని వెనక్కి తిరిగాడు. పనిపిల్ల చీపురుతో వెనక ఎక్కటము చూడలేదు. ఏమో తూలి పడబోయి పిల్ల జబ్బ పట్టుకున్నాడు మూర్తి. 'హిహి' అని నవ్వుతూ చెయ్యి జరిపి ముడుచుకు, ఇంకా పొట్టిగా వంగి మెట్లకిందకి పరుగెత్తింది.

'ఏంటె పిల్లా' అని అప్పలమ్మ కంఠము పక్కఇంట్లో నుంచి వినిపించింది.

ఇది ఏమి చెపుతుందోనని మూర్తి చూస్తున్నాడు.

'ఏమీ లేదులే' అని కిందపడ్డ చీపురు తీసుకు వెనక్కితిప్పి, అన్నీ సరిగా వచ్చేలాగ గోడకి కొడుతూంది'

'పిల్లా, కాఫీ తెస్తావా' అన్నాడు మూర్తి.

'నాకు తెల్దు. మా అత్తని పిలవండి. తెస్తాది.'

'నువ్వే పిల్చుకురా' అని కోపంగా అనగానే ఏడుపు మొదలుపెట్టింది.

'సరే బాగానే వుంది' అని విసుక్కుంటూ బైటకి వెళ్ళి ఆ పిల్లని ఇవతలకి రమ్మంటే రాకుండా నిల్చుంది.

అప్పలమ్మని పిల్చి 'కాఫీతెమ్మంటే ఏడుస్తోంది చూడు' అన్నాడు మూర్తి.

'అదే వరసండి బాబా, ఇంటికాడ నామాట అసలే ఇన్దు. నేను తెచ్చి ఇస్తాలెండి. అమ్మగోరిమాట ఇంటాదండి. ఎప్పుడు వొత్తారండి అమ్మగారు.'

'ఏమో 'తెలీదు' అన్నాడు మూర్తి.

ఆరోజు మూర్తి మామగారికి పద్మని తీసుకుని వెంటనే రమ్మని, తనవంట్లో బాగా లేదని ఉత్తరం వ్రాశాడు.

ఆరాత్రే మూర్తి తండ్రి, అన్నగారూ వస్తూన్నట్లు స్టేషన్ కి రమ్మని టెలిగ్రాము వచ్చింది. అప్పలమ్మని రెండు క్యారియర్లలో భోజనం తీసుకురమ్మనిచెప్పి స్టేషన్ కి వెళ్లాడు. మూర్తి తండ్రి రైలు దిగగానే వాళ్లు ఎందుకువచ్చారో చెప్ప బోయాడు. అన్నగారు 'ఏమిటా ఖంగారు. ఇంటికి వెళ్ళాక మాట్లాడుకోకూడదూ' అన్నాడు.

'అంతేలే' అంటూ చెప్పబోయినమాట ఆపి దిగులుగా అటూ ఇటూ చూస్తున్నాడు మూర్తి తండ్రి.

మూర్తికి అన్నగారిమీద కోపము వచ్చింది. చిన్న పిల్లాడిని కసిరినట్టు తండ్రిని అల్లా అనటము ఏమిబాగుంది, అను కున్నాడు. ఇంటికి చేరారు.

'మీరు ఇక్కడ వుండండి, తలుపుతీసి, దీపమువేశాక వద్దురుకాని' అని మూర్తి వెళ్లాడు సందులోకి. తలుపుమీద చెయ్యిపెట్టి తడిమాడు తాళముకోసం. మెత్తగా చల్లగా చేతికి తగిలేసరికి వులిక్కిపడి వెనక్కితగ్గి, పనిపిల్ల ఏమోనని గుర్తుకి రాగానే చీకట్లో కిందకివురికి ఏకాలో విప్పుకుంటుందని తట్టి, చెయ్యి పట్టుకోబోయాడు. చీకట్లో మూర్తి చెయ్యి పొట్టపైకి జరిగింది. ఆ పిల్ల కిలకిలా నవ్వుతూ, మూర్తి చేతిని తన చేతులతో పట్టుకుని కాగితముపొట్లము నలిపినట్లు తిప్పుతోంది.

తాళము తీసి దీపమువేసి తండ్రిని లోపలకు తీసుకు వచ్చారు.

భోజనాలయ్యాక, పిల్లని వున్న అన్నమూ అవీ తీసుకు వెళ్ళమన్నాడు మూర్తి. వెళ్ళకుండా మెట్లపైన కూర్చుని కాళ్లు కిందకిరాస్తూ, పైకీ, కిందకీ చూ స్తూకూర్చుంది.

'ఏం కావాలి? పొద్దుపోయింది వెళ్ళు' అంటున్నాడు మూర్తి. ఏదో చెప్పబోయి వాళ్ళ అత్తని, అప్పలమ్మని చూసి వూరుకుంది.

'అయ్యగోరు నిల్సుంటే నువ్వు కూకుంటావు ఏసం. పెద్దోళ్ళకాడ ఎల్లా మసులుకోవాలో తెల్దుబాబయ్యా దీనికి' అంది అప్పలమ్మ.

'చీకట్లో దీన్ని ఎందుకు పంపావు? నువ్వురాక' అన్నాడు

'నేను కూడానే వచ్చానండి. ఆ యమ్మగోరు పిలిస్తే ఎళ్లా' అంది.

'చూడు అప్పలమ్మా, మావాళ్లు వచ్చారుకాని, పొద్దున్నే నాన్నకు స్నానము అలవాటు. ముందు నీళ్లు కాచి యిచ్చి నీ పని తరువాత చేసుకో' అన్నాడు. 'మంచిది బాబయ్యా!' అంది అప్పలమ్మ.

ఆ పిల్లని రమ్మంది అప్పలమ్మ. కూర్చుని లేవకుండానే 'లోపల వణ్ణము వుందిట, తెచ్చుకోవాలి' అంది.

'నాకే పని చెపుతుండావు!'

మూర్తి అన్నయ్యకి నిద్రపట్టిందనుకొని తండ్రి 'శాంతకి పెళ్లిసంబంధము వచ్చింది. పిల్లవాడు మెడిసిన్ చదువు తున్నాడు. పదివేలు ఇస్తేకాని ఒప్పుకోలేదు. ఆఖరిపిల్లకదా, ఆస్తీ, చదువూవున్న సంబంధము కుదరటము అరుదు అని మీ అమ్మకి ఈపెళ్లి చేయాలని పట్టుగా వుంది. మన తాహతుకి ఎక్కువ అయినా ఒప్పుకున్నాను. పిల్లాడికి పిల్ల నచ్చింది కనక గాని లేకపోతే 15 వేలదాకా ఇస్తామని వచ్చారుట' అని మూర్తితో చెప్పాడు.

'మన అదృష్టం బాగుంది. లేకపోతే ఇరవై వేలయినా అమ్మ ఒప్పుకోమనేది' అన్నాడు అన్నగారు.

'ఆ మాత్రము ఇవ్వందే ఎవరు చేసుకుంటారురా? అయినా అమ్మ అన్నీ ఆలోచిస్తే నేగాని వోపట్టాన ఒప్పుకోదు' అన్నాడు మూర్తి.

'నీకేంరా. చెపుతావు! పిల్లలు కలవాడిని వాళ్లకికూడా చెయ్యాలిగా? ఉన్నది అమ్మి, పెళ్లిళ్లు, పురుళ్లు వగైరాలకి ఖర్చుచేసి మనకి సున్నా చుడతారు.'

మూర్తికి అన్నగారి ధోరణి నచ్చలేదు. తండ్రి చిన్న పుచ్చుకున్న మొహంతో కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు. ఆ సంభాషణ ఆపి పొద్దుపోయింది, పడుకుందామని లేచాడు మూర్తి.

మూర్తికి మెళుకువ వచ్చేసరికి చీకటి పూర్తిగా వెళ్తురుని వదలకుండా పట్టుకుంది. వెలుగు పెనుగులాడుతూ తన కాంతిని సైన్యంలా పెంచుకుంటోంది. తన రాజ్యంలోకి శత్రువులు రావటంచూచి సహించలేక భూమిని ఆశ్రయించినట్టు చీకటి కింద పొర్లుతోంది. ఏమిటి ఈ పిచ్చి ఆలోచన అనుకుంటూ తండ్రికి స్నానానికి నీళ్లు లేవేమో అనుకుంటూ వళ్ళు విరుచుకుంటూ లేచాడు మూర్తి. అగరువత్తులు వెలిగించి, దేవుడు బొమ్మలువున్న క్యాలెండర్లన్నింటికీ తడిసిన బట్టలతో పెట్టుకురావడం చూశాడు మూర్తి. 'చన్నీళ్లు పోసుకున్నారా' అని అడిగాడు మూర్తి.

'లేదు, ఆపిల్ల వేడినీళ్లు పెట్టింది పాపం' అన్నారు.

అన్నగారు ఏదో పనివుందని, ముందు వెడతానన్నాడు. 'అబ్బాయిని చూశాక వెడుదువుకాని' అన్నారు తండ్రి. 'ఆ నేను చూసేదేమిటి-మీరూ తమ్ముడూ వెళ్లిరండి' అన్నాడు ఆయన.

మెడికల్ కాలేజి హాస్టల్‌కి బైలుదేరారు మూర్తీ తండ్రి. ఎందుకోరా ఈ సంబంధము వాడికీ, మీ వదినకుకూడా ఇష్టం లేదు. మీ అమ్మకి ఇదే చెయ్యాలని పట్టుగావుంది. ఇంట్లో రోజూ గొడవే. ఆస్తి పంచిపెట్టమని మీ వదిన మీ అమ్మతో అందిట. మీ అమ్మసంగతి తెలుసుగా. ఇది అంతా నాది. నేను

ఉండగా ఆశ పెట్టుకోకు అందిట. మీఅమ్మ అనటం— మీవదిన చెల్లెలిని ఈ అబ్బాయికి ఇద్దామనుకున్నారట. పిల్ల నచ్చక వద్దన్నారట. మీవదిన చెప్పటం—వాళ్ళు వట్టి పేచీకోరు వాళ్ళు. మావాళ్ళు ఇవ్వటానికి ఇష్టపడ లేదంటుంది. ఏమయితేనేం మన శాంతిని ఇవ్వటానికికూడా ఇష్టంలేదు' అని చెప్పారు.

హాస్టలు దగ్గర బండి ఆపి, 'మళ్లీ వస్తాము' అని చెప్పి పైకి వెళ్లారు, అబ్బాయి గది వెతుక్కుంటూ. మూర్తి తండ్రి ఆ అబ్బాయిని మూర్తికి పరిచయం చేశాడు. ఆ అబ్బాయిని చూడగ్గానే 'ఎంత అందంగా వున్నాడో' అనిపించింది మూర్తికి. పసిమిరంగు వళ్లు, గాలికి కదులుతూన్న వంకెలజుట్టు నుదురు మీదికి జారి వూగుతూంది. పెద్దకళ్లు, నవ్వితే సొట్టలుపడే బుగ్గలు, వంపు తిరిగిన గెడ్డం— ఏదో వేషం వేసుకుంటూవచ్చిన రాజకుమారుడులా కనిపించాడు మూర్తికి. మూర్తి చూడడం చూసి సిగ్గుపడి తలవంచుకు 'కాఫీ తీసుకుంటారా?' అని అడిగి తెప్పించేందుకు వెళ్లాడు అతను. మూర్తి తండ్రి వద్దు అంటూ అతని వెనకాలే వెళ్లి పిలుచుకు వచ్చాడు.

"మీ నాన్నగారు నీకే ఇవ్వమన్నారు నీ ఇష్టమైన బట్టలు తీసుకో" అని డబ్బు చేతిలో పెట్టాడు.

ఇంటికి చేరుకునే సరికి పది అయింది. మూర్తి ఆరోజు శెలవు పెట్టి; బజార్లో ఏవో కావాలంటే తండ్రికూడా వెళ్ళాడు.

'అమ్మకి పిల్లాడు నచ్చివుంటాడు. అక్కయ్య పెళ్లికి బావ బాగాలేడు ఇవ్వనని ఎంత గొడవచేసింది' అన్నాడు మూర్తి.

"నీకు జ్ఞాపకంవుందే ఇంకా," అంటూ తండ్రీ కొడుకులు నవ్వుకున్నారు.

మూర్తి తండ్రి ఆ రాత్రి బయలుదేరి వెళ్లిపోవాలన్నాడు. 'పెళ్లి పదిరోజులు వుంది– నువ్వు నాలుగు రోజులు ముందువస్తే బాగుంటుంది' అన్నాడు మూర్తితో.

అన్నగారు 'ఇదేకాని ఇంకో ముహూర్తం లేదా? అప్పటికి నాకు శెలవు దొరుకుతుందో లేదో' అన్నాడు. 'తరువాత మూఢం వస్తుందిట. ముందే పెడితేసరి, శెలవు దొరక్క– ఏం చేస్తుంది?' అన్నాడు తండ్రి.

తండ్రిని రైలు ఎక్కించి, అన్న సినిమాకి రమ్మంటే వెళ్ళకుండా ఇంటికి వచ్చేడు మూర్తి. దారిలోనే వర్షం కొద్దిగా తుప్పర మొదలుపెట్టి ఇంటికి వచ్చేసరికి పెద్దదయింది. బట్టలు మార్చుకు తల తుడుచుకుంటున్నాడు మూర్తి. తలుపు చప్పుడైతే కిందికివచ్చి తలుపుతీసి చూశాడు. పనిపిల్ల పూర్తిగా తడిసి చేతులు ముడుచుకుని వణుకుతోంది.

'ఇప్పుడు ఎందుకు వచ్చావు?'

నుదుటుమీదనుంచి కళ్ళమీదకి జారుతున్న నీళ్ళని వేళ్ళతో తీసి కింద జల్లుతోంది – 'అత్తకు ఇషమ జ్వరమంట వచ్చింది, డాక్టరు దగ్గరికి ఎళ్లేందుకు డబ్బులు కావాలంట – మిమ్మల్ని అడిగి తెమ్మంది' అంది పిల్ల.

పైకివెళ్ళి ఐదు రూపాయలు తెచ్చాడు. గోడమీద వేసివున్న పంచెతీసి మీదవేసి తుడుచుకోమన్నాడు. పంచె వుండచుట్టి వాసన చూస్తోంది, ఆ పిల్ల.

'బలే వాసనేస్తాయి ఏూ బట్టలు సెంటు - వోసన' అని నవ్వుతోంది.

మూర్తి డబ్బు ఇవ్వబోయాడు కళ్ళల్లోకి చూస్తూ నిల్చుంది. 'వూ, తీసుకో' అని చేతిలో పెట్టబోయాడు. మూర్తి చెయ్యి పట్టుకుని గుండెలదగ్గర పెట్టుకు అదుముతూ 'ఎచ్చగా వుంది'—అంటూ కళ్లుమూస్తూ తెరుస్తూ మూర్తిని చూస్తోంది. మూర్తి నవ్వుతూ పిల్ల కేసి చూస్తున్నాడు. దానిచేతిలో పంచి తీసి తలపైనించిచుట్టి పొట్ట చేత్తో గట్టిగా నొక్కుతూ, 'వెళ్లు వాన తగ్గింది' అన్నాడు మూర్తి. కప్పిన పంచికిందకి చెయ్యి తీసుకుని పొట్టపైన పెట్టుకు రుద్దుతోంది.

సందులోంచి 'సించెలము' అని కేక వినిపించింది. మూర్తి కళ్ళతో వెళ్లమని చెపుతున్నాడు. వెళ్ళనని తల అడ్డంగా వూపుతోంది. పిల్ల చేతిలో డబ్బుపెట్టి గుప్పిట మూశాడు మూర్తి. వీపుమీద చెయ్యివేసి వెళ్ళమని గుమ్మం వేపు తిప్పాడు. వెళ్ళకుండా బిగుసుకుని గుమ్మాన్ని పట్టుకు నిల్చుంది. 'రావేమే' అని మళ్ళీ కంఠము వినిపించింది. మూర్తి కేసి అర్థంలేకుండా చూస్తూ నిల్చుని గోడని గోళ్ళతో గీకు తోంది. జోళ్ళ చప్పుడికి తప్పుకుంది. మూర్తి అన్నగారు తడిసి పోయి వచ్చాడు. స్నేహితుడు కనిపిస్తే వాడితో వెళ్ళాననీ, సినీమాకి వెళ్ల లేదనీ చెప్పాడు ఆయన.

పిల్ల తెల్లవారి రాలేదు. నాలుగు రోజులు ఎవరూ రాలేదు. ఎవరో కొత్త మనిషి వచ్చి 'అత్తాకోడళ్లు జరాలతో

పడి వుండారండి – రెండు రూపాయలు వుంటే అడిగి తెమ్మం దండి.'

'పిల్లకి ఐదు రూపాయలు ఇచ్చాను' అన్నాడు మూర్తి

"నాకు తెల్దండి ముసల్ది అడుక్కురమ్మని బతిమాలితే వచ్చా" అంది ఆ వచ్చిన మనిషి.

మూర్తి ఇచ్చి పంపాడు.

ఆ రోజు అన్నగారు వెళ్ళిపోతానంటే, "నేను వస్తా రేపు" అని ఆపాడు మూర్తి.

పొద్దున్న మూర్తి కాఫీ తీసుకు ఇంటికి వచ్చేసరికి అప్పలమ్మ మెట్లపైన కూర్చుని కళ్ళూ, ముక్కూ తుడుచుకుంటోంది. మూర్తినిచూసి ఏడుపు మొదలుపెట్టింది. "ఏమిటి" అని ఎంత అడిగినా చెప్పకుండా శోకాలు పెడుతోంది అప్పలమ్మ. మూర్తి అన్నగారు "చెప్పకుండా ఏడుస్తావేమిటి" అని విసుక్కున్నాడు. " ఆ పిల్ల బాబయ్యా ఆఖరిదాకా మీ మాటేసనండి 'అయ్య గోరు' అనటం, నవ్వటం. ఆయాల ఈడకి వచ్చింది. తడిసిన స్తే మీరు పంచి యిచ్చారని సెప్పిందండి. తెల్లారి లెగలేదండి. నేను పోయి అది బతక్కూడదా...ఆ భగవంతుడికి నామీద కనికరం లేదు" చెప్పుకుపోతోంది అప్పలమ్మ.

మూర్తి ఆ మాట వినగానే నమ్మలేకపోయాడు. కొంత సేపు మాటరాక ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుని, 'ఏదో మాట్లా డాలి'కదా అని "మందు ఇప్పించలేదా" అని అడిగాడు మూర్తి.

'డాకటరు మందు ఇప్పించాం బాబయ్యా. నూకల్లేవు దానికి' అని ఏడుస్తూ, సంధిలో కూడా మీరు ఇచ్చిన పంచి

వదలకుండా గుండెలకాడ ఎట్టుకుని, సేతులు నలుపుకుంటూ "అయ్యగోరు మంచివోరు" అంటూ మీ వూసేనండి మీరు ఇచ్చిన డబ్బు మొల్లో పెట్టుకుందండి. మాకు సెప్పలేదండి. కొన్నాళ్లు మా అప్పకూతురుని పంపుతా, పని చేయించుకోండి' అంది అప్పలమ్మ.

'ఇప్పుడు వద్దులే ఇవాళ వూరికి వెడతా, వచ్చాక కబురు పెడతా' అన్నాడు మూర్తి.

"మంచిది అండి మళ్ళీ ఎప్పుడు వత్తారండీ?"

'పదిహేను రోజులు అవ్వొచ్చు' అన్నాడు మూర్తి.

"మీ డబ్బు వచ్చాక చేసి తీర్చుకుంటా బాబూ"

'పరవాలేదులే' అన్నాడు మూర్తి.

అప్పలమ్మ వెళ్ళిపోయాక ఆ పిల్ల ఇంట్లో తిరుగుతూన్నట్టే అనిపించింది మూర్తికి.

రైలులోకూడా మూర్తి ఆలోచిస్తూ బైటికి చూస్తూ కూర్చోటము చూసి 'అల్లావున్నావేంరా?' అని అన్నగారు అడిగాడు మూర్తిని.

'జీవితమంటే భయమేస్తుందికదూ. ఆ పిల్లని తల్చుకుంటే జాలివేస్తుంది'—

'అదా' అల్లా ఆలోచిస్తే తేలేది శూన్యం. ఎవరికి ఎక్కడితో ఆఖరు అయితే అక్కడితో వెళ్ళిపోవాలి. చూడు, ఆ ముసలిది రాయిలావుంది. ఆ పిల్ల పోవటముచూస్తే మన చేతుల్లో ఏమీలేదు అనిపిస్తుంది. తెరమీద బొమ్మలం. ఎప్పుడు ఏ బొమ్మని తీసేస్తే అక్కడితో అది ఆఖరు. మనమూ అంతే.'

మూర్తి అన్నగారి మెట్టవేదాంతం వింటోన్నా ఆ పిల్ల సినిమాలో రీల్సులా బుర్రలో తిరుగుతోంది. చదువూ సంస్కారమూ వుంటే వో రకంగా వుంటారని వూహించుకోడము పొరపాటేమో. కోరిక అందరికీ ఒకరకంగానే ఉండవచ్చు. ఒకవయస్సులో, అంటే చిన్నతనంలో కోరినదాన్ని సాధించాలనే ఆరాటంతో మనస్సు బాధపడటం, కొద్దిగా మధ్య వయస్సుకి జరిగేసరికి హోదాకి సంఘంలో గౌరవానికి తలుపులుతీసి మిగిలినద్వారాలకి తాళము వేసినట్లు నటించటము, మధ్య వయస్సు దాటుతుందనే బెంగతో తనని ఎవరూ గుర్తించరనే భయం లోపల పలకరిస్తోంటె కొత్త స్నేహాలకి తహతహలాడటము, లభ్యము అయినవాడు ముదిమి, స్నేహాన్ని విడదీస్తుందనే బెంగతో బోడితల తడుముకుంటూ ఇంకా పదికాలాలు ముందుకి పంపుతాడు మనస్సుని. లభ్యముకానివాడు ఓటమికి మనస్సు బాధపడుతుంటే, మనస్సు అదిమిపట్టుకు వేదాంతం కోసము తల తడుముకుంటూ పదికాలాలు ముందుకు పరుగెట్టి బాహ్యప్రపంచాన్ని, అశాశ్వతమైన శరీరాల్ని, ఇంద్రియ లోలత్వాన్ని ద్వేషిస్తూ, వేదాంతపు నీడలు వెతుక్కుంటాడు...

తుని స్టేషన్‌లో రైలు ఆగింది. మూర్తి తొందరగా తన ఆలోచన ఆపుచేసి అన్నగారిని నిద్రపోతుంటే లేపాడు. ఆయన ఖంగారుపడుతూ దిగి పెట్టె, పరుపుచుట్ట దింపేసరికి రైలు కదిలింది. 'వుండిపోయిన సామాన్లు లిస్టు గట్టిగా చెపుతూ, జాగ్రత్తగా దింపుకోమని' – 'మీ వదినతో పిల్లల్ని జాగ్రత్తగా చూడమని' చెప్పటం పూర్తికాకుండానే ప్లాటుఫారం దాటి వచ్చింది రైలు.

మూర్తి మధ్యలో తెగిన ఆలోచల్ని అతికించి, పొడి గిద్దామనుకుంటే, అతుకుల్లాగే సాగుతోంది ఆలోచన. "ఆ పిల్లకి చివరిదాకా మీమాటే" అన్న అప్పలమ్మ మాట చెవిదగ్గర హోరుపెడుతూ తిరుగుతోంది. పంచి దగ్గరే పెట్టుకు కళ్లుమూసిందిట...తనంటే నిజంగా ఇష్టమేమో. ఆ పిల్లకి ఇష్ట మేమిటి? ఏదో చిన్నతనపు చిలిపిచేష్టలు అయి వుండవచ్చు అనిపించింది కొంతసేపు: "చివరలో నామాటే ఎందుకు చెప్పాలి? ఏమో..." తనలో తను తర్కించుకుంటున్నాడు మూర్తి.

కొంచెం మూలగా కూర్చున్నాయన లేచివచ్చి మూర్తికి దగ్గరగా కూర్చుని 'మీరు ఫలానా ఆఫీసులో పని చేస్తున్నారుకదూ?' అని అడిగాడు.

అవునని తలవూపాడు మూర్తి.

'మావాడు కూడా అందులోనే వుంటున్నాడు' పేరు అడుగుతాడేమోనని మూర్తికేసి చూశాడు ఆ పెద్దమనిషి. 'మీకు ప్రమోషను వస్తుందని చెప్పుకున్నారు. నిన్న మావాడి కోసం ఆఫీసుకివస్తే...అనుకోవటం విన్నాలెండి.'

ఈ మాటకి మూర్తి నవ్వి వూరుకున్నాడు.

'శెలవులో వెడుతున్నారా?' అని అడిగాడు ఆయన.

'అవును' అని తల వూపాడు మూర్తి.

'తునిలో దిగింది మీ అన్నగారా?'.

'అవును' అని తల కిందకి వంచాడు మూర్తి.

'ఆయనమీద పెట్టిన కేసు ఏమయిందో తెలిసిందా?' కళ్లు సగం మూసుకు 'తెలీదన్నట్టు' తల అడ్డంగా వూపాడు

మూర్తి. మరో ఆయన ఆ కేసు వివరాలు అడగటంతో మొదటి పెద్దమనిషి కేసు వివరాలు చెపుతూ ఐక్యమై పోయాడు.

సామర్లకోట వస్తోందని ప్రయాణికుల్లో చలనం కలిగింది. తలలు దువ్వుకోవటం, జేబులో డబ్బువుందో, లేదో అని తడిమి చూసుకోవటంలో వుండగానే రైలు ఆగటం జరిగింది. అందరిని తప్పించుకు సామాను దింపించుకుని మూర్తి దిగాడు. అన్నగారి తాలూకు సామాను ఇంకా ఏమయినా వున్నాయేమోనని మళ్ళీ బండిలో అన్నిప్రక్కలా చూసివచ్చాడు మూర్తి. కూలీతో పెద్దాపురం వెళ్ళే బస్సులో సామాను పెట్టాలని చెప్పాడు.

మూర్తి ఇంటికి చేరేసరికి నీరెండ వుంది. ఇంటిముందు పెద్ద పందిర వేశారు. ఎవరో పిల్లలు ఆడుతున్నారు. కటకటాలు దాటి హాల్లోకి వెళ్ళాడు. కొత్తవాళ్ళు - ఆడవాళ్ళూ, పిల్లలూ కూర్చుని ఫలహారాలు చేస్తున్నారు. వాళ్ళ మధ్యలోంచి వెళ్ళడము ఇష్టములేక పక్కగది గుమ్మంలోకి వెళ్ళి చూస్తున్నాడు. ఎవ్వరూ కనబడలేదు అతనికి సందు తలుపు తియ్యటానికి. కూర్చున్నవాళ్ళ తాలూకు పిల్ల మూర్తి దగ్గరికి వచ్చి ఆ చేతులు మూర్తి పేంటుకి రుద్దుతూ లేచినిల్చుంది. ఆ పిల్లని తీసుకువెళ్ళటానికి వచ్చిన ఆవిడ పిల్ల వీపుమీద ఒకటి చరిచింది.

ఇంకో ఆవిడ దగ్గరికి వచ్చి "పెళ్ళికూతురు వో మాదిరిగా వుంది. చెప్పుకో తగ్గంత అందగత్తె కాదు" అంది. ఇంకొక ఆవిడ అందుకుని "పువ్వులు గుచ్చుతుందే ఆ

అమ్మాయి పెళ్ళికూతురు చిన్న వదినగారుట. చాలా బాగుంది కాదూ? చెక్కిన బొమ్మలావుంది. జడకూడా పెద్దదే." "పెద్ద కోడలు ఎవరు" అని ఇంకో ప్రశ్న. "ఆ పళ్లుఎత్తు ఆవిడ". పెళ్ళి కూతురు అప్పగారు "రంగు లేకపోయినా కళయిన మొహము. ఈ పిల్ల కేమర్రా నిక్షేపంలా వుంది" అంది.

ఇంతలో వెంకన్న సందుతలుపు తీసుకు మూర్తి వున్న గదిలోకి వచ్చాడు. మూర్తి బైటవున్న సామాన్లు లోపల పెట్ట మని చెప్పి, సందులోంచి వెనకపక్క పందిట్లోకి వెళ్ళాడు. కొత్త తాటాకు నీళ్ళతో తడిపిన వాసన, వంటింట్లో పిండి వంటల తాలూకు నేతివాసన, తులిసెమ్మగట్టుమీద కూర్చొని పద్మ కడుతూన్న పువ్వుల వాసన కలసి కొత్త వాసన సృష్టిం చాయి. పువ్వులు కడుతూన్న పద్మ చేతిలో దారపుండ దొర్లి వచ్చింది. మూర్తి దానిని తీసి పద్మదగ్గరికి విసిరాడు. "మరది గారికి దొడ్డిదారి తప్ప వీధిదారిని రావటము అలవాటు లేనట్టు వుందే" అంటూ పెత్తల్లి కోడలు వేళాకోళము చేసింది.

పద్మ మూర్తిని చూసి కొత్త పెళ్ళికూతురులా సిగ్గు పడుతూ, పువ్వులు అక్కడే వదిలి వంటగదిలోకి తప్పుకుంది. వచ్చినవాళ్ళని పంపి మిగిలినవాళ్ళు అంతా పందిట్లోకివచ్చారు. మూర్తిని చూసి "ఎప్పుడు వచ్చావు" అని ప్రశ్నలతో విసిగిస్తు న్నారు. తల్లి మూర్తిదగ్గర కూర్చొని "ఎంత చిక్కిపోయాడో" అని ఆప్యాయంగా వీపు రాసింది. శాంతవచ్చి అన్నగారి దగ్గర కూర్చుంది. మూర్తి అమ్మమ్మ వచ్చి "తరువాత చెపుదురు

గాని ముచ్చట్లు, ముందు వాడికి తినేందుకు ఏమయినా పెట్టి కాఫీ ఇవ్వండి" అని చెప్పింది.

"ఏమీావద్దు ఒట్టి కాఫీ తెమ్మ"న్నాడు మూర్తి.

"ఇప్పుడు వచ్చి వెళ్ళినవాళ్ళు పెళ్ళివారి బంధువులు" అని చెపుతోంది వదినగారు.

మూర్తికి అంతమంది మధ్యవున్నా ఏదో బెంగ, వంటరిగా వున్నట్టు బాధగా వుంది. "పద్మకి చెప్పాలి" అనుకున్నాడు. పద్మ తనతో మాట్లాడకుండా ఎందుకు దాక్కుంటుందో.

రాత్రి పది అయినా పద్మ జాడలేదు. మూర్తి గదిమేడ మీాద, కిందికి దిగి వచ్చాడు. మూర్తి అమ్మమ్మ, అమ్మ అంతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. అక్కడకూడా పద్మ కనపడకపోతే నిద్రపోయిందేమో ననుకున్నాడు మూర్తి. ఇంతలో మూర్తి తల్లి "పద్మ పడుకుందా" అని అడిగింది. "పెద్దక్క గదిలో పడుకుంది వదిన" అని శాంత చెప్పింది.

మూర్తి అక్కడికి వెళ్ళాడు. మూర్తిని చూసి లేచి వెళ్లిపోబోయింది పద్మ. చెయ్యి పట్టుకు కూర్చోపెట్టాడు మూర్తి. "ఎందుకు నాతో మాట్లాడకుండా సాయంత్రము నుంచి తప్పించుకు తిరుగుతున్నావు" అని జాలిగా అడిగాడు మూర్తి, తల వంచుకుంది పద్మ.

"నీకు ఓ సంగతి చెప్పాలి. చెపితే బాధపడతావేమో నని భయంగా వుంది" అని చెప్పి కొంచెంసేపు మౌనంగా కూర్చున్నాడు మూర్తి.

"మనింట్లో పనిచేసేపిల్ల 'ఫ్లూ' వచ్చి పోయింది అని చెప్పి, ఆ పిల్ల రావటము, తను చీకట్లో పొరపాటున చెయ్యి వెయ్యటము — ఆ పిల్ల తడిసివచ్చినరోజుదాకా జరిగినదంతా పద్మకి చెప్పాడు మూర్తి. "పోయేరోజున తనమాటే పోయేదాకా అంది" అని అప్పలమ్మ చెప్పిందని చెప్పాడు. "నామాట అంటూనే కళ్లుమూసిందిట" అన్నాడు మూర్తి. పద్మ చూపు వోదార్చినట్టు జాలిగా చూసింది. మూర్తికి మనస్సులో బాధ అంతా పోయి తేలిక అయినట్టు వుంది. "మూతలుపడే కళ్లు తెరుచుకున్నంత హాయిగా వుంది. నీకు చెప్పేదాకా ఎంతో బాధగా వుంది నాకు. ఇప్పుడు ఎంతో హాయిగా మూసుకున్న కళ్ళు అందమైన లోయలో ప్రవాహపునీరును చూసేందుకు తెరచుకున్న కళ్ళల్లావుంది మనస్సు" అంటూ ఒళ్ళో తలపెట్టుకు పడుకున్నాడు మూర్తి.



# మనోవ్యాధికి మందుంది

డాక్టరు మాధవరావు ఆ వూరొచ్చి ఐదారు నెలలే అయినా మంచిపేరు తెచ్చుకున్నాడు. బీదవాళ్లని ఎంతో దయగా చూసేవాడు. ఆ హాస్పిటల్‌లో తనతో కలసి పని చేస్తున్న లేడీడాక్టరు 'కమల' మొదట్లో ఇదంతా పేరుకోసం తెచ్చిపెట్టుకున్న ప్రవర్తన అనుకున్నా, తర్వాత తర్వాత ఆతనిపట్ల గౌరవభావం చూపసాగింది. ఆరోజు మధ్యాహ్నం తను హాస్పిటల్‌కు రానని, డాక్టర్ మాధవరావుకి చెప్పేం దుకు వెళ్ళింది. అప్పుడే బయటికివచ్చిన డాక్టరు కమల రావ టము చూచి వెళ్ళకుండా నిల్చున్నాడు.

"డాక్టర్ నేను మధ్యాహ్నం రాను. మావాళ్ళ ఇంటికి వెడుతున్నా. సీరియస్ కేసులు ఏమీలేవు" అని చెప్పింది. అంగీకారసూచకంగా నవ్వాడు డాక్టరు. ఇద్దరూ నడిచివస్తు న్నారు. గేటుదాటించి వోముసలివాడిని చిన్నికుఱ్ఱాడు చెయ్యి పట్టుకు తీసుకురావడం డాక్టర్ చూశాడు. కుఱ్ఱాడు డాక్టరుకి చెప్పాలనుకున్నది చెప్పలేక, చేతిమీద చిరిగిన చొక్కాని రెండో చేత్తో పైకిలాగి పట్టుకుంటూ భయపడుతూ నిల్చున్నాడు.

ముసలివాడి కాలుఅంతా రక్తంకారుతోంది. మోకాలు మీద చర్మం వ్రేలాడుతోంది. ఒంట్లో వున్న రక్తం అంతా అంతేనేమో అనిపించేటంత సన్నగా బలహీనంగా వున్నాడు.

"ఏమయింది?" అని కుఱ్ఱాణ్ణి అడిగాడు డాక్టర్.

"కుక్క కరిచిందండీ సార్" అనేందుకు రెండు నిమిషాలు పట్టింది.

"ఈవేళప్పుడు వస్తే ఎవరుంటారు? మేము ఇంటికెడుతున్నాం. పైగా దీనికి ఇంజక్షన్స్ చాలా తీసుకోవాలి, బాధ పెడతాయికూడా. ఇంటికి తీసుకెళ్ళి కాకరాకు నూరి కట్టమనుమీ అవ్వని", అంది డాక్టర్ కమల. మాధవరావు నవ్వుతున్నాడు. "మనమే ఆరకం వైద్యం మొదలెడితే, హాస్పిటలు గదులు మరో సంస్థకి ఇచ్చివెయ్యొచ్చు" – అంటూ ఆ వృద్ధుణ్ణి లోపలకు తీసికెళ్ళి, కట్టుకట్టి, మర్నాడు కనపడమని చెప్పాడు మాధవరావు.

"డాక్టర్, మీరు వాళ్లు ఏటైమ్‌లో వొచ్చినా ట్రీట్ చేస్తారు. అందుకనే వాళ్ళు ఎప్పుడంటే అప్పుడొచ్చి వేధిస్తారు. ఆ కనికారం తోడివాళ్ళపై నవుంటే ఎంత బాగుండునో" అంది కమల హేళనగా. అన్నా అందులో కరుకుదనంలేదు. "మనం విసుక్కుంటే ఎల్లా? మన టైము కనిపెట్టి, వీడు ముసలివాడు – బీదవాడు కాబట్టి వాణ్ని కరుద్దాం. ఆ డాక్టర్లు ఏం చేస్తారోచూద్దాం అని కరుస్తుందంటూరా కుక్క? మీరు మెడిసిన్ చదువకుండా స్కూలు టీచరుగా ఉండాల్సింది" అన్నాడు మాధవరావు నవ్వుతూ.

"నా మాటల్లా వుంచండి. మీరు ఏ ఫిలాసఫీ లెక్చరరుగానో వుంటే ప్రతిదాన్నీచూసి జాలిపడుతూ, అవతల వాళ్ళని కేవలం మీ మంచితనంవల్ల బాధపెడుతూ వుండేవారేమో? మీ ఇంటికొచ్చి మీ ఆవిడతో చెప్పాలి.

మిమ్మల్ని కాస్త పెద్దవాళ్ళనిగా మార్చమని" అంది కమల పెద్దగా నవ్వుతూ.

"పొరపాటు. నన్ను మార్చమని చెప్పడం మర్చి మీరే మార్తారేమో ఆవిణ్ని చూసి" అన్నాడు మాధవరావు తనూ బిగ్గరగా నవ్వుతూ.

ఆ నవ్వులో ఆప్యాయత వుందనిపించింది కమలకి.

"చాలాసేపైంది. ఇంక వెళ్ళి కుకింగ్‌లో పడాలి" అంది కమల.

"పోనీ మా ఇంటికి రండి ఈపూట" అన్నాడు.

కాదనలేకపోయింది. ఇంటికి వొచ్చారు ఇద్దరూ.

శకుంతలని కమలకి పరిచయం చేశాడు–

"ఈ పూట ఆవిడ కూడా మనతో భోంచేస్తారు" అన్నాడు.

శకుంతల ఎంతో నిండుగా నవ్వి "నడ్డించమంటూ" అంది.

"నన్ను మర్చిపోయావుకదూ?" అని ప్రశ్నార్థకంగా పలకరించింది కమల. శకుంతలకి వెంటనే గుర్తురాక తికమక పడింది. "నేనూ, చిట్టిని–మీరూ, మేమూ పక్క–ఇళ్ళల్లోవుండే వాళ్ళం. ఇప్పుడు గుర్తొచ్చిందా?"

"నువ్వా? చాలా మారిపోయావు సుమా!" అని ఆశ్చర్యంగా అంది శకుంతల. చాలాసేపు చిన్ననాటి ముచ్చట్లు మాట్లాడుకున్నారు ఇద్దరూ. మధ్యలో కమల డాక్టర్ కేసి చూసి "శకుంతల చిన్నప్పుడు చాలా బాగుండేది. ఇంతమందిని చూస్తున్నా. అంత అందంగా ఎవరూ కనపడలేదు" అంది.

"ఆ అందంచూసే మోసపోయా" అన్నాడు మాధవరావు తమాషాగా నవ్వుతూ.

"అంటే ఇప్పుడు బాగా లేదనికాదు" అంది కమల. శకుంతల కుట్టిన కుట్లు, ఇల్లు సర్ది పెట్టుకోవటము అన్నీ శ్రద్ధగా చూస్తోంది. చంటిపిల్లని కమలకి చూపించింది. "చాలా నీ పోలికే కనిపిస్తోంది— ఆ గౌను కుట్టడం చాలా బాగుంది." అంది కమల.

"అమ్మాయిలు స్కూలుకెళ్ళారు. వాళ్లు వచ్చేదాకా ఉండకూడదూ" అంది శకుంతల. "ఇంకోసారి వస్తా" అని వెళ్ళిపోయింది కమల. కొన్నిరోజుల తరువాత వోనాడు కమల వొచ్చేసరికి డాక్టర్ ఇంట్లోనే వున్నాడు. "కూర్చోమని" కుర్చీ దగ్గరికి లాగాడు. శకుంతలవస్తే కాఫీ తెమ్మని పంపాడు. పెళ్ళిళ్ళ విషయం సంభాషణ మొదలుపెట్టాడు డాక్టర్.

"ఈ కాలంలో ఇద్దరూ వొకేవృత్తిలో వున్నవాళ్ళ పెళ్లి సుఖంగా వుంటుందనుకుంటా — మీరేమంటారు?" అన్నాడు డాక్టరు. ఈలోగా శకుంతల కాఫీ తెచ్చింది. చివరి మాటలు విని ఎందుకో బాధపడినా, మొహములో కన పర్చలేదు. తను అక్కడ కూర్చోవాలో అక్కర్లేదో తోచక కాసేపు కుర్చీపట్టుకుని నిల్చుని లోపలికి వెళ్లింది — శకుంతల. సంభాషణ సాగలేదు. కమల వెళ్లిపోయింది.

ఇంకోరోజు కమలా, మాధవరావు వర్షంలో తడిసి చీకట్లో నడుచుకుంటూ ఇంటికి వచ్చారు. చాలా పొద్దు పోయింది. తలుపుతీసి శకుంతల, ఇద్దరూ అలా కలసిరావడం చూసి ఆశ్చర్యపడింది. మాధవరావు భోంచేస్తూ చెప్పాడు.

అలా కొండల్లోకి నడచి వెళ్ళామని, వర్షము పట్టుకోవడంవల్ల దారి తప్పామనీ, తిరిగి తిరిగి ఎల్లాగో ఇంటికి చేరామని - కమల కొంచెం ఖంగారు పడింది. శకుంతల ఎదీ గుర్తించనట్టు తలవంచుకు వడ్డిస్తోంది. వర్షం ఎక్కువయింది. ఉరుములు మెరుపులతో భీభత్సంగా వుంది ఆకాశమంతా. "ఇంటికి వెడతా" నని బయలుదేరింది కమల.

'ఇప్పుడా ? ఈ వెదర్‌లో ఎల్లా వెడతారు ? ప్రొద్దున్న వెళ్ళొచ్చుగా' అన్నాడు డాక్టర్.

రాత్రి అక్కడే పడుకుంది కమల.

ఉదయాన్నే కమల వెడతానని బైలుదేరింది.

"కాఫీ తాక్కుండా వెడతారా ?" అన్నాడు డాక్టర్.

'బేబీని' పిల్చి కాఫీ తెమ్మన్నాడు. చిన్నకూతురు సుశీ పరుగెత్తుకుంటూ వచ్చి తూలి బల్లపైన పడింది. కమల కళ్ళ జోడు, పెన్ను కిందపడ్డాయి .మాధవరావు సుశీని కొట్టాడు. కింద పడ్డ అద్దం ముక్కలు తీసి కాగితంలో పెడుతున్నాడు. కాంపౌండరు వచ్చి 'రాత్రి చేరిన పేషెంటు పల్సు అందటం లేదు సార్" అని చెప్పి వెళ్ళాడు. డాక్టర్ కొంచెం విసుక్కుని, అటూ, ఇటూ తిరిగి, బట్టలు మార్చుకు బైలుదేరాడు. కమలని కూడా రమ్మన్నాడు.

"ఆమెతో చెప్పి వస్తా" అని లేచింది.

"ఇప్పుడు కాదు, రండి తొందరగా-" అన్నాడు. బైటికి నడిచారు. పిల్ల ఏడుపు విని గదిలోకి వచ్చింది శకుంతల. కిటికీ లోంచి ఇద్దరూ వెళ్ళడం కనిపించింది. వేపచెట్టుకింద పనిమనిషి మల్లయ్య లక్ష్మికి వాళ్ళని చూపించి నవ్వుతున్నాడు. లక్ష్మి

ఏదో చెప్పబోయి కిటికీలో శకుంతలని చూసి తలవంచుకు వూడుస్తోంది. హాస్పిటల్ వెనకాలే వుంది ఇల్లు.

దారిపొడుగునా వేప చెట్లు, చింత చెట్లు వున్నాయి. రోగులకు తోడుగా మూలుగుతున్నట్లు గాలికి మఱ్ఱిచెట్టు వూడలు వూగుతున్నాయి.

శకుంతల మనస్సు చికాగ్గా వుంది.

హాస్పిటల్‌లో గోల వినిపించింది. లక్ష్మమ్మ పరుగెట్టు కెళ్లింది. మల్లయ్య కుర్చీలు తుడుస్తున్నాడు. శకుంతల్ని చూసి తుడిచేబట్ట చేతులతో నలుపుతూ అన్నాడు - "మరి అండి, అందరూ అయ్యగార్ని గురించి ఆ అమ్మగోర్ని గురించి ఏమేటో అనుకుంటారండి..." అని ఇంకా ఏదో చెప్పబొయ్యాడు.

'సర్లే, నీపని కానియ్యి' అని కసిరింది శకుంతల. ఆ రోజున మాధవరావుని అడగాలనుకుంది. కూడా మరో డాక్టరు రావడముతో వూరుకుంది.

ఇంకోరోజు కమల వచ్చేసరికి పిల్లలికి చక్కగా ముస్తాబు చేసింది శకుంతల. తను మంచి సిల్కుచీర కట్టుకుంది. కమల వోక్షణం అల్లా తెల్లబోయి చూసింది.

"ఈ చీర నువ్వు కట్టుకుంటే చాలా బాగుంది కదూ?" అంది.

"ఎవరికైనా బాగుంటుంది" అంది శకుంతల.

"ఆడవాళ్ళు వకర్ని ఒకరు మెచ్చుకోరంటారు. మీ ధోరణి వేరుగా వుందే!" అన్నాడు మాధవరావు ఏ వొకర్నీ వుద్దేశించకుండా. "ఇద్దరూ అందమయిన వాళ్లు అయితే ఆ ఇబ్బంది; నాకు ఆ బాధ లేదులెండి" అంది కమల.

'అందంకంటే కూడా ఆకర్షణ, కళవుండాలి. అవి వున్నాయి అనుకుంటా మీలో' అన్నాడు మాధవరావు. ఆ మాటలు శకుంతల అనుమానాన్ని మరీ దృఢపరిచాయి. 'మేము సినిమాకి వెడదామనుకుంటున్నాము. మీరుకూడా వస్తారా' అన్నాడు మాధవరావు కమలనుద్దేశించి.

చంటిపిల్ల ఉయ్యాల్లోంచి కిందపడి దెబ్బతగిలి ఏడుపు మొదలు పెట్టింది. శకుంతల సినిమాకి రానంది. మాధవరావు క్లబ్బుకి వెడతానని బైలుదేరాడు. కమల కూడా కారులో వెళ్ళింది.

కొంతసేపటికి కాంపౌండర్ వచ్చి 'మీ అన్నయ్యగారు ఫోను చేశారు అండీ; మిమ్మల్ని వెంటనే రమ్మనమని...మీ అమ్మగారికి జబ్బుగావుందట, మిమ్మల్ని సిద్ధంగా వుండ మన్నారు, డాక్టరుగారు వచ్చేసరికి !!' అమ్మ జబ్బుగా వుందన గానే కాళ్లు వణికాయి శకుంతలకి. కార్లోనే వెడదామన్నాడు మాధవరావు. బేబీని ముందు కూర్చోమని శకుంతల మిగిలిన పిల్లలూ పనిమనిషి లక్ష్మి వెనక కూర్చున్నారు. ఇంటికి చేరే సరికి అర్ధరాత్రి దాటింది.

ఇల్లు నిశ్శబ్దంగావుంది. పిల్లలంతా నిద్రపోయారు కార్లో. శకుంతలని దిగమని చంటిపిల్లని తను ఎత్తుకున్నాడు. అప్పటిదాకా ఆపుకున్న దుఃఖము వక్కసారి పైకివచ్చి శకుంతల ఏడుపు మొదలు పెట్టింది. అన్నగారు తలుపుతీసి,' ఇప్పుడే నిద్రపట్టింది. ఇంక భయం లేదంటున్నారు డాక్టర్లు' అన్నాడు మెల్లగా. శకుంతల కళ్లు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళింది.

'పొద్దున్నే కూర్చున్నట్టే పడిపోయింది గుండెల్లో నెప్పి అంటూ! డాక్టర్ లాభంలేదన్నాడు. ఇంకో డాక్టరుని కూడా తీసుకువచ్చాడు. ఆయనకూడా అల్లా 'అంటేనే' మీకు ఫోను చేశా, రాత్రి పది దాటాక పల్సు నార్మలుగావుంది. భయం లేదన్నారు" అని మాధవరావుకి చెప్పాడు.

రోగి కోలుకుంటుందన్న ధైర్యం చిక్కింది. మర్నాడు సాయంకాలానికి మాధవరావు, శకుంతల ఇంటికి చేరు కున్నారు పిల్లలతో. రాగానే మల్లయ్య రెండు కవర్లు తెచ్చి ఇచ్చాడు. "డాక్టర్ అమ్మగారు నాలుగ్గంటల బండికి వూరికి వెళ్లానని మీతోటి, అమ్మగారితోటి చెప్పమన్నారండీ".

మాధవరావు ఆశ్చర్యపడ్డాడు.

"నేను రాకుండానే తను వెళ్లడం ఏమిటి?... పేషెం ట్సుని ఎవరు చూస్తారు?... ఇల్లాగేవుంటాయి ఆడవాళ్ల పన్లు" అని విసుక్కున్నాడు.

శకుంతల మొదట వుత్తరం చదవకూడ దనుకుంది. కాని చదవటము మొదలుపెట్టింది. ముందు అతనికి వ్రాసింది తీసింది. అందులో కాగితం చాలా చిన్నది. ఉద్యోగం మానే స్తున్నాననీ, తర్వాత విపులంగా మళ్లీ వ్రాస్తాననీ వ్రాసి- తన్ని ఆదరంగా చూసినందుకు ధన్యవాదాలు చెప్పి ముగించింది. రెండో వుత్తరం తనకు పెద్దది. "చిన్నప్పుడు పిల్చినట్లు నిన్ను చిన్నా అని సంబోధిస్తాను. శకుంతలంటే కొత్తగావుంటుంది.

నీకంటె పెద్దదాన్నైనా, నీలా ఆదరణ చూపటం నాకు చేత కాలేదు. నీతో ఎన్నో విషయాలు మాట్లాడాలని తరచు మీ ఇంటికి వచ్చేదాన్ని - కానీ చెప్పకుండానే వచ్చేసేదాన్ని. అనుకోకుండా నీ మనస్సు నొప్పించానేమోనని ఇంటికివచ్చి బాధపడేదాన్ని.

చిన్నప్పుడు నీకు తెలుసుగా. నేను నచ్చక చాలా మంది వచ్చి వెళ్లిపొయ్యేవారు, పెళ్లికొడుకులతాలూకువాళ్లు. తరువాత నాకు ఇష్టంలేక పెళ్లి చేసుకోలేదు. చాలామంది నా స్నేహితులు చదువు పూర్తికాకుండా పెళ్లిళ్ళు చేసుకున్నారు. కాని, కొన్నాళ్లకే ఏదోరకమైన అసంతృప్తి కనబరచేవాళ్ళు. వాళ్లనిచూస్తే నాలాంటివాళ్లకి ఈ జన్మలో పెళ్ళి చేసుకోకూడదనిపించడం సహజం కదూ! మీ ఇంటికి తరచు రావటంవల్లనేమో నాలో కొంత మార్పు వచ్చింది. నిన్నూ, పిల్లల్నీ, నువ్వు సంసారం నడిపేరీతీ అన్నీ చూస్తే ఎంతో ముచ్చటగా వుండేది. నువ్వు ఎప్పుడూ నవ్వుతూ డాక్టరు ఏవేళప్పుడు వచ్చినా విసుగు లేకుండా కావాల్సినవిఅమర్చడంచూసి సంబరపడేదాన్ని. డాక్టరు అంత మంచివాడు కావడానికి నువ్వే కారణమని పిస్తోంది, నాకు. సహజంగా నీలోవున్న సంస్కారము చాలా మంది చదువుకున్న వాళ్లల్లో లేదేమో ననిపిస్తుంది నాకు.

నన్ను నాలుగేళ్లక్రితం ఒకతను పెళ్లి చేసుకుంటానన్నాడు. అప్పుడు నేను ఇష్టపడలేదు. కానీ అతను పెళ్లి ఎందుకో చేసుకోలేదు. మా అక్కకి వరసకి మరిది అవుతాడు. ఇప్పుడు మా పెళ్లి నిశ్చయముచేసింది. మీారిద్దరూ పెళ్ళికి

తప్పకుండా రావాలి. వీలుపడకపోతే మీలాగే జీవితం గడపాలని ఆశీర్వదిస్తారుకదూ? నేను చేసుకునే అతనిది అంత పెద్ద చదువుకాదు, ఆస్థివుంది. నాలో ఏ ప్రత్యేకతా లేకపోయినా నన్ను చేసుకోవాలనే వుందని విన్నాను.నీలా వోర్పుగా వుండేందుకు ప్రయత్నిస్తా. ఆరోజు వర్షంలో మేము రావటముచూసి నువ్వుకనక ఏమీఅనకుండా వుండగలిగావు. నేను వూహించుకుంటేనే కోపమువస్తోంది. ఇంకా ఏన్నో వ్రాయాలనుకున్నా. ఎల్లా వ్రాయాలో తెలీటంలేదు. నా హృదయపూర్వకంగా మీ ఇద్దరికీ నమస్కరిస్తున్నా, సెలవు. నాకంటె చిన్నదానివి గనక మళ్లీ ఆశీర్వదిస్తున్నా—నీ కమల."

తరువాత మాధవరావు చదివాడు, శకుంతలకేసి చూశాడు నవ్వుతూ. శకుంతల కళ్ళు కిందికిదింపి నేలకేసి చూసి మళ్లా మొహం పైకెత్తి అతని కళ్లల్లోకి చూసింది. అందులో కన్నీటిబిందువు మెరిసింది.



# తీరని మమతలు

కృష్ణభగవానుని దర్శనం కోరుతూ, పారవశ్యంతో, గోపికలు గొంతులెత్తి గీతికలు పాడుకుంటున్నారు. భవనం లోపలి దీపకళికలకాంతి గోపికల ముక్కునత్తుల్పై పడి, రంగులు మార్చుకున్నాయి. రకరకాల పువ్వులతో దీగెలు చుట్టు కున్నట్లు గోపికలుభవనం చుట్టూ తిరుగుతూ, మధ్య మధ్య చేతులుతట్టి 'కృష్ణా' అని ఏకకంఠంగా పిలుస్తున్నారు. నల్లని మేఘాలు కృష్ణుని ఉత్తరీయంలా మెరుపుల్ని చుట్టుకుంటూ, అన్ని దిక్కులూ చూస్తున్నాయి. ఆ కాంతిలో గోపికలు కృష్ణుడు తమని వదిలి మిగిలిన గోపికలదగ్గర ఉన్నాడేమోనని కళ్లతో వెతుకుతున్నారు.

మిత్రవింద నిట్టూరుస్తూ, మెట్లపైన కూర్చుంది. 'దేవి, దేవి' అని, వగరుస్తూ, పరిచారికలు ఆసనం మోసుకువచ్చారు.

మిత్రవిందకి గుర్తు వచ్చింది. అది దేవకీదేవి భవనం. అందరికీ సమంగా జరుగుతాయి లాంఛనాలు. దూరంగా గోపి కలు పాడేపాట వినబడుతోంది. ఏమిటో, తను పెద్దరాణుల్లోకి చేరలేదు. అల్లాగని మరీ, చిన్న ఆవిడలా, మంకుపట్టుకీ, మంద లింపుకీ, నోచుకోలేదు. పోనీ, ఆ గోపికల్లా స్వేచ్ఛగా ఉండేం దుకు కూడా వీల్లేదుకదా !

మనస్సుకి చిరాకుగాతోచింది. అటూ ఇటూ తిరిగింది. పరిచారికలకోసం, వాళ్ళు తెచ్చిన ఆసనంపై కూలబడి జడలో మొగ్గలు విడవటం చూచుకుంటూ కూర్చుంది.

భవనం రెండవ అంతస్తు విశాలంగా వుంది. రత్నకంబళ్ళు పరిచి, పువ్వుల పరిమళాలతో, అగరువత్తుల ధూపాలతో, కస్తూరితో చేరిన సుగంధాలు కృష్ణుని ఉనికిని తమలో దాచుకున్నట్లు ఆ ప్రాంతాన్ని అంతా చుడుతున్నాయి.

సత్యాదేవికి ఓర్పు తగ్గి, కోపంగా మారింది. కాళ్ల అందెల చప్పుడును పెద్దదిచేస్తూ, గదులన్నీ ఎన్నోసార్లు చుట్టింది. పువ్వులు కట్టిన వుయ్యాల ఒంటిగా కదులుతోంది. దూరంగా యమున ఘోష పెడుతోంది. 'ఏమిటీ కోరిక దేవకీ దేవికి ?' అనుకుంటూ కృష్ణుడు కూర్చునే స్థానంలో ఉయ్యాల మీద ఒరిగింది.

ఎన్ని అష్టములు జరుపుకోలేదు తనదగ్గర! అయినా మనస్సుకి తృప్తి లేదు.

తను లేకపోతే జీవం లేని శరీరంలా ఉంటుందని ఎన్నిసార్లు చెప్పలేదు ! తనదగ్గర ఉన్నప్పుడు ఎంత అమాయకత్వం ! అసలు మిగిలినవాళ్లంటే ఇష్టం లేనట్లు తోపిస్తాడు.

ఈసారి ఏమైనాసరే నమ్మకూడదు. అసలు ఈ రాత్రి ఇక్కడికి వస్తాడన్న నమ్మకమేమిటి ?

కోపం విచారంగా మారింది. అసలు తన తండ్రిదే తప్పు. తను వేసిన నిందని మార్చలేక తనని కట్టబెట్టటం ఏమిటి? ఎవరికో నిర్ణయించిన పడుచుని తెచ్చుకున్ననాడే అతనిమీద తను ఆశ వదులుకుంది. తన తండ్రికి అదే అలుసుఅయి పిల్లని చూపి, పాతపగలు మరువవచ్చని ఆశ కలిగింది.

తల్లో పువ్వులు బరువెక్కుతున్నాయి. ఒక్కటొకటే ఒలిచి విసురుతోంది.

అబ్బా ఆ రుక్మిణికి ఆత్మలో ఉంటాడుట ! అన్నీ పట్టి మాటలు ! తనదగ్గర ఉండటం లేదన్న అక్కసుతో ఇలా చెప్పుకొంటుంది. అల్లాంటి భక్తేఉంటే, ఇప్పుడు దేవకీదేవి వెనక చేరి పై అంతస్తులో రెప్పవాల్చకుండా ఆ చూపు లేమిటి? పాపం ! ఆ చూపులుదాటి రాలేక శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడేమో కృష్ణుడు ! ఆ తలపు రాగానే సత్యాదేవికి మనస్సు కొంత స్తిమితపడింది. విచారం దుఃఖంగా మారి తన మీద తనకే జాలికలిగింది.

ఆ రాధలా ఎవరిపడతినో అయివుంటే, ఎంత పరితపించి ఉండునో ! అవును, అల్లా జరిగివుంటే బాగుండేది, తన్నే నమ్ముకున్నానన్న ఇంగితమేలేని వ్యక్తికి తనగోడు ఎల్లా అర్థం అవుతుంది ? తను లేని క్షణంలో కాలం నిలిచినట్టు వుంటుందే- ఆ మాత్రం అర్థం చేసుకోలేడా !

ఈ శూన్యమనసుని ఎల్లా భరించడం ? రుక్మిణీ వాళ్ల కులా నా మనసులో ఎందుకు నిలవదు ? పోనీ, మనస్సులో నిల్పుకోవడం సాధ్యమయితే ఎంత బాగుండును ? రెప్పలు బరు వెక్కి, పువ్వులు దులిపిన పొగడచెట్టులా ఉయ్యాలపై లేచి కూర్చుంది సత్యాదేవి.

మూడవ అంతస్తు దేవకీదేవి గది. రుక్మిణీదేవి దేవకి పాదాలదగ్గర కూర్చుంది. యమునానదిని చూసే కృష్ణభగవా నుని చూపులో చూపు కలపాలన్న కోరిక మేలిముసుగు వెనక దాచుకుంది రుక్మిణీదేవి. మనస్సు చాలా వెనక్కి వెడుతోంది. చిన్ననాటి కోరికలు కళ్ళల్లో మెదులుతున్నాయి.

అంతలో మనస్సుకి భీతి కలిగింది. ఆ బ్రాహ్మణుడు నిజంగా వెళ్లకపోతే తను ఏమయ్యేది? అయినా తన కంత సాహసం ఎల్లావచ్చిందో అన్న ఆశ్చర్యం కలిగింది. తను పంపి వుండకపోతే భగవానుడు వచ్చేవాడేనా? ఆమాట అననే అన్నాడు.—'స్త్రీలోలుడనయి రాలేదు. మీ అన్న గర్వం అణిచేందుకే వచ్చా'నని. అవును, తనేకదా ఊహ తెలిసిన దగ్గరనుంచి అతని కథలువిని, అతని రూపం ఊహించుకుని, మనస్సులో మమత పెంచుకుని, చివరికి కన్యకి భూషణమైన బిడియం విడిచి, ఆ విప్రునిముందు తన కోరిక చెప్పిపంపిన దగ్గర నుంచి ప్రతిక్షణం ఏమివార్త వస్తుందోనని మనస్సులోని బాధకి తోడు అన్నచేసే పెళ్లిప్రయత్నం చూసి జీవితంమీద మమకారం పోవటం, అప్పుడు జరుగుతున్నట్లు తోచి,మనస్సు బరువెక్కి మొహము ఎరుపెక్కి చూపులు మాధవుని పాదాల దగ్గర చేరాయి.

రుక్మిణీదేవి మనస్సు మళ్లీ కళ్లెం విడిచిన గుఱ్ఱంలా ఎటో పోతోంది. తన కోరిక మన్నించమని కబురుపెట్టి ఉండక పోతే బాగుండేది. తనకోసరం కృష్ణభగవానుని బాధపెట్టడం ఏమిటి? ఎప్పటిదో పారిజాతం పువ్వు గుర్తుకు వచ్చింది. నారదుడు పువ్వు ఇచ్చి ఎవరిమీద మక్కువ ఎక్కువో వారికే ఈ పువ్వు ఇవ్వమనటం, కొంతసేపు యోచన చేసి, కృష్ణపరమాత్మ తనకి ఇవ్వటం ఇప్పుడు బాధగా తోచింది. పాపం, సత్యకి ఇవ్వాలని ఉండి వుంటుంది. కాని, పక్కన ఉండటంతో ఏమిచెయ్యాలో తోచక తనకే ఇచ్చివుండవచ్చు.

తనమీాద ఇంతకం టే ఎందుకు గౌరవం ఉంటుంది ? తను కోరుకొని వచ్చినది అన్న పేరు ఉండనేఉంది. అదృష్టం అం టే సత్యదే అనాలి. అన్ని వేళలా కళ్ల యెదుట కట్టుకో గలిగింది. తన మందిరంలో వున్నా ఏదో పరధ్యానంతోనే గడుపుతాడు కృష్ణభగవానుడు. రుక్మిణీ దేవికి ఆలోచనతో మనస్సు దుఃఖంతో నిండింది.

దేవకీ దేవికి కొడుకూ కోడళ్ళు తన మందిరంలో ఉన్నారన్న తృప్తి ఆ సమయంలో కలగలేదు. మనస్సు యమున ఒడ్డున చేరింది. తన తపస్సుకు మెచ్చి పరమాత్మ అవతారం ఎత్తాడు. కాని, తల్లి నన్న ఆనందం తనకి ఎక్కడిది ? ఆ యశోద చేసిన పూజ గొప్పది! 'అమ్మా!' అన్న బిడ్డని అక్కున చేర్చుకుని, వళ్లుఅంతా కళ్లు చేసుకుని; ఆ మూర్తిని హృదయానికి హత్తుకుని తన్మయం చెందివుంటుంది. పసివాని పలుకులు వినేభాగ్యం తనకి లేదాయె ! జగన్మోహన స్వరూపుడి బాల్యం చూడాలన్న వాంఛే కదా తన జన్మకి హేతువ. అయినా ఆ కోరిక తీర్చలేదుకదా ! నీ చిన్నారి పాదాలకు చిరుగజ్జెలు కూర్చి, మొలనూలుమువ్వలతో నింపి, చిన్నిశిఖలో తురాయిపింఛము పెట్టి నీ చిలిపి చేష్టలు చూసే భాగ్యం నాకేదీ ?

అబ్బా ! ఆ చెరసాలలో ఆ భీతి ఎన్ని జన్మలకైనా మరువలేనిది ? ఆ పసికందుని నీ కోసం ఆ అధముడి చేతికి అందించాను. నిన్ను ఆ వసుదేవుడు చూడనిచ్చాడనా ? అబ్బే నిన్ను నందుని యింటచేర్చాలని నన్ను మరపించి నిన్ను దూరం చేశాడు. నీ ముద్దుమురిపాలు ఏమి చూసుకున్నాను ! తల్లిగా

కోరి ఆనందించేది పిల్లల పసితనం, బాల్యం. తండ్రికి కొడుకుపై ప్రేమ కౌమారం దగ్గరనుంచి వస్తుందేమో ! లేకపోతే వసుదేవుడు తనలా బాధపడలేదు, ఎందుచేతో ! అబ్బా ! తనకి ఏదీ అంటదు. అల్లా ఉండగలిగితే గొప్ప విషయమేగదా ! తనని కృష్ణుడు ఈ క్షణంలో ఎల్లా అడిగాడో. 'ఇప్పుడు పసివాడని' కాదా ! అని అడిగినట్లు చూశాడు. చూడటమేమిటి — అడిగినట్లు వింటేను ! పసివాడు కింద పడతాడేమో !

దేవకీ దేవికి ఏదో భ్రాంతి కమ్మింది. ఒక్క పరుగున కృష్ణుని ఆసనం చేరింది. ఏడీ ? ఏడీ ? కనబడడేం ? చుట్టూ చూస్తోంది. దూరంగా యమునానది చీకటిలో చేరి మరీ చీకటి చేసింది. చీకటి ఉప్పెనలా పైకి లేచి పరిసరాలని దాచుకుంటోంది. అందులో తన చిన్ని కృష్ణుడు మెరిసిపోతూ కదిలినాడు. నదిపై తేలిరావటం దేవకి చూసి, భ్రాంతి విడిచి, భీతితో, 'తండ్రీ' అంటూ భీరువులా అక్కడ ఉన్న స్తంభాన్ని పట్టుకుంది. అచేతనమయిన వస్తువు కలిగినట్లు, తను పట్టుకున్నది తన కృష్ణుడినేనా ? ఏమో ? ఏమో మాయ ! తను ఇంతకు ముందేగా బాలకృష్ణుని చూసింది ! ఇది ఏదో మాయ ! కాదు, అదేమాయ ! 'ఏది నిజం' అన్నట్లు కృష్ణుడికేసి చూసింది. మందిరం అంతా కృష్ణరూపంలా తోచింది. మరుక్షణం అంతా శూన్యంగా తోస్తోంది. గట్టిగా పట్టుకుంది. చేతికి ఏదీ దొరకలేదు. కాని, ఏదో పట్టుకున్న భ్రాంతి వుంది. కృష్ణుడు నవ్వాడు. ఆ నవ్వు యమునానది నురగల్లా తేలిపోతోంది. 

# మట్టిగోడలు మధ్య గడ్డిపోచ

ఆ ఏడు వేసంగి ఎండలు మండిపోతున్నాయి. పొద్దు వాలినా వేడితగ్గలేదు. పసిపిల్లలు తట్టుకోలేక కంఠం జారి పోయేలా గోలపెడుతున్నారు. ముసలిఅవ్వ ఆపుకారా పక్కన పెట్టుకు కంఠం తడుపుకుంటూ తడిబట్ట వంటికిచుట్టుకు వచ్చే పోయేవాళ్లని "టయిము ఎంతఅయిందిఅర్రా" అంటూ గడుపు తోంది.

ఆ వూరిని చుట్టివున్న పుంత, సగం పడిపోయిన మట్టి గోడలు శిధిలావస్థలోవున్నా, నిత్యం ధూపదీప నైవేద్యాలందు కునే శివాలయం. వూరిమధ్యనవున్న మోటబావి. దాని పక్కనే వుయ్యాలలూగే వూడల్ని పెంచుకున్న ముసలి మర్రి చెట్టు. ఆవూరికి వచ్చినవాళ్ళు వీటిలో ఏ ఒక్కటీ చూడ కుండా వెళ్లటానికి లేదు. ఆ వూరి ఘనత అల్లాగే చెప్పుకు తిరుగుతారు రికామీ పెద్దలు.

పార్వతికి ఆ వూరికి రావటం రెండోసారి. ఈసారి ఆ వూరికి కోడలుగా రావటం మనస్సుకి బాధగావున్నా పైకి అందరిలాగే వుత్సాహంగా వున్నట్టు మసలుతోంది. వేడికి తోడు చీకటి కలిసి విసిగిన ప్రాణాల్ని విసిగిస్తోంది.

పార్వతికి పగలు ఎండ భరించటమే హాయి అనిపిస్తోంది. పొద్దుగూకిందంటే తెలియని భయం చుట్టుకుంటోంది. ఎప్పుడో వకరోజు బావకి ... తరవాత వూహించేందుకు మనస్సు వప్పు

కోవటం లేదు. అత్తగారి పిలుపుతో మనస్సుని కట్టేసి లోపలికి పరుగెట్టింది.

పడమటింటి వసారాలో నిల్చున్న రావమ్మ కోడలి పరుగు చూసి ముక్కుమీద వేలేసుకుంది.

పార్వతి తన తప్పు తెలుసుకు సిగ్గుతో తలవంచుకుంది.

"నీకు ఎన్నిసార్లు చెప్పినా ఆ పరుగు మానవా ఏం?" అంటూ కోడల్ని మందలించింది రావమ్మ.

పమిటకొంగు బొడ్డులో దోపుకుంది. తలుపు వెనక్కి జరిగి తల వంచుకుని దిగులుగా నిల్చుంది పార్వతి.

కాస్సేపు మౌనంగా నిల్చున్న రావమ్మ "సరేలే వెళ్ళి వసారాలో పీటలు వేసి మంచినీళ్ళు పెట్టు" అని కోడలికి పురమాయించి వీధి గుమ్మంవేపు వెళ్ళింది.

పార్వతి వచ్చి అప్పుడే వారం తిరిగింది. వచ్చిన కొత్తలో వున్నంత భయం లేకపోయినా, ఏమిటోలా వుంటోంది. ఏదో విసుగు పుడుతోంది, తనమీద తనకే.

"ఏరా భాచీ ఇంతవేళదాకా ఏమిచేస్తున్నావురా! అప్పుడే వస్తున్న కొడుకుని అడిగింది రావమ్మ. కండువా కొంకెకి తగిలించి లోపలింట్లోకి వెళ్ళాడు భాస్కర్రావు.

అందరి భోజనాలూ అయ్యాయి అంటే పార్వతికి చేతినిండా పని, ఆ రోజు అదనంగా ఇల్లుకూడా అలకమని పురమాయించింది రావమ్మ. మట్టిముద్దలో చెయ్యి పెట్టాలంటే వొళ్లు జలదరించింది పార్వతికి.

ఎట్లాగో అలకటం పూర్తయిందన్న ఇదితో వూపిరి గట్టిగా పీల్చుకుంది.

"మూసికలు పెట్టినట్టు ఆ అలకడం ఏమిటే! మళ్ళీ వోసారి కలిసేటట్టు పాముకురా" అని కిటికీ వూచల్లోంచి అత్త గారి కంఠము వినవచ్చింది.

తలెత్తిచూడకుండానే పార్వతి మళ్ళీ మొదలుపెట్టింది. అలకటం పూర్తిచేసి, తలుపులుమూసి, అరికెన్ లాంతరు తగ్గించి పెరట్లో గట్టుమీద పెట్టి తను వేసుకునే మడతమంచం ఈడ్చుకువచ్చింది నేరేడుచెట్టుకిందికి.

కొంచెము దూరములో అత్తగారి మంచం కనపడు తోంది.

చెట్టు ఆకులు గాలికి గలగల్లాడుతున్నాయి. ఆకుల మధ్యనించి నక్షత్రాలు మిణుకుమిణుకుమంటూ తనకేసి చూస్తున్నట్టు వూహించుకుని కొంతసేపు వాటితో కలిసి మనస్సు తేలిగ్గా వున్నట్టు మంచముమీద ఇటూఅటూదొర్లింది పార్వతి.

మంచం చేసే కిటకిట చప్పుడికి రావమ్మ తలెత్తి చూసి "ఆ చెట్టుకింద ఎందుకే ఇల్లా లాక్కో- మంచము" అని కేక పెట్టి మళ్లీ పడుకుంది.

ఈసారి కదలకుండా చూస్తూ పడుకుంది. కానీ నిద్ర రావటంలేదు. అసలు అక్కయ్య ఎందుకు నూతిలో పడింది? అన్న ప్రశ్న మనస్సులోకి వచ్చికూర్చుంది పార్వతికి. అది మరచిపోవాలని ఏవేవో గుర్తుకు తెచ్చుకునేందుకు ప్రయత్ని స్తోంది. అక్కయ్య పెళ్లి అయిన కొత్తరోజులు ఎంత బాగుం డేవో గుర్తుకురాసాగాయి.

అప్పటికి తనకి ఏడు ఎనిమిది ఏళ్ళకంటే వుండకపోయినా అన్నింటికీ అప్పగారితో పోటీకి వెళ్ళటం చూసి మేనత్తలు బుగ్గలునొక్కుకు, "రేపు మీ అప్పకి పెళ్ళి అవుతే ఏంచేస్తావే?" అని అడగటం. తడుముకోకుండా 'నేనూ చేసేసుకుంటా' అనటం, వాళ్ళు అన్నట్టుగానే అక్కయ్య పెళ్ళిరోజు దగ్గరికి వస్తూన్నకొద్దీ ఇంట్లో అన్నింటికీ తన పేచీలు ఎక్కువయి, అమ్మప్రాణం విసిగి కొట్టడం, బామ్మఅడ్డుకుని "ఎందుకే దాన్ని కొట్టి చంపుతావు? ఇంకో నాలుగేళ్ళుపోతే దాన్ని వోఅయ్య చేతిలో పెట్టేదేనాయె" అంటూ సమర్థిస్తూ వోదార్చటం,

'అమ్మయ్యో నాలుగేళ్ళు వేగడమే! వచ్చేయేడే ఆ రామాన్ని పిలిపించి ముడెట్టించి వాళ్ళ అత్తయ్య దగ్గరికి పంపేస్తా' అని అమ్మ బెదిరించటం,

మనుమడి పేకువిని బామ్మ తృప్తిగా నవ్వుకోవటం, "నే నేం చేసుకోనులే" అంటూ తను శోకం పొడిగించటం గుర్తుకి వచ్చాయి.

మళ్ళీ వేరే ఆలోచనకోసం మనస్సు వెతుకుతోంది. ఆఏడు సంక్రాంతి నెల వుందనగానే ఇంటో హడావిడి మొదలయింది. పెరటి గోడలకు సున్నాలు మొదలుపెట్టి ఇల్లంతా పూసుకొచ్చారు. గడపలకి రాత్రిళ్ళు రంగులు పూస్తున్నారు. చివరి కాలికయినారంగు అంటుకుందీ అంటే బామ్మచేతిలో వచ్చారన్నమాటే, అని ఒక సాయంత్రం తులసికోటదగ్గర ధ్యానంచేసి పిల్లలకి తెలియచెప్పి, పటికబెల్లం విందుచేసింది బామ్మ.

"అన్నీ వుట్టిమాటలే, బామ్మ ఎప్పుడూ కొట్టదు. అమ్మనే కోప్పడుతుంది, కొట్టొద్దని," అని తను చెప్పే మాట పూర్తి కాకుండానే ఇంకో పటికిబెల్లం చేతికిచ్చి "అలా అని వాళ్ళకి చెప్పొద్దని" బతిమాలటం పూర్తి కాకుండానే నాన్న బట్టలమూట బామ్మముందు పెట్టించాడు. ఎంతో మంచిమంచి బట్టలు, మెరిసిపోయేగుడ్డలు! ఇంకా జరీపంచెలు, ఏవేవో చీరలు, అన్నీ చూస్తూంటే ఎంత బాగున్నాయో అనిపించింది. 'అన్నీ ఖరీదయినవే తెచ్చావెందుకురా అబ్బీ' అంది బామ్మ.

'ఆ. ఇదే మొదటిసారిఆయె, ఆ మాత్రం వుండకపోతే బాగుండదని' అన్నాడు నాన్న.

'ఇంతమాత్రం పెట్టకపోతే ఏం బాగుంటుందీ' అని అమ్మ అనటం, 'మరి నా పెళ్ళికి అలాంటి అంగోస్త్రం గుడ్డలు కొనిపించావేం'? అని చిన్నత్తయ్యఅడగటం. 'అప్పుడు నాపెత్తనం ఏమి వుంది? అంతా మీ అమ్మగారిదేగా' అని అమ్మ అక్కడనించి వెళ్ళిపోవటం, పండగకి వచ్చిన అక్కయ్య అత్తారితో లాకుల దగ్గరికి షికార్లు, అక్కయ్య మరదిని అన్నింటికీ ఎగతాళిచేసి ఏడిపించటంతో ఎంతో సరదాగా గడిచింది ఆ పండగ. రాత్రిళ్ళుకూడా పగలులాగే సందడిగా జరిగింది.

అక్కయ్య బావని తలుపు వెనకనుంచి చూడటం బావ రహస్యంగా పుస్తకాలు అక్కయ్య చేతిలో పెట్టడం, తను వెళ్లి బామ్మకి చెపితే బామ్మ అమ్మచెవిలో ఏదోచెప్పి, 'భడవా నీకెందుకే అవిఅన్నీ' అని తన్ని తిట్టడం గుర్తుకి వచ్చాయి.

అవును తనెందుకు చెప్పిందో మళ్లీ బావ రెండేళ్ళ దాకా రాలేదు, అనుకునేవారు, ఆ ఏడు అక్కయ్య మా

గారు పోయారుట. అత్తగారు, కోడల్ని చూడనని పట్టు పట్టిందిట. అక్కయ్య మాత్రం వారంలో రెండురోజులు టపా సంచి కోసం ఎదురుచూసేది. వకోసారి రాకపోతే కోపంతో ఆరోజంతా విసుక్కొంటూ వుండేది.

ఆ ఏడు వేసంగుల్లో బావ వస్తున్నాడని మళ్లీ ఇల్లంతా సుబ్బరం చేయిస్తున్నారు. నీళ్ళగది గోడ పడిపోయింది. కట్టిస్తున్నారు. దక్షిణంవేపు గదికి గుమ్మాలకి గుడ్డలుకట్టి, పెద్ద పెద్ద అద్దాలు, ఫోటోలు ఎవరెవరివో తెప్పించి పెట్టారు. గది అంతా కాయితాల పందిరిలా ఎన్నో రంగుల కాయితాలు కట్టారు.

హడావిడిగా వున్న ఇంట్లో బావ వక్కడే వచ్చాడన్న మాటతో అంతా వకసారి దిగులుపడ్డారు. అంతా తలోసారి వెళ్లి 'ఏంబాబూ మనవాళ్లు ఎవరూ రాలేదేం' అని అడగటం, బావ ముభావంగా నవ్వివూరుకోవడం చూస్తూన్న తను 'బావని మాట్లాడవద్దని చెప్పి పంపారేమొ వాళ్ళవాళ్లు, మూడు మాటల కథలాగా' అంటూంటే, 'వూరుకోవే ముదిపేరక్కా' అంటూ బొమ్మ నవ్వు కొంగులో దాచుకుంటూ పక్కకి తప్పుకుంది.

బావకి కావాల్సినవి కనుక్కునే పని నర్సిగాడికి పడింది. వాడి అల్లరి భరించలేక వో బంతి చేతిలోపెట్టి బావ వాడిని బయటికి తరిమాడు.

ఏది కావాల్సినా తన్ని పిలవడంతో ఏదో ఘనంగా వుంది. ఆ సంతోషంలో మెళ్ళో గొలుసు చూసుకోలేదు.

సంధ్యవేళ మెడ తడుముకుంటే కనబడక ఇల్లంతా కాలు కాలిన పిల్లిలా తిరుగుతోంది. బావ గదిలోకి తొంగి చూచింది. ఇంకెవరో కూర్చుని కబుర్లు చెప్తున్నారు.

గొలుసు పోయిందని ఇల్లంతా మారుమోగింది. అంతా తలోటి తిట్టటం, హడావిడిగా పెంటకుప్పలు వెతకటం, ఏడుపుతో తన కళ్ళు వాయటం చూసిన బావ గంభీరంగా ఏమీ ఎరగనట్టు "పోతేపోయిందిలే, ఇది పెట్టుకో" అంటూ మెళ్లో పెట్టి కొక్కెం తగిలించాడు. పక్కన వున్న పిల్లలు గొల్లుమని నవ్వారు. ఇల్లంతా ఆ మాట చేరి నవ్వుకున్నారు. మేనత్త కూతురు వచ్చి పార్వతి బుగ్గలు గిల్లి మా అన్నయ్యావొచ్చేదాకా ఈ అన్నయ్య కట్టాడులే అని ఎగతాళి చేసింది.

తన మెళ్ళో వున్నది తన గొలుసేనని అప్పుడు తెల్సుకుంది. సిగ్గుపడటం, మళ్ళీ బావ పిలిచినా ఆ చుట్టుపక్కలికి వెళ్ళకుండా తప్పించుకుతిరగటం గుర్తుకు వచ్చాయి.

గాలిబుడగలు ఎగరేసుకున్నంత సందడిగా మళ్ళీ వో వారం గడిచిపోయింది.

ఈసారి అక్కయ్యని తీసుకుని బావ వెళ్ళిపోయాడు.

మళ్ళీ వెనకటిలాగే ఇల్లు నిద్దరపోవటం మొదలుపెట్టింది. తనకి ఎవరు వూరెళ్ళినా ఎందుకో ఏడుపు వస్తుంది. అల్లాగే అక్కయ్య వెళ్ళేటప్పుడూ ఆగలేదు. 'తప్పు, ఏడుపేమిటే' అని బామ్మ కసిరింది.

అక్కయ్య వెళ్ళిన కొత్తలో ఎక్కువ వుత్తరాలు వచ్చేవి కావు. ఎప్పుడయినా బావ వో కార్డు రాసేవాడు. అంతే. అక్కయ్య వస్తోన్నట్లు వచ్చిన ఉత్తరం ఆ ఇంట్లో

ప్రతి వక్కరూ చదువుకున్నారు. ఈసారి ఇల్లు అంతా ఎల్లా వున్నది అల్లాగేవున్నా వక్క అక్కయ్యగది మాత్రం శుభ్రం చేయించారు.

వస్తుందనుకున్న రోజుకి అక్కయ్య రాలేదు. మరో పది రోజులు పోయాక పాలేరును తోడిచ్చి పంపారు. అంతా తలో సారి అక్కయ్యని కౌగలించుకు పలకరిస్తున్నారు. చాలా చిక్కి, నల్లపడిపోయింది పిల్ల అనుకుంది అమ్మ.

"ఎల్లావుందే కొత్త కాపురం?" అని బామ్మ అక్క వీపు మీద చెయ్యేసి అడిగింది. అప్పటిదాకా ఆపుకున్న దుఃఖం వక్కసారి పైకి వచ్చింది.

'ఎందుకే అంటూ వోదార్చి లోపలికి తీసుకెళ్ళారు. అక్కమరిది పోయాడని అప్పుడు తెలుసుకున్నారు ఇంటిల్లపాదీ. 'ఇది విన్నారా!' అంటూ నాన్నతో 'మనమ్మాయిని చేసుకో బట్టి పిల్లాడూ, తండ్రీ పోయాడని సాధిస్తోంది వియ్యపురాలు' అని అమ్మ చెప్పింది.

"ఏదో అనుకుంటారు లే! ఇంతకీ అతను జాగ్రత్తగా చూస్తున్నాడా?" అని నాన్న అడగటం,

"నీకెందుకే అవతలికి పో" అని అమ్మ కసిరితే అక్కడ నించి తను వెళ్ళిపోవటం, బుర్రలో తిరిగాయి.

ఈసారి అక్కయ్య బండెక్కేముందు నాన్నతో "పార్వతికి అప్పుడే పెళ్ళిచెయ్యకు. చదివించండి" అని పదిసార్లు చెప్పింది.

అమ్మ ఈసారి కంట తడిపెట్టింది. వారానికి ఒకసారయినా ఉత్తరం వ్రాయమని అక్కయ్యతో ఎన్నోసార్లు చెప్పింది.

ఈసారి అక్కయ్య వచ్చివెళ్ళాక అసలు తోచటంలేదు ఎవరికీ. ఎప్పుడేనా అక్కయ్యదగ్గరనుంచి వో ఉత్తరంవస్తుంది. అదే కాలక్షేపం ఆ ఇంట్లో. తెల్లవారటం, పొద్దుగూకటం, బామ్మ మడికట్టుకోవటం—అన్నీ సవ్యంగానే జరిగిపోతున్నాయి. అమ్మ వీర్రాజు మేష్టార్ని పెట్టి పురాణాలు నేర్పిస్తోంది. రుక్మిణీ కల్యాణం కంఠస్థం చేయిస్తున్నారు మాస్టారు. పద్యం వదిలేసి మంచిభర్త ఎల్లా వుండాలో అని వుపన్యాసధోరణిలో చెప్పుకు పోతున్నారు.

బామ్మ వచ్చి "అవి ఎందుకులెద్దురూ? పద్యం శ్రుణ్ణంగా చదవటం చెప్పండీ" అని విసుక్కుంది.

"అల్లాగే అల్లాగే" అంటూ నసిగి మేష్టారు పుస్తకం అటూ ఇటూ తిరగేసి ఆ రోజుకి చాలించారు.

కొద్దిరోజుల్లో పెద్దవాళ్ళ జతలో కలిపారు. ఇప్పుడు కొత్తరకం నిబంధనలు—వీధిలోకి ఎక్కువ వెళ్ళకూడదు. వంచాళింపుగా నడవాలి. గట్టిగా నవ్వకూడదు. పెద్దవాళ్ళు కింద కూర్చుంటే మంచాలూ అవీ ఎక్కి కూర్చోకూడదు. ఈ పాఠాలు బామ్మ రోజూ కొద్దికొద్దిగా చెపుతుంది.

ఇప్పుడు మరీ బాధగా వుంది, పొద్దుగూకులూ నాలుగు గోడలమధ్యే వుండాలంటే, అక్కయ్యకి తను వుండేదికనక కాలక్షేపం అయ్యేదేమో! తనకి ఎవరూ లేరు...నరిసిగాడు వున్నా ఎప్పుడూ బొంగరాలు, గోళీలు ఈ ధ్యాసతోనే సరిపోతుంది.

బామ్మపాతాలుకూడా లేకుండా అత్తయ్యగారి వూరి కెళ్ళింది. మళ్ళా మూడోనాడే నాన్నతో తిరిగివచ్చేసింది. వచ్చిన దగ్గరనుంచి రాముడు బావని తిడుతోంది.

"కిరస్తానీదాన్ని చేసుకున్నాడు లేవు" అంటూ మధ్య మధ్య ఏడుపుతో అమ్మకి చెప్పేది.

కొన్నాళ్లు జరక్కుండానే అమ్మ నాన్నని ఎక్కడెక్కడికో పంపేది.

వోరోజు రాత్రి టెలిగ్రామ్ రావటం అంతా వక్కసారి గొల్లుమనటం జరిగింది. పిల్లంటే పిల్లా అది అంటూ బామ్మ అక్కని వర్ణించి ఏడుస్తుంటే అక్క ఏమయిందో అర్థంకాలేదు. కొంతసేపటికి విషయం తెలిసినా ఏడుపురాలేదు. మర్నాడు అమ్మా, నాన్నా అక్కయ్య అత్తారివూరు వెళ్ళాల్సి వచ్చింది. అంతా తలోరకంగా అమ్మకి చెప్పారు.

అక్కయ్యని ఎవరూ చూడలేదు. బావకి ఏదో వైరాగ్యం వచ్చినట్లు వున్నాడని ఇంకెవరో అమ్మకి చెపుతున్నారు.

"మీ అమ్మాయి పాదం ఎల్లాంటిదయినా కడుపులో పెట్టుకున్నాను. అయినా ఇల్లా అన్యాయం చేసి పోయింది" అంటూ గట్టిగా బొబ్బలుపెట్టి అత్తగారు ఏడుస్తోంది.

"అబ్బో! అంత ఇదిగా నూత్తై నూతిలో ఎందుకు దూకుద్దీ" అని గుసగుసలాడేసు వచ్చినవాళ్లు. మర్నాడే తిరుగు ప్రయాణం. అమ్మా నాన్నని చూస్తే దుఃఖం ఆగటంలేదు. ఎద్దుబండి వుంత దాటుతోంది. ఎవరో పెద్దలు నాన్నని దిగమని సైగ చేశారు. ఏదో కొంతసేపు మాటలు జరిగాయి.

నాన్న ముఖం కండువాతో దాచుకోవటం, మళ్ళా బండి కదలటం గుర్తుకు వచ్చి ఏడుపు ఆగటంలేదు.

అమ్మ తేరుకునేసరికి చాలా నెలలు గడిచాయి. వోరోజు చీకట్లో మళ్లీ ఆ పెద్దలు దిగబడ్డారు. నాన్న బామ్మ అంతా ఏమిటో మాట్లాడుకున్నారు.

అమ్మ వచ్చి "నువ్వు వొప్పుకోవద్దు వాళ్లు అడిగితేనని" రహస్యంగా చెప్పింది.

ఎవరూ వచ్చి అడగలేదు. అమ్మని నాన్న కోప్పడ్డం మాత్రం అందరికి వినపడింది. అచ్చిరాలేదు కనక గుళ్ళో పెళ్లి అని వప్పించారుట. అమ్మకి ఇష్టంలేదు. అయినా అయిపోయింది. అక్కకి అన్యాయం జరిగింది అని మనస్సు ఘోష పెట్టినా తన ఇష్టాఇష్టాలతో పని యెవరికి? రామంబావ చేసుకునుంటే ఇల్లా జరిగివుండేదికాదు అన్న ఆలోచన మళ్లావెనక్కు వెళ్లింది. అయినా తనకు చదువా సంగీతమా! ఏమివున్నాయి కనక। చేసుకోలేదన్న బాధ ఎందుకు! ఏమో బామ్మ 'మంచి మొగుడు రావా'లని దీవించినప్పుడల్లా రామంబావనే తలచుకోవటం. "ఛీ! ఇప్పుడు జరిగిందేమిటి? పెళ్ళి చేసుకోకపోయినా రామంబావ ఎల్లాగా చేసుకోడు, అనుకొని వూరట పడేందుకు మనస్సు వప్పుకోవటంలేదు. ఆలోచనలతో తల దిమ్ముగావుంది. భోజనాలదగ్గర అత్తగారు అన్న మాటలు మళ్లీ కొత్త రూపంతో తిరుగుతున్నాయి.

ఆ రాధ వూళ్లో వుంటే నీకు ఇంటిగోడవ ఎందుకు పడుతుందిలే. అయినా దీన్ని మళ్ళీ వకదాన్ని కట్టిపెట్టాను అని విసుక్కోవడం,

పంపారు. ఆవిడను గురించి. కానీ, నిజంగా ఆవిడలోవున్న జాలి, అమ్మకికూడ లేదేమో. తన్ను ఎంత ప్రాణంగా చూసుకుంటోందో పాపం! బావతో ఎప్పుడూ మాట్లాడకూడదు అన్న నిర్ణయానికి వచ్చేసింది పార్వతి.

దానికితోడు రాధకి కొడుకు పుట్టాడని ఎవరో అత్తగారితో రహస్యంగా చెప్పటం వింది. అక్కయ్య పోవటానికి కారణం తెలిసినట్టు మనస్సుకి స్థిమితం వచ్చింది. బావ మాట ఇంక తన కెందుకు? ఏదో వున్నన్నాళ్ళూ అత్తగారి దగ్గరే వుండాలి. తరువాత ఏం చెయ్యాలి? తనకి నుయ్యంటే భయం. అక్కయ్య ఎల్లా చేయగలిగిందో? తను ఏదో చేసేసినట్టు వూహించుకు ఏడుస్తోంది పార్వతి.

భాస్కరం మొదటిసారి అనవచ్చు పార్వతిని పిలవటం.

"ఎందుకురా? అది పడుకుంది" అని తల్లి సమాధానం.

"ఇంకా ఎనిమిదన్నా కాలేదు. అప్పుడే పడకేమిటి?" అని విసుక్కుంటూ వసారాలోకి చూశాడు.

"బాగుందిరా వరస, నువ్వేమో వూరుచుట్టి రెండో జాముకి కాని రావాయె. అది చిన్న పిల్ల. ఏం చెయ్యమంటావు నిద్దరోక" అంటూ తనూ వెన్నువాల్చింది రావమ్మ.

బావ తన మంచం దగ్గరకి రావటం చూసి లేచి నిల్చుంది పార్వతి.

బుగ్గమీద నీటిచారలు కళ్ళకాటుక కిందకి జరిగి మరీ పెద్దగా కళ్ళు కనపడుతున్నాయి. రేగిన జుట్టుపై గుడ్డిదీపపు కాంతి పడి గాలిని అలలా కదులుతోంది.

భాస్కరం రెప్ప వెయ్యకుండా చూస్తున్నాడు.

"ఏమంటున్నావురా అబ్బీ" అంటూ తల్లి రావటం చూసి, భాస్కరం లేని గాంభీర్యం తెచ్చుకుని "పిలిస్తే పలకదేం ?" అని పార్వతిని విసుక్కుని విసురుగా తన గదివేపు వసారాలోకి వెళ్ళిపోయాడు.

"పోనీ ఏమిటో అడక్క పోయావే" అని మెల్లగా పార్వతి కళ్ళల్లోకి చూసింది. నిండిన కళ్ళనీళ్ళు ఎండిన చారికల పైకి దిగుతున్నాయి. "ఏమిటో వాడి మనస్సు రాయిలా మారింది. ఇదివరకు ఇల్లాగే వుండేవాడా !" అని తనలోనే అనుకుని, "పోనీ, నువ్వేనా వెళ్ళి కనుక్కోవామె" అంటూ పార్వతిని కొద్దిగా కోప్పడి, భాస్కరం గదిలో విడిచివచ్చింది రావమ్మ.

పార్వతికి ఇప్పుడు అయోమయంగా వుంది. అకారణంగా అత్తగారికి ఈ కోప మేమిటి ? అసలు ఈ ఇంట్లో అంతా తన్ని అదోలా ఎందుకు చూస్తున్నారు ? తనలో లోప మేమిటి ? తన తోటి సుశీల గుర్తుకివచ్చింది. వాళ్ళ అత్తారింట్లో ఎప్పుడూ తసమాటే వస్తూవుంటుంది అని చెప్పింది. సుశీల అత్తగారు ఎన్నిసార్లో బామ్మతోటి అమ్మతోనూ అనటం 'మీ పార్వతిలాంటి కోడలు రావాలంటే ఏం అదృష్టం పట్టాలో; ఆ కాస్త శాఖా భేదానికీ ఏమిటి లెద్దురూ ! మీరు వూ అంటే రేపే పెట్టిస్తా ముహూర్తం' అంటూ తన్ని దగ్గరికి లాక్కోవటం జ్ఞాపకం వచ్చి పార్వతి సిగ్గుతో ఇంకా ముడుచుకు మూలకి జరిగి కూర్చుంది. మళ్ళీ మళ్ళీ ఆవిడ మాటలే మనస్సులో తిప్పుకుంటోంది.

వర్షపుగాలి తుప్పర్లతో వంటికి తగిలి చలితో కలిసి హాయిగా వుంది ప్రాణానికి. ఎప్పుడో కునుకుపట్టింది.

రామం బావ వళ్లు అంతా కితకితలు పెడుతున్నాడు. తను నవ్వుతూ తప్పించుకుంటోంది. ఛా అంటూ గట్టిగా పైకి నవ్వి కళ్లు తెరచింది. అరికెన్ లాంతరు వెల్తురులో దగ్గరగా బావ కళ్లు మెరుస్తున్నాయి.

నిజమో కలో తెలియక కళ్లు మూసుకుంది. "ఎందుకు నవ్వుతున్నావు?" అని బావ అడగటంతో భ్రాంతి విడచి భయం చుట్టుకుంది. అరిచేతుల వెనక ముఖాన్ని దాచుకుంటోంది. తన చేతులు బావ చేతులో ఇరుక్కున్నాయి. దీపపు పురుగులా కదిలేందుకు వ్యవధి లేదు. తనకి ఇష్టం లేదు. చెప్పేందుకు ప్రయత్నిస్తే, గొంతురాక మూగవోయినట్లుంది. తన మొహంలో భావాలు తెలపకుండా దీపం రెపరెపలాడి గాలిలో కలిసింది. జీవితంలో తనకి ఇంత కోరికలు వుండకూడదు. వున్నా అవి తనలోనే భద్రంగా దాచుకోవాలి.

మామూలుగానే తెల్లవారింది. ఇంట్లో అంతా కాలంతో పరుగు పెట్టిన పనులు పూర్తి చేసుకుంటున్నారు. నీరు లేని ఏటిలా మనస్సు కదలటం లేదు. చెట్టు మొదట్లో చలనం లేకుండా కూర్చుంది. పాల చెంబుతో వస్తున్న భాస్కరం పార్వతిని చూసి నవ్వాడు. మడిబట్ట ఆరవేసే అత్తగారిలో ఎండవేడి రగిలింది. వడగాలిలా మాటలు పార్వతిని చుట్టుకున్నాయి. గతంలో పార్వతి అంటే జాలి. ఆ క్షణంలో పార్వతి

మనస్సు పెరిగింది. ఆవృారి ఆకారం ఆ ఇంట్లో కదిలింది. దుప్పలూ, పుంతలూ, శిథిలాలూ, వాటిని చుట్టి మొండి గోడలు. అందులో తను జీవించాలి గడ్డిపోచలా. మొండి మనసుల నీడలేని ఎడారి సుడిగాలిలో కూలిపోయిన భవనం. అక్కయ్య జీవితం శూన్యంలో వెలిగించిన ప్రమిదిలా తను ఎంతకాలం నిలవగలనో అనుకుంది పార్వతి.

కాలం వేసిన ఎగుడు దిగుడు బండల్పైన జీవితం సాగుతోంది.

# వొడ్డుకి చేరిన వొంటి కెరటం

జీవితం ఎందుకు అన్న ప్రశ్న ఆ రోజు వొచ్చింది ఆశమ్మకి. సమాధానంగా వార్ధక్యం నడుముఎక్కి, వికటంగా నవ్వినట్టు ఆశమ్మ నడుము వంగిపోయింది. పూర్వ స్మృతులు, వయస్సుని మభ్యపెట్ట శరీరం వయస్సుతో పోటీపడి గోడపైకి తూలింది ఆశమ్మ.

దూరంగా ఆడుతున్న నాగు చూసి "తాతమ్మా" అంటూ పరుగెత్తుకువచ్చి పట్టుకోబోయి ఆశమ్మమీద పడ్డాడు. అది నాగు తల్లి సీతమ్మ చూసింది. నాగుని లేవనెత్తి వీపు మీద తట్టి ''ఎన్నిసార్లు చెప్పినా వినవుకదూ! ఈసారి ఆవిడ దగ్గరికి వచ్చావంటే వీపు చిట్లకొడతాను" అని బెదిరించింది.

''అయినా! వచ్చే ఏడా! పోయే ఏడా! అన్నింటికీ తగుదునమ్మా అంటూ బయలుదేరడం ఎందుకంట ? ఆ పాకలో మంచం వుందిగా పడివుండరాదూ!" అని ఆశమ్మని విసుక్కుంది సీతమ్మ.

''పడి వుండరాదూ" అన్నమాట వొక్కటీ ఆశమ్మ మనస్సుని పట్టుకుంది. నెమ్మదిగా లేచి వొంటిని వసారాలోనికి చేరవేసింది. ఎముకలకి దూరంగా జరిగిన చర్మం గాలికి వుయ్యాల వూగుతోంది. వొంటరిగా వున్న పన్ను కదిలి నేనూవుండను అంటూ సలుపుతోంది. వసారాలో కొంగు పరుచుకుంది పడుకోవాలని. పక్కింటి పంతులుభార్య మంచి నీళ్ళకని బిందెపట్టుకువచ్చి, తులసికోట గట్టుమీద కూర్చుని,

"పెళ్ళి భోజనానికి వెడుతున్నారా? అని లోపల వున్న సీతమ్మని అడిగింది.

"పిలవని పేరంటం వెళ్ళాల్సిందే. అయినా అంత కచ్చిగా వాళ్ళుంటే మాకేనా ఏమిటి జరగనిది. సొంత తమ్ముడిని కాదు అనుకొని, మిమ్మల్ని మిమ్మల్ని పట్టుకు పెళ్ళికివచ్చి సవ్యంగా జరిగేటట్లు చూడమని పాకులాడుతున్నారటగా, మా బావగారు. అసలు ఈ కొంపల్లో గొడవలకి కారకురాలు బ్రతికి వుండగా ఎల్లా కలుస్తాంలే" అని ఆశమ్మనిచూపిస్తూ మెటికలు విరిచింది సీతమ్మ.

పోనిస్తురూ మీ గొడవలు ఎప్పుడూ వుండేవే. మిమ్మల్ని పిలవకపోతేమానె. చిన్నప్పటినించీ అష్టకష్టాలుపడి పెంచి పెద్దచేసింది. పెద్దదయిపోయింది. ఆవిడని గౌరవించి పీటలమీద కూర్చోబెట్టటం మీ బావగారికి ధర్మం. ఏమంటావు? అని తనే ప్రశ్నించుకు ఆశమ్మమీద జాలిపడింది పంతులు భార్య.

ఆశమ్మ పొడిఆరిన పెదిమలు తడిచేసుకు "ఏవూరు ఇస్తున్నారేమిటి? నాగమ్మా" అని అడిగింది.

"ఊరు పేరు ఏమొకాని పిల్లాడు పెద్ద చదువులు చదివాడుట. పిల్ల నచ్చిందని ఒప్పుకున్నారు కాని వాళ్ళతో వీళ్ళె కట్నం తూగ్గలరని అంతా అనుకుంటున్నారు. పోనీలే నీ పేరు పెట్టినందుకు పిల్లకి అదృష్టం పట్టింది" అని అంది నాగమ్మ.

"పేర్లో ఏముందిలే? పిల్ల అదృష్టవంతురాలు అని ఒప్పుకుంటా. అయినా ఆ పేరుపెట్టి వక్కనాడయినా మా తోటికోడలుకానీ మరెవ్వరైనా పిలవటం విన్నావా? ఆవిడికి ఆ

పేరంటేనే అసహ్యాంట. చిట్టి అని ఎవరు పెట్టారోకాని, అదే సార్ధకం అయింది. అయినా మా బావగారికి ఆ రోజుల్లో మేనత్త మీద డబ్బుకోసరము మోజువుండేదట. పిల్లకి పేరు పెట్టి ఈవిడచేత ఆ ఇల్లు తోట రాయించుకున్నాడు. నన్నడిగితే ఆ పేరు మార్చుకోమనే చెప్పుదును. ఈవిడ ఏమి వృద్ధిలోకి వచ్చిందేమిటి?" అని తల చిక్కు తీసుకుంటూ కసిగా అంది సీతమ్మ.

"ఆశ అత్తా అని కూతుర్ని ఎన్నోసార్లు మీ బావగారు పిలవటం విన్నా. అయినా ఆవిడకేం. ఆవిడచేత్తో చిల్లిగవ్వ యిచ్చినా చాలు అని వూళ్లోవాళ్ళు అనుకుంటూనే వుంటారు" అంది నాగమ్మ.

"ఆ కనపడుతూనే వుందిగా. చిల్లిగవ్వతో గుమ్మిడికాయ ఎగిరిపోయింది," అని వెటకారంగా ఆశమ్మకేసి చూస్తూ అంది సీతమ్మ.

సీతమ్మ ధోరణి నాగమ్మకి నచ్చలేదు. ఇంకేమయినా తనంటే వాదానికి దిగి ఆశమ్మని తిట్టిపోస్తుంది. అని గుర్తొచ్చి "ఎంతయినా మీరూ, మీరూ వకటే అవుతారు చివరికి" అని బిందె తీసుకు వెళ్ళిపోయింది.

దూరంగా భజంత్రీలు వాయించటం వినపడుతోంది ఆశమ్మకి కూర్చో బుద్ధిపుట్టలేదు. తను వెడితే వద్దంటారా? అనుకుంది. తన రంగం పెట్టెవున్న గదిలోకి వెళ్ళింది. పెట్టె మూతకి బీటలు పెద్దవయ్యాయి. తనలాగే పెట్టెకి కూడా వార్ధక్యం వచ్చింది అనుకుని బీటలపైన చేత్తో తడిమింది. మూత జరిపి పెట్టె అడుగున వున్న భరిణతీసి రుద్రాక్షమాల మెళ్ళో

వేసుకుని వుంగరం భరిణిలోనే పెట్టి కొంగుకి కట్టుకుంది. పెట్టి మూత వెయ్యబోతే వేలుమీద పడింది. ప్రాణం కడగట్టినట్ట యింది ఆశమ్మకి.

గడపమీద కాలు పెట్టుకు నిల్చుని "ఎక్కడికేమిటి ప్రయాణం? వాళ్లింటికేనా! మీ మేనల్లుడికి చెప్పకుండా వెళ్ళ డానికి వీలులేదు. అసలే కోపంగా వున్నారు. మళ్ళీ గడప తొక్కనివ్వరు తెల్సిందా?" అని వురిమింది సీతమ్మ.

"బొత్తిగా పసిదాన్ని కసిరినట్టు కసురుతావేం? నేనేం కాని పని చెయ్యటంలేదు. అంతా నావాళ్లేననుకుని వాళ్లు విసు చుకు చేశాను ఆనాడు. అందరికీ విరోధినే ఈనాడు" అని వచ్చే దుఃఖాన్ని ఆపుకునేందుకు నోరుచప్పరిస్తూ నడవాలోంచి వీధి లోకి వచ్చింది ఆశమ్మ.

"ఎవరు చెయ్యమన్నారు. ఇప్పుడు దెప్పటంకోసరం చేశావన్నమాట! చేశావో లేదో ఎవరు చూశారులే, ఇప్పుడు నీకు చెయ్యలేక నాదుంప తెగుతోంది. నీ పాపిష్టిడబ్బు నిలవా లేదు సరేకదా! అయినవాళ్ళని విడతీసింది. చివరికి నీ చాకిరీ మిగిలింది నాకు. ఆ ఇచ్చేది ఇద్దరికీ పడెయ్యకపోయావా'' అని విసుగా తలుపులు మూసింది సీతమ్మ.

యాత్రలకి వెళ్లాలనేకదా! ఆ డబ్బు వడ్డీకి ఇచ్చు కున్నది. దేశంచూసే యోగం తనకి లేకపోయె. ఏమనుకుంటే ఏమి ప్రయోజనం. రామేశ్వరమైనా చూడలేదు తన జీవుడు. రామాయణం చదివినప్పుడల్లా పారవశ్యంలో రామేశ్వరం ఆరోజే వెళ్ళాలనిపించేది. అయినా ఆ భగవంతుడికి ఇచ్చిన డబ్బు మనం ఇముడ్చుకోగలమా! అందుకే చిన్న మేనల్లుడు

పెట్టిన వ్యాపారం రాణించలేదు అనుకుంది. అయినా దీని దుర్బుద్ధే వాడిని పైకి రానివ్వలేదు. ఏమో, నాకెందుకు ఇంకా ఈ తాపత్రయం. అన్నీ వదులుకున్నా, ఆత్మసన్యాసం పుచ్చు కోలేదు అనుకుంది ఆశమ్మ.

అరుగుమీద కూర్చున్నదానికి ఏదో గుర్తొచ్చినట్టు లేచి నిల్చుని కొంగుని నడుముకి బిగించి కట్టుకుంది. కఱ్ఱ తోడుతో విసురుగా రోడ్డు ఎక్కింది. మళుపు తిరగకముందే, వీరన్న ఎదురై "పెద్ద అప్పగారు ఎక్కడికి ఎల్తున్నారు" అని అడి గాడు.

మనస్సులో మరుగుతున్న దుఃఖం వేడి తగ్గి పొడి మాట లగా బైటపడ్డాయి. "నువ్వా నాయనా" అంటూ వీరన్న దగ్గ రగా వొంగుని "ఏమి చెప్పనులే మీ నాన్న దగ్గర డబ్బులల్లాగే వుంచినా బాగుండేదేమో. అప్పుడు అది తీసి ఇచ్చేదాకా నిలువనివ్వలేదు. ఇప్పుడేమో ఎవరికీ గిట్టకుండా పోయాను. అయినా ఆ పరమేశ్వరుడికి దయ రాలేదు. ఇంకా ఎంతకాలం పరీక్షిస్తాడో" అంటూనే పెండ్లి పందిర దగ్గరికి వచ్చింది ఆశమ్మ.

వీరన్న శలవతీసుకు వెళ్ళిపొయ్యాడు.

వొచ్చిందేకాని లోపలికి వెళ్ళేందుకు మనస్సు వొప్ప లేదు. సందు గుమ్మం పట్టుకు నిల్చుని ఎవరైనా వస్తున్నా రేమోనని చూసింది. పెళ్ళికూతురు తమ్ముడు పసివాడు ఆనంద్ వచ్చి వూడిపోయే లాగు చేత్తో పట్టుకుని "తాతమ్మ రా" అంటూ కఱ్ఱపట్టుకు నడిపించి దొడ్డి పంది ట్లోకి తీసుకువెళ్లాడు. పెళ్ళికూతురికి పువ్వులజడ కుడుతున్నారు.

వొచ్చిన బంధువుల్లోని అమ్మలక్కలు ఎవరూ పలకరించక పోయినా పెళ్లికూతురు గడ్డంపట్టుకు మొహం పైకెత్తి ఆప్యాయంగా వొకసారిచూసి కొంగునికట్టిన ఉంగరంవిప్పి పిల్ల చేతిలో పెట్టి తృప్తిగా బోసినోరు తెరిచి నవ్వుకుంది ఆశమ్మ.

పిల్లతల్లి రంగమ్మ వొక్క విసురునవచ్చి వుంగరం తీసి విసిరికొట్టి కోపంతో "ఎవరిక్కావాలి ముతనష్టండబ్బు. వాళ్లకే ఇచ్చుకో పట్టుకెళ్లి" అని అరిచింది.

వొక బంధువు "వాళ్ళే పంపివుంటారు ఏమి జరుగుతోందో చూసిరమ్మని. పిలవలేదని వుడుక్కుపోతోందిటగా సీతమ్మ. పంతులు భార్య చెప్పిందిలే" అని మాట అందించింది మరొక ఆవిడ.

"పిలవాల్సిందే ఎప్పటికి అప్పుడు పోటీయే. ఈ సంబంధం కూడా కుదరనియ్యకుండా చేయ్యాలని ఎంత తాపత్రయ పడింది అప్పన్నగారు చెప్పి ముక్కుమీద వేలు వేసుకున్నాడు. ఈ ముసిల్ది ఏమి తక్కువది కాదు. పిల్లకి తనపేరు పెడితే నోటుమీద తిప్పే డబ్బు దానికిస్తానని పిల్లతండ్రికి చెప్పి పేరు పెట్టించుకుంది. చివరకి డబ్బుఅంతా పట్టుకెళ్లి వాళ్లకి పట్టం కట్టింది. ముష్టివుంగరం తెచ్చిఇస్తోంది" అని అక్కసు వెళ్ళబోసుకుంది రంగమ్మ.

ఆనంద్‌కి తల్లి మాటలు అర్థంకాక చూస్తున్నాడు. దూరంగా బురదలో పడ్డ వుంగరం మెరుస్తూ కనిపించింది. తీసి లాగుకి తుడిచి తాతమ్మ చేతిలో పెట్టాడు.

"కొత్తలాగుకి బురద తుడుస్తావురా!" అని రంగమ్మ వీపుమీద చరవటంతో ఆనంద్ పందిర అదరిపోయేటట్లు ఏడుపు

మొదలుపెట్టాడు. రంగమ్మ తమ్ముడు "మీరు రావటంవల్ల జరిగే వుపకారం పాతపగలు బయటపడటమేగా" అని ఆశమ్మని విసుక్కుని, 'ఇంక వెళ్ళ' మన్నట్టు కర్రపుచ్చుకుదూరంగా తీసుకెళ్లి వదిలాడు.

"ఆశమ్మకి మరిచిపోయిన అభిమానం గుర్తుకొచ్చింది. "నా యింట్లోంచి నన్నే గెంటుతున్నావా! ఎవరికీ తక్కువ చెయ్యలేదు. ఈ ఇల్లు ఎవరు రాసి యిచ్చారో మీ అప్పకు గుర్తుచెయ్యి" అంటూ గాడిపొయ్య దగ్గరగావున్న గట్టుమీద కూర్చుంది.

"ఇహ లడ్డూలు ఇవాళ అయినట్టె ఈవిడ ఇక్కడ చేరింది" అని పెళ్లికూతురు పినతల్లి అనటం, మరో ఆవిడ ఇంత దిష్టితీసి మరీ పొయ్యి ఎక్కించండి. వయస్సు వస్తే సిగ్గు శరం వదిలేస్తారనుకుంటా. అక్కడ అన్ని అంటున్నా ఇక్కడ వచ్చి చతికిలపడింది" అని దూరపు బంధువు ఆశమ్మని విదిలించింది రంగమ్మ మెప్పుకోసం.

ఈసారి కర్ర తీసుకు విసురుగా నడవబోయి గాడి పొయ్యిలో పడబోయింది ఆశమ్మ. వంటమనిషి చటుక్కున పట్టుకోకపోతే ఏమయ్యేదో అని అక్కడివాళ్ళు దవడలు నొక్కుకున్నారు.

దూడలపాక గుమ్మం దాకా వంటమనిషి ఆశమ్మని తీసుకువచ్చాడు. వాడి చిన్నతనం అంతా ఆశమ్మ నీడనే జరిగింది. ఆకలెరిగి తిండిపెట్టింది. వొక ఇంటివాడిని చేసేదాకా వూరుకోలేదుగదా? అని తనలో కృతజ్ఞతగా అనుకున్నాడు.

బొడ్డులోవున్న రూపాయి తీసి ఆశమ్మ అతని చేతిలో పెట్టింది. వంటమనిషి, కళ్ళు తుడుచుకుని ఆమె కాళ్ళకి మొక్కాడు.

నూనె పొంగి గాడిలోపడి మంట లేచింది. ఇసుక పొయ్యమని అరుపులు. "హమ్మయ్యా ఎంత ప్రమాదం తప్పింది" అన్న మాటలు గట్టిగా వినపడ్డాయి.

ఆశమ్మ ఆ దారిని నడచి ఎన్నో ఏళ్ళైంది. తన హయాంలో ఇంటిపెత్తనం ఎల్లా చెయ్యాలో నేర్పి ఇనప్పెట్టి తాళాలు చేతిలోపెట్టి కళ్ళుమూశాడు తండ్రి. అన్నగారుఎక్కువ కాలం లేకపోయినా, పిల్లలు పసివాళ్లు పొలాలు జాగ్రత్త అని చేతిలో చెయ్యి వేయించుకున్నాడు. ఆ యింటికి ఆడా, మగా తనే అయి మర్రిగింజ వేసి మహావృక్షంలా ఆస్తిని పెంచి అప్ప గించింది. ఎవరు సంతోషిస్తున్నారు అన్న ప్రశ్నకి సమాధానం రాలేదు.

మామిడితోపు దగ్గర ఆగింది. బోదిగట్టున కూర్చుని దూరంగా కనపడే పచ్చని చేలు చూసుకుంది. మామిడిచెట్లు అన్నీ పుల్ల విరిగిపోయాయి. చీమల పుట్టలుగా రాలిన ఆకులు మృత్యువుచేతిలోని జీవులలా రెపరెపలాడుతున్నాయి.

'ఏమి తల్లీ ఈడకూకున్నావు" అని బాపి పలకరించేటంత వరకు ఆశమ్మ మనస్సు మామిడి చెట్ల మీద కూర్చుంది.

బాపి చెయ్యి వూతగా తీసుకుని ఆశమ్మ నడవటం మొదలుపెట్టింది. "నాకంటే చిన్నదానివి ఎట్టాగయ్యావో సూడు. పేగుసంబంధం వుంటేగద. తిన్నావో వున్నావో అడిగేంమకు" అని బాపి వాపోయింది.

ఆశమ్మ దుఃఖంతో మాటరాక మూలుగుతోంది.

"సిన్నాయన పెళ్లాంకూడా సిన్ను సీదరిస్తోందంటగా! అల్లా గిన్నాలే" అంది బాపి. ఊకొట్టడం తప్ప మాట్లాడలేదు ఆశమ్మ. ఇల్లు దగ్గరకొచ్చింది బాపి వెళ్లిపోయింది. ఆశమ్మ వంటరిగా పెరటిలోకి వెళ్లింది.

అప్పటికే అక్కడ చేరినవాళ్లు సీతమ్మకంటే గట్టిగా మాట్లాడటం వినిపిస్తోంది. దూరంగా వున్న పారిజాతం చెట్టు దగ్గరికివెళ్లి కూర్చుంది ఆశమ్మ.

"పిల్లిలా ఏమీ ఎరగనట్టు ఎల్లా వచ్చి కూర్చుందో చూడండి. మమ్మల్ని తిట్టించాలని కాకపోతే అసలు ఎందుకు వెళ్లినట్టు అంట? అప్పన్న కనపడకపోతాడా నేను మీముందు అడక్కపోతానా?" అని రొప్పుతూ సీతమ్మ పెద్ద గావుకేకలు ఆశమ్మకివినపడుతున్నా మనస్సు శూన్యంగానిల్చినట్లుంది. సూర్యాస్తమయం చూస్తూ సంధ్యాప్రార్థనకోసం ముక్కులుగోణుక్కున్నా వొకటి కొకటి అతకటం లేదు. అక్కడకక్కడ గుర్తుకొచ్చినవి కలిపి ఒకటిగా చేరుస్తోంది. చిన్నప్పుడు సూర్యాస్తమయం చూస్తే బెంగగా ఉండేది. దూడల్ని ఇళ్లకి తరిమినట్టు చీకటి దుమ్ముతో చేరి వూరిలోకి రావటం వూరిళ్ళు, పెద్ద లోగిళ్ళు, భవనాలు పైనచేరిన పొగ చీకటికి ఎదురెళ్లివచ్చేది. వెలుతురు దిగులుగా చీరెంచులామారి ఆకాశంలో చేరిందని తండ్రితో చెపితే ఎంతో మురిసిపోయేవాడు. "మా తల్లికి కావ్యాలు చెప్పించాలి. దాని వయస్సెంత ఆ వూహాచూడండి" అని గర్వంగా చెప్పుకోవడం గుర్తుకొచ్చింది.

"తాతమ్మా" అంటూ వీపుమీదపడి "ఎక్కడికెళ్లావే" అని వొళ్ళంతా తడిమి కొంగు విప్పిపటిక బెల్లం తీసుకున్నాడు.

తండ్రి గొంతు దూరంగా వినపడి లోపలికి పరుగెట్టాడు నాగు, నూతిదగ్గర చేదచప్పుడు.

గొడ్లసాలలో దూడల అరుపు, కీచురాళ్లు కప్పలు అన్నీ కలిసి వకటిగా గోలచేస్తున్నాయి. వాటితో కలిపి సీతమ్మ కేకలు అన్నీ సర్దుమణిగేసరికి చంద్రుడు బాగా పైకొచ్చాడు. దూరంగా మళ్ళా భజంత్రీలు గట్టిగా వాయించడం వినపడుతోంది. ఇప్పుడు మనస్సు ఇంక అటుపోలేదు. అసలు తను చిన్నప్పుడే ఏ కాశీకో వెళ్లి వుండిపోతే ఎల్లావుండేదో అనుకుంది తనకి ఎల్లావస్తుంది అల్లాంటి అదృష్టం ? తను చీకటిలోనే పెరిగి చీకటిలోనే కలవాలని రాసివుండి వుంటుంది. ఆకాశంలో అక్కడక్కడ కొద్దిగా మబ్బులు కనబడుతున్నాయి. ఎంత రాత్రి అయిందో ఏ మొకంటి మీదకి కునుకురావటంలేదు. కడుపులో పేగులు కదులుతున్నాయి. బాపితన కంటే నయం కడుపుడుపిల్లలు, అది అన్నట్టు తనకి ఎవరు వున్నారు. తనసంతతే అవుతే తిండికి పిలవకండ వుండగలరా? ఏమో వున్నా ఇల్లాగే వుండే వారేమొ అని సమాధానపరుచుకుంది. అసలు వయస్సు మళ్లిన వాళ్లని చూస్తే వయస్సులో వున్న వాళ్లకి చులకనలు. మళ్ళా ఆకలి గుర్తు చేసింది కడుపు. వెళ్లి సీతమ్మని అడిగి తినటమా ఛీ ఈ చపలత్వం ఏమిటి అని తనే మందలించుకుంది. వయస్సులో ఆ ఇంట్లో ఎన్ని కథలూ కార్యాలు తన చేతిమీద జరిపించింది ! అప్పుడు తిండిమీద ఎప్పుడయినా మనస్సు పోయిందా ? ఎన్నిసార్లు తిండి మానలేదు చచ్చిన వదినగారు గుర్తుకి వచ్చింది.

నీకు పనిగోల తప్ప తిండి జాసవుండదని అనటం, పోదూ వెధవ తిండికేం వచ్చె అని తను విదిలించటం జ్ఞాపకం వచ్చింది.

ఇప్పుడు ఆ తిండి కోసం ప్రాణం రెపరెప లాడుతోంది. చిత్రం. అన్నీ అందుబాటుగా వుంటే ఆ కోరిక చస్తుందేమొ, లేకపోతే ఏమిటి, ఇప్పుడు ఎక్కడ కమ్మటి వాసనవచ్చినా జిహ్వాకి తినాలన్న కోరిక ఆలోచించే వోపిక లేక మనస్సు అలసినట్టు మూలుగుతోంది. జాలితలిచినట్టు పారిజాతం పూలు వకటి వకటి ఆశమ్మమీద పడుతున్నాయి. దూరంగా పొలాల్లో దీపాలు కదులుతున్నాయి కాశీకావిడి తీసుకు భజగోవిందం పాడుకుంటూ దాసరికంఠం దగ్గరగా వినపడింది. ఆశమ్మ మధ్యలో గుర్తు వచ్చి మొదలు పెట్టింది సంప్రాప్తే. సన్నిహితే అని పూర్తికాకుండానే పంతులు భార్య పలకరించింది. "అప్పుడే లేచావా? స్నానానికి వెడదామని పెందరాళే లేచావే, నువ్వూ వస్తావేమిటి !" అని ఆశమ్మని అడిగింది.

"వెళ్లేటప్పుడు పిల్చుకెళ్ళు" అని, గోవిందగీతం మొదలు పెట్టింది ఆశమ్మ.

చీకట్లో ముడుచుకున్న జీవాలకుతని తెల్లటి పల్చటి కాంతిని కప్పి ప్రశాంతంగా ప్రకృతి ఆకాశపు ఎఱుపంచు చీరతో దోబూచులాడుతోంది. ఆశమ్మ నెమ్మదిగా లేచి వొళ్ళు తూలుతున్నా ఎల్లాగో ఇంట్లోకి చేరింది. జ్ఞాని అజ్ఞానం లోకి జరిగినట్లు ఇంట్లోకి చీకటి వదల్లేదు. ఆశమ్మ తడుముకుంటూ రంగం పెట్టె తెచ్చింది. ఈసారి మూత్రస్థానం విడిచి కిందపడి చప్పుడు చేసింది. ఆశమ్మ పెట్టెలో వస్తువులు కింద పోసుకుని

అన్నీ చూసుకుంది మళ్ళా పెట్టింది. జీడిగింజని మాత్రం కంటికి దగ్గరగా పెట్టుకు చూసుకుంటోంది.

ఊడిపోయిన జుట్టు ముడిపెట్టు కుంటూ. "అప్పుడే ఏమి పుట్టిములిగింది ! వెధవగోల ఆ పెట్టికూడా పాకలో పడవె య్యావే" అని పనిమనిషికి వినపడేలాగ గట్టిగా కేక పెట్టింది సీతమ్మ.

ఆ కేకకి ఆశమ్మగుండె అదిరింది. తప్పుచేసినట్టు వణికి పోయింది. జీడిగింజా రాగిచెంబు పట్టుపంచిలో పెట్టి చుట్టుకు లేచింది. ఏదో కిందపడి చిన్నగా శబ్దం చెయ్యటంతో మళ్ళా కూర్చుని చేత్తో తడుముతోంది. చేతికేదో దొరికింది. కంటి దగ్గర పెట్టుకు చూసింది పన్ను ఎవరిది ! తన నోట్లో వెతు క్కుంది. ఎప్పుడు వూడిందో చిత్రమే, అనుకుని దాన్ని భద్రంగా కొంగుని కట్టుకు ఇవతలకి చేరింది. కాలవగట్టు మీాద నడు స్తూంటే కళ్లు చీకట్లు కమ్మి కింద పడబోయింది. ఎల్లాగో రేవుకి చేరి రెండు చెంబులు ముంచి పోసుకుంది. మళ్ళా బలం వచ్చి నెమ్మదిగా వడ్డుకి వచ్చి, రావిచెట్టు మొదట్లో కూర్చుండి. ఏనాటి నుంచి వుందో చాలాపలవలు మోడుబారాయి అయినా ఏదో పక్క చిగురిస్తూనే వుంటుంది. ఆ రోజు ఏది చూసినా కళావిహీనంగా కనపడుతోంది.

నదిలో నీళ్లపై ఇసగ కప్పువేసింది. చిన్నతనంలో వడ్డుని వరుసుకుపోయే నది గుర్తుకు వచ్చింది. దాని అవసరం కూడా వూరికి తగ్గివుంటుంది. లేకపోతే బాగుచేయించరూ మునసబు కనపడితే చెప్పాలి అనుకుంది. గుడిగంటలు వినపడి బయలు దేరింది ఆశమ్మ.

పూజారి అచ్చన్న ఎదురై కళ్లప్పట్టుకు నడిపించాడు. "మా కుటుంబాన్ని రప్పించింది, అప్పటినించీ ఎంతో వృద్ధి లోకి వచ్చాము. నిన్ను అనుకోని క్షణం వుండదు అనుకో" అని ఆశమ్మ వినేలా అని లోపలికి తీసుకు వెళ్లాడు.

గుడిలో నంది ముందుకు జరిగి కూర్చుంది. అచ్చన్న చేతిలో జీడిగింజ పెట్టి విడతియ్యమంది ఆశమ్మ.

ఏమి వుందోనని మిగిలిన వాళ్లు చూస్తున్నారు. గుండు రాయితోటి కొడితేడిప్పలు విడికాసులు కిందపడి చప్పుడు చేశాయి. అచ్చన అర్థంకానట్టు ఆశమ్మకేసి చూశాడు.

"తూము వుందిగా ! అమ్మవారి మెళ్ళోకట్టు" అంది ఆశమ్మ.

అచ్చన్న ఏదో అనబోయి సరేనంటూ పసుపు దారం తెచ్చి గుచ్చికట్టి కర్పూరం వెలిగించి చూడమన్నాడు.

బాగా దగ్గరిగా జరిగి పార్వతిని చూసుకుని కళ్యాణ దంపతులకి మొక్కుకుంది. జీవితం వ్యర్థంగా గడిచిపోయింది. ఈ జన్మకి తను ఏమీ చెయ్యలేదు. అవివేకాన్ని మన్నించి జీవితా నికి ముక్తిని ఇవ్వమంది. ప్రమిదలో దీపం మిణుకు మిణుకు మంటోంది. గుళ్లో పూర్వపు కళతరిగి ఏదో వెల్తి కనపడినా మనస్సులో ఏదో ఆనందం ఏదో కాంతి ఏదో తృప్తి అన్నీ వక్కసారి ఆశమ్మలో అఖండంలా మెరిసిపోయాయి.

అచ్చన్న 'ఆ గుళ్లోకి వస్తావా' అనటం విని ఆఖరి చూపులా మూల విరాటుకి మొక్కి ల బయలుదేరింది.

రామాలయానికి చేరేసరికి సోషవచ్చినట్టు పరిగింది. అచ్చన్న తులసి తీర్థం తెచ్చి ఇచ్చాడు. లేచి కూర్చుంది ఆశమ్మ.

"ఆ రెండో కాసు ఈ అమ్మవారికి కట్టు" అని చెప్పి తారకంవల్లె వేసుకుంటోంది.

అచ్చన్న హారతి వెలిగించి చూడమని మంత్రపుష్పం చెపుతున్నాడు.

మెరుగు పోయింది ఏమి మెరుస్తుందిలే అనుకుంది. తల్లీ శలవా ? అని ఏదో పాడబోయి ఊరుకుంది ఆశమ్మ.

పూజ ముగించుకు వచ్చి కూర్చున్నాడు అచ్చన్న. మెళ్లో రుద్రాక్షామాల తీసి, "నువ్వు జపం చేసుకో" అని అచ్చన్న చేతిలో పెట్టింది ఆశమ్మ.

కృతజ్ఞతో వంగి ఆశమ్మ కాళ్లు కళ్లకి అద్దుకున్నాడు. "కాసేపు భాగవతంలో భీష్మస్తవం చదువుదూ" అంది. ఆశమ్మ. అచ్చన్న చదువుతున్నాడు. ఆశమ్మ తనలో నవ్వు కుంటూ వన్నెకాడు, అనుకుంటోంది.

"నైవేద్యం పెట్టేందుకు రమ్మని" అచ్చన్నకి పిలుపు వచ్చింది. గంటలు వుండి వుండి మోగుతున్నాయి.

ఆలయం ఆవరణ విడిచి రావిచెట్టు దగ్గరకి చేరింది. ఆశమ్మ. ఆనంద్ ఆవిడని చూసి భయంతో వణుకుతున్న చేతులు తాతమ్మ మెడికిచుట్టాడు పక్కలు ఎగురుతున్నాయి. మాటరాక వెక్కుతున్నాడు, నాగు వగరుస్తూ వచ్చి పక్కన నిల్చుని "వీడేం లేడు, ఆంబోతుని రాయి పుచ్చుకు కొట్టాడే."

"నేను కాదు వాడే కొట్టాడు" అని ఆనంద్ చెప్పటం పూర్తి కాకుండానే ఆంబోతు దగ్గరికి వచ్చేసింది.

ఏమిటో సరిగ్గా అర్థం కాకపోయినా పిల్లలిద్దర్ని దగ్గరికి తీసుకు పట్టుకుంది ఆశమ్మ.

రంకె వేసి ఆంబోతు ఎత్తిపడేసింది ఆశమ్మని. రాళ్ళ మీదకి దొర్లి నీళ్ల దగ్గరవున్న బండకి కొట్టుకు నిల్చింది. పిల్లల్ని పట్టుకున్న పట్టు విడవలేదు. ఆఖరి చూపు పసివాళ్లని చూసి తృప్తిగా కళ్లుమూసింది ఆశమ్మ.

అలిసినట్టు పిల్లలు అల్లాగే వుండిపోయారు, మాట తెల్సినంత వరకూ జనం పోగయ్యారు. రంగమ్మ సీతమ్మ పిల్లల కోసం గోలపెడుతూ వచ్చారు.

"ఇంకా అల్లా చూస్తూ వూరుకుంటారేం పిల్లాడిని ఇవతలికి తియ్యండి" అని పెనిమిటిని కసిరింది.

రంగమ్మ ఏదో అనాలనుకున్నా భర్త వాలకం చూసి వూరుకుంది.

పిల్లల్ని ఇవతలకి జరిపి ఆనంద్ తండ్రి ఆశమ్మ గుండెలో తలదాచుకు పసివాడిలా అయ్యాడు. తనని గోదావరిలో పడకుండా కాపాడింది. తమ పిల్లలకోసం కళ్లుమూసింది. తనేం చేశాడు. ఏమీ చెయ్యలేదు ఆవిడకి అంటూ విలవిల్లాడాడు. నాగు ఆనంద్ వకరికి వకరు దగ్గరగా జరిగి కూర్చుని తాతమ్మ కోసం రాళ్లు కరిగేలా గోలపెడుతున్నారు.

(18)

పూజారి అచ్చన్న, బాపి, వంటవాడు, వీరన్న, నాగమ్మ ఆవిడని గురించి కథలుగా చెపుతూ, ఎండిపోయిన కళ్ల కొలుకులు తడుపుకున్నారు.

రంగమ్మ మనస్సు ఎల్లాగో అయింది. ఎదురుగా పెద్ద సముద్రం వున్నట్టు అందులో వక కెరటం పై ఆశమ్మ ప్రశాంతంగా నిద్రపోతున్నట్టు అనిపించింది మనస్సులోనే ఆశమ్మ ఆత్మకి కృతజ్ఞత చెప్పుకుంది.

సీతమ్మకి అందరి మొహాల్లో కనపడే దుఃఖం కపటంగా తోచింది. తన మనస్సు ఎందుకో తేలికగా వున్నట్టువుంది. కొత్తగా వచ్చిన స్వతంత్రంలా, ఏదో మనస్సులో వుద్రేకం తిరుగుతోంది. "కన్నవాళ్లు లేరన్న లోటు లేకుండా చేశాను, మిగిలిన వాళ్లల్లా నేనూ వదిలేస్తే ఏమయ్యేదో" అని రంగమ్మ కేసి చూసింది కసిగా.

అవతల వడ్డునవున్న కుర్రాడు వచ్చి అప్పన్నకి చెపుతున్నాడు. ఆంబోతు రావటం గురించి. "భలేగా పట్టుకున్నార్లె ఈ కుర్రోళ్లని లేకుంటే ఇయ్యాల ఏమయ్యేవోళ్లో" అంటూ, ఆశమ్మ కేసి చూసి "పోయిందా?" అంటూ ఆశ్చర్యంగా తెరచిన నోటితో చూస్తూ వుండిపోయాడు కుఱ్ఱాడు.

రంగమ్మ చూపు నీటి అంచునే చూస్తోంది. ప్రశాంతంగా నదిలో నీళ్ళు జరుగుతున్నాయి. గాలివచ్చి నీళ్ళని సుడులు తిప్పుతోంది. ఆశమ్మ ఆత్మ నీటిపైన తేలుతూ వెళ్లి వడ్డుకు చేరినట్టు అయింది. వడ్డుకి చేరిన వంటి కెరటంలా రంగమ్మ కంటి బిందువు బరువుగా జారింది.

---

# మార్పుకి మరో పేరు

రంగారావుకి తండ్రి దగ్గరనుంచి వచ్చిన తంతి చూడగానే కాళ్ళలోంచి దడ వచ్చినంతపని అయింది. నెమ్మదిగా వంట గదిలోకి చేరాడు.

"చూడు రాజ్యం! నాన్న దగ్గరనుంచి టెలిగ్రాము వచ్చింది. మా అమ్మ, చెల్లెలు వస్తున్నారట. ఈపూట స్టేషనుకు వెళ్ళాలి" అని నీళ్లు నములుతూ భార్యకి చెప్పాడు.

ఆ మాట వినగానే తరుగుతున్న వంకాయను కిందపడేసి తెల్లబోయి మాట లేకుండా రంగారావు మొహంలోకి చూస్తూ వుండిపోయింది రాజ్యం.

"నా మాటేమిటి? తొందరగా ఏదయినా ఆలోచించు నాకేం తట్టడం లేదు," అంటూ చిరాగ్గా అటూ ఇటూ తిరుగుతున్నాడు.

"పోనీ, నేనీ పూట మావాళ్ళ వూరికి బయలుదేరనా?"

"పూటా? అంత గడువేవుంటే నిన్ను సలహాలడగాలా? ఇంకో గంటలో వాళ్లు రానే వస్తారు? ఏం చెయ్యడానికీ పాలుపోవడం లేదు." అంటూ కిటికీ వూచల్లో మొహం పెట్టుకుని ఆలోచల్ని రోడ్డులో వెతుకుతున్నాడు రంగారావు.

"వస్తే రానివ్వండి. నేనేం తప్పు చేశాను? మీ దగ్గరేగా వుంటా? మీకుమాత్రం వాళ్లు రాగానే వాళ్ళతో మమేకం అవకపోతే చాలు ఏం చేస్తారో చూస్తాను," అని పైకి అన్నా, భయంతో కాళ్ళు, చేతులు చెమ్మగిల్లాయి రాజ్యానికి.

ఇంతలో మెట్లకింద ఒక కంఠం "అబ్బాయి రంగారావు" అని గావు కేక పెట్టడం వినపడి, చైతన్యం తప్పి కింద చతికిల పడ్డాడు రంగారావు. "ఏం పని చేస్తే? మీకు వంట్లో బాగా లేదు అని చెపుతాను. మీరు పడుకోండి." రాజ్యం సలహా పూర్తి కాకుండానే తలుపులు దడదడలాడుతున్నాయి. రంగారావు మంచం ఎక్కి ముసుగు పెట్టాడు. రాజ్యం తల్లో పువ్వుల దండ తీసి సొరుగులో పడేసి, కొత్తచీర గబగబా కట్టుకునే లోపల తలుపులు దడతగ్గి పెద్ద శబ్దంతో, పిట్టగోడమీదికి వరిగాయి. అత్తగారు ఏకాయెకీ రాజ్యం వున్నచోటుకి వచ్చి "హయ్యో, నువ్వ ఇక్కడే వున్నావా" అంటూ వక్కవురుము వురిమి "వాడేడీ" అంటూ పక్కగదిలోకి వెళ్ళింది. ఆడపడుచు నాగరత్నం వొదినగార్ని పరీక్షగా చూస్తూ "నువ్వ ఎప్పుడొచ్చావు? నిన్ను తీసుకురానని వ్రాశాడుగా?" అంటూ మూతి తిప్పుతూ తల్లి వున్నచోటుకి వెళ్ళింది.

పక్కగదిలో కాంతమ్మగారు అంటోంది, మాకు జరిగిన అవమానం ఎలా మరవగలిగావు? ఏ మొహం పెట్టుకుని దాన్ని గడప తొక్కనిచ్చావంట; హు. నిన్ననాల్సిన పని లేదు లే! మీ నాన్నకి ఇంగితంవుంటే ఇంతంత ఘాతుకాలు జరిగేవేకావు." అంటూ రంగారావు కప్పుకున్న ముసుగు, వక్క విసురున తీసి "ఏమిటి జబ్బు?" అంటూ వళ్లు అంతా తడిమింది.

అప్పటికే భయంతో వళ్ళు అంతా నీరు కమ్మినట్టువుంది రంగారావుకు. వీళ్ళు ఇప్పుడు ఎందుకు వచ్చినట్టు? తండ్రికి ఎవరయినా తనకి తెలియకుండా వుత్తరంవ్రాశారా? ఒకవేళ అల్లా

జరిగితే ఆయనే వస్తాడు కాని, వీళ్ళ ఇద్దరికి రైలుఖర్చులు పెట్టి పంపేరకం కాదని కొంత ధైర్యం తెచ్చుకొన్నాడు.

"హయ్యో, వళ్ళు ఇంత చల్లగా వుందేంరా? ఎన్ని లంఖణాలు ఇవాళ్టికీ? అయినా వక్కకార్డు ముక్క వ్రాయలని దానికైనా తోచలా? మేము బతికే వున్నాంగా. ఇప్పుడైనా అర్థమయిందా? ఎర్రగా, బుర్రగా వుందని మాకు చెప్పకుండా మళ్ళీ దాన్ని తెచ్చుకున్నావు. దీని పిన్నమ్మ సంగతి రాత్రి రైల్లో వకాయన చెపితే, మాకు తలకొట్టేసినట్టు అయిందనుకో" కాంతమ్మ ముక్కు తుడుచుకుంటూ విశాలంగా పైకి జరిగి కూర్చుంది.

కూరవాసనకి తట్టుకోలేక నాగరత్నానికి నోరు వూరుతోంది. నిన్ననగా తిన్నతిండి, పైగా తండ్రి ఎప్పుడూ వుడకపెట్టిన కూరలు తప్ప వండనివ్వడు. తల్లిఅందులో ఇంకా పొదుపుచేసి పోపులేకుండా పొడికారంతో సరిపెట్టి డబ్బుచేస్తుందాయె. వాళ్ళ ఇంటికి బంధువులు వచ్చినా పక్కవూళ్ళో భోంచేసి మరీ వస్తారు. తండ్రి ఎవరింటికీ వెళ్ళడూ, ఎవర్నీ వెళ్ళేందుకు ఒప్పుకునే ఘటం కాదు. ఇప్పుడైనా తన పెళ్ళి తిరపతిలో చేస్తున్నారుకనక, ఇంతకీ అమ్మగోలపెట్టిందని పట్నంరానిచ్చాడు. "కూర మాడువాసన వస్తూన్నట్టుంది, చూడమను. ఆ గుడ్డలతో వుడకేస్తుంది. నేను తిననని చెప్పు" అంటూ గోళ్ళతో తల దువ్వుకుంటూ కాంతమ్మ, నాగరత్నానికి చెప్పింది.

వంటింట్లో సామాన్లన్నీ మూతలుతీసి నూనెవంకాయని చూడగానే చేతిలోకి తీసుకోబోయి, వేడికి కిందవదలి, మళ్ళీ దాన్ని గిన్నెలో వేసింది నాగరత్నం. పచ్చడిచేసే రాజ్యం

"అదేమిటి కిందపడిందాన్ని మళ్ళీ అందులో వేస్తున్నావు" అంది.

పళ్ళెంలోకి తీసుకుని తల్లిదగ్గరకు వెడుతూ, "మహ చెప్పావులే. ఎవరెరుగరూ మీవాళ్ళింట్లో సుబ్బడం. అయినా సిగ్గులేదు. వాడిని వెర్రివాడినిచేసి వచ్చి కూర్చుంది. నాన్నకి తెలిస్తే వదిలిపోతుంది ఈ బడాయి." అంటూ వదినగారిమీద దండకం చదువుతూ వోమూల వున్న ట్రంకుపెట్టిమీద కూలబడింది నాగరత్నం.

"ఏమిటే తింటున్నావు ఇల్లారా చూస్తాను" అంటూ కూతురు చేతిలో పళ్ళెం అందుకుంది కాంతమ్మ. రంగారావుకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తనెంతో మనసుపడి లేత వంకాయలు తెచ్చుకుంటే, తనకి దక్కనిచ్చేటట్టులేరు. పైగా తన తెలివితక్కువకొద్దీ వంట్లో బాగా లేదని పడుకున్నాడు. తన్నుతల్లి వారందాకా చారునీళ్లు తప్ప మరొకటి ముట్టుకోనివ్వదని గుర్తుకి రాగానే, ఆకలి మరీ ఎక్కువయింది. పళ్లెంలో వంకాయల్లోంచి నూనె కారుతుంటే ఆ వాసనకి తట్టుకోలేక, "ఈ పూటకి మడి అక్కర్లేదనిచెప్పు. రేపు ఎలాగా నేనే మడిగా చేసుకుంటా' నంటూ సమాధానపడింది, కాంతమ్మ.

తల్లీ చెల్లెలూ నీళ్లగదివేపు వెళ్ళడంచూసి రంగారావు నెమ్మదిగా వంటింట్లోకి వచ్చి "రాజ్యం నాకు వడ్డించు తొందరగా" అని పీటమీద కూలబడ్డాడు. ఆత్రంగా వంకాయ కలుపుకుంటూండగానే నాగరత్నం తల్లిని గావుకేక పెట్టింది. వళ్లయినా తుడుచుకోకుండా చీర సగం చుట్టుకువచ్చి పడింది కాంతమ్మ. "నీకేం పోయేకాలమే లంఖణాల వాడికి అడ్డమయినవి పెడ

తారా" అంటూ కంచంలో కలుపుకున్నవి తీసేసి చారుగిన్నె ముందుకులాక్కు వడ్డించింది. రంగారావు జాలిగా రాజ్యం కేసి చూశాడు. వచ్చే నవ్వుని ఆపుకుంటూ రాజ్యం పక్కకి తిరిగింది.

"అయినా సంసారి లక్షణాలు ఎక్కడైనా వున్నాయా అంట? ఈ కూరకి ఇంతనూనె పోసుకుంటారా? వాడి సంపాదన అంతా ఇల్లా తగలేసేందుకు వచ్చింది, మళ్లీ మహాతల్లి" అంటూ వో పక్కగా చతికిలపడి పమిట కొంగు ముందుకు లాక్కుని వేరే తీసిన అన్నం, కంచం ముందుకు జరుపుకుని మూలుగుతూ, "వడ్డించు" అని పురమాయించింది కోడలికి, కాంతమ్మ. "నాక్కూడా వడ్డించు. బట్టకట్టుకొస్తా" నంటూ ఇల్లంతా నీళ్లు వోడుస్తూ తడిబట్టతో ముందుగదిలోకి వెళ్లింది నాగరత్నం. "ఆ కూరపళ్లెం ఇటు తొయ్యి'' అంటూ అడ్డంపడి అందుకుంది కాంతమ్మ. తల్లి విస్తరి కేసిచూసి వుసూరుమంటూ నాగరత్నం తనూ మొదలుపెట్టింది. కూరపళ్లెం ఖాళీగా వుండడంతో కొబ్బరిపచ్చడి రాచ్చిప్ప దగ్గరికి తీసుకుంది. ఇద్దరూతిని త్రేవుమంటూ లేవలేకుండా ఆయాసపడుతూ లేచి వెళ్లారు.

"మంచంకింద వున్న ట్రంకు బయటికి లాగింది నాగరత్నం. "అది ఎందుకే తీస్తావు! మీ వదినపెట్టి" అని నసుగుతూ రంగారావు అన్నాడు.

పడుకున్న కాంతమ్మ లేచి కూర్చుని, "కొత్తగా కొన్నావేమిట్రా" అని కొడుకుని అడిగింది కాంతమ్మ.

"వాళ్ల వూరునించి తెచ్చుకుంది" అని ముక్తసరిగా జవాబిచ్చాడు.

తాళాలు పెట్టిమీదే వుండటంతో నాగరత్నానికి మరీ సంతోషంవచ్చి, ఆ తాళం ఈ తాళంపెట్టి ఎలాగో పెట్టి తెరచింది. "ఇవన్నీ ఆవిడవే! ఎన్ని చీరెలు వున్నాయో చూడవే" అంటూ ఏడుపుమొహంపెట్టి తల్లికేసి చూసింది.

"మీ అన్న సంపాయిస్తున్నాడుగా! ఎన్నేనా కొంటాడు. కన్నతల్లికీ, చెల్లెలికి కొనాలంటే కష్టంగాని, ఆవిడకి కొనకపోతే వూరెట్టదూ!" అంటూ కొడుకునీ కోడల్నీ కలిపి సాధించటం మొదలుపెట్టింది.

"నువ్వు అలా అనుకుంటే నేను ఏమి చెప్పనూ? నా కొచ్చేది చాలకపోతే, వాళ్ళ నాన్నకి వ్రాసి తెప్పిస్తోంది. అందుకు వప్పుకొనే, అమ్మాయిని తీసుకొచ్చి ఇవన్నీ కొనిపెట్టి వెళ్ళాడు వాళ్ళనాన్న." అంటూ బయటపెట్టాడు రాజ్యాన్ని తీసుకువచ్చిన సంగతి.

"అవును నాయనా! వాళ్ళకి నువ్వే పెద్ద వయ్యావు. మా లెఖ్ఖేమిటి? మీ నాన్న కోపంలో అన్నారే అనుకో, పిల్లనిచ్చిన వాడు పదిసార్లు తిరిగి బతిమాలాలా వద్దా? అయినా వాళ్ళ తప్పులేదు. నువ్వు వెళ్ళి వాళ్ళలో కలిస్తే వాళ్ళకి మా లెఖ్ఖ ఏమి వుంటుంది? ఆడప్రాణం కనక మనసులో మధ్య మధ్య పీకితే, మీ నాన్నతో కోడల్ని తీసుకురండని చెప్పి, ఆయనచేత నాలుగుపడి, నోరు నొక్కుకు వూరుకునేదాన్ని, అయితే ఈ రెండేళ్ళనించీ నీ దగ్గర వుందన్న మాట?" అని అరా తీసింది కాంతమ్మ.

"ఇంకా పూర్తిగా నెల కూడా కాలేదమ్మా రాజ్యం వచ్చి" అన్నాడు. వాళ్ళ మాటలు వింటూనే కొన్ని చీరలు విడిగా తీసి పెట్టింది నాగరత్నం.

"మీ నాన్న వరస చూద్దామా లోభత్వం ఆరోజు కా రోజు పెరుగుతోందే కాని తగ్గదు. ఒక్కపిల్ల, దానిముద్దు ముచ్చట్లు చూద్దామన్న ఇంగితం ఏకోశనా లేదు. అసలు విషయం చెప్పనే లేదు, మనవూళ్ళో దత్తుడుకి పెళ్ళయింది ఈ మధ్య. ఆ పెళ్ళికి వచ్చిన వాళ్ళలో అతని స్నేహితుడు లండనూ, అవీ వెళ్ళి వచ్చాట్టా, అతనికి చదువుకున్న పిల్లలంటే భయంట, పల్లెటూరి వాతావరణంలో, పెరిగిన పిల్లని, చేసుకుంటానని ఎప్పుడో అన్నాడట. పాపం దత్తుడి అప్పలేదూ? దీన్ని కబురంపి తన చీర కట్టి చూపించింది. తరువాత మీ నాన్నని వప్పించేసరికి వాళ్ళ తాతలు దిగివచ్చారనుకో. చిల్లిగవ్వ కట్నం లేకుండా వప్పుకున్నాడు. లాంఛనాలు కింద వాళ్ళ వేపు వచ్చిన పెద్దమనిషి, నాలుగు వేలకి తక్కువ వప్పుకోలేదు. పెళ్ళి తిరుపతిలో చెయ్యామన్నారు. ఎల్లుండి తెల్లవారు జామునే ముహూర్తం. నేను ఇక్కడికి మొన్ననే రావల్సింది. బెజవాడలో ఆగిపోవల్సి వచ్చింది. అవధాన్ని కూడా మాతో పంపారు. నువ్వున్న చోటు తనకి తెల్సునకనక తీసుకొచ్చి మమల్ని వదిలి తను వాళ్ళవాళ్ళ ఇంటికి వెళ్ళాడు. అతను రాగానే మనం బయలుదేరాలి. దీనికేమయినా మంచివి రెండు చీరలు కొని పెట్టరా?" అని కొడుకును తొలింది కాంతమ్మ. "నాన్న వంద ఇచ్చాడు. దానితో రెండు చీరలు కొనుక్కుంటా. మిగిలినవి

నువ్వుకొను" అంటూ నాగరత్నం గారంచేసింది అన్నగారి దగ్గర.

"సరే మీ నాన్న ఇచ్చిన వందా పెట్టి గుడ్డలు కొంటే మనం వెళ్లడం ఎట్లా" అంటూ ఆ మాట చెప్పిందని కూతుర్ని కళ్లతో బెదిరించింది కాంతమ్మ.

పనిమనిషిని పంపివచ్చి, రాజ్యం ముందుగదిలోకి తొంగి చూసింది. తన పెట్టెలో బట్టలు చుట్టూ పరుచుకు కూర్చున్న నాగరత్నంమీద కోపం వచ్చి "అదేమిటి? నా పెట్టె కెలుకు తున్నావా" అంటూ మళ్లీ సర్దుకునేందుకు కూర్చుంది రాజ్యం. "నువ్వు కొన్న వేగా ఈ చీరలు? నాకు బాగున్నాయిరా అన్నా" అంటూ కొన్ని తన వొళ్లో పెట్టుకుంది నాగరత్నం. "మరే పాపం మీ అన్నేమీ కొనలేదు అవి అన్నీ నావే" అంటూ తీసుకోబోయింది రాజ్యం. అవి ఎలాగా నాగరత్నం ఇవ్వదు. ఎలాగో గొడవ లేకుండా సర్దాలనుకొని "నీవైనా, అది మనసు పడుతున్నప్పుడు ఇస్తే తప్పా?" బతిమాలినట్లుగా రాజ్యంతో అన్నాడు రంగారావు.

రంగారావు చెల్లెల్ని వద్దనకుండా, తన్నే ఇవ్వకూడదా అన్నందుకు రాజ్యానికి వళ్లుమండింది. నేను ఇవ్వనంటూ నాగ రత్నం రాజ్యం చెయ్యి విసరికొట్టి "నీదేంపోయింది మా అన్న తీసుకోమంటే" అంటూ తల్లిదగ్గరకు వెనక్కి జరిగింది.

ఆ విసురుకు రాజ్యం చెయ్యి పెట్టెకు తగిలి గాజు చిట్లింది. దుఃఖం ముంచుకొచ్చి, చిట్లిన గాజు చేతిలోకి తీసుకొని వంటింట్లోకి వెళ్లింది రాజ్యం.

"నీకూ గుడ్డలపిచ్చి, కనపడ్డవన్నీ కావాలంటావు. అవక్కడ పారేసి మీ అన్నని కొనమను" అంటూ కూతుర్ని కసిరినట్టుగా సలహా యిచ్చింది కాంతమ్మ. అన్న మౌనంగా వుండడంతో "ఆవిడకే కొనుక్కుంటాడులే" అంటూ తన పెట్టెలో పెట్టుకుంది నాగరత్నం.

ఇంతలో అవధాని పేరు పేరు వరసనీ అంటూ పైకి రావడంతో చీరల పేచీ వదలి మాటల్లో పడ్డారు. రంగారావు లేచి, అవధాన్ని కూర్చోమని మడతకుర్చీ ముందుకి జరిపాడు. "సాయంత్రం బస్సువుంది కాని మనకి కొత్తకనక, చీకట్లో వెతుక్కోలేము మరి వాళ్ల బస. అందుకని వుదయం బయలు దేరిపోదాం" అని చెప్పాడు కాంతమ్మతో అవధాన్లు.

"ఏమంటావురా అబ్బాయి?" అని అడిగింది కొడుకుని. "మీ యిష్టం" అంటూ, వంటింట్లోకి వెళ్ళాడు రంగారావు. మోకాళ్ల మీద తలెట్టుకు కూర్చుంది రాజ్యం. ఎలాగో రాజ్యానికి తన బాధ అర్థమయ్యేట్టు చెప్పాలి మొదలెట్టడం ఎలా?

బస్సు దగ్గరకి వచ్చెయ్యమని చెప్పి అవధాన్లు వెళ్ళిపోగానే, నాగరత్నం అన్నగార్ని బజారుకి తీసుకెళ్ళమని నిలవ నివ్వడం లేదు.

తల్లినీ, చెల్లెల్ని తీసుకు బజారు వెళ్ళమని రాజ్యాన్ని అడిగాడు. "అవిడ వద్దులే బాబూ నువ్వేరా!" అని నాగరత్నం పట్టుపట్టింది. "వాడికి వంట్లో బాగా లేదన్నాడామె. తెల్లారి బోలెడు దూరం వెడతామా, మొండిపట్టు పట్టకు. మళ్ళీ ఇటు వచ్చి వో వారం వుండి వెడదాములే" అని కూతురికి చెప్పింది కాంతమ్మ. రంగారావు కాస్త స్తిమితపడ్డాడు. రాత్రి భోజనాల

వరకూ అంతా తలోమూలా నడుము వాల్చారు. రాజ్యాన్ని తీసుకువెళ్ళడంమాట తల్లి ఎత్తుతుందేమోనని చూశాడు. ఆ మాట తప్ప మిగిలినవన్నీ మాట్లాడడం రంగారావుకి కొంచెం కష్టంగా తోచినా పైకి ఏమీ తేలలేదు.

"అన్నయ్య మనతో వస్తే, ఈవిడ ఇక్కడే వుంటుందా? అని తల్లినడిగింది నాగరత్నం.

"ఏమో పోనీ తీసుకెడదామన్నా, మీ నాన్న పెళ్లి మాని రాద్ధాంతం మొదలుపెడతారు" అంది కొడుకేసి చూస్తూ కాంతమ్మ. "నేనుకూడా మానేస్తే ఏం?"అని రంగారావు తల్లినడిగాడు. "సరే నీ తమ్ముడు డబ్బు కావాల్సివచ్చినప్పుడు నెత్తిమీద కూర్చుని తీసుకెళ్ళడంతప్ప మళ్లీ గుమ్మం తొక్కడంలేదు. నువ్వూరాకపోతే ఒక్కగాను ఆడపిల్ల ఏం బాగుంటుంది." అంటూ గట్టిగా కళ్లువత్తుకుంది కాంతమ్మ.

"నాకోసం ఎవరూ బాధపడఖ్ఖర్లేదు పొద్దున్న మా వాళ్లవూరు వెళ్లిపోతా"నంది కీనీడలో నిల్చున్న రాజ్యం.

తనప్రక్క మెట్లగదిలో వేసుకుంది. గదిలో పడుకున్న కాంతమ్మలేచి, "ఇక్కడే గాలేస్తోందే" అంటూ కోడలికి కొంత దూరంగా పక్క పరుచుకుంది. రాజ్యాన్ని పలకరించాలని చూస్తున్న రంగారావుకి ఇంకేమీ చెయ్యడానికి తోచక నిద్ర పట్టేదాకా ఇటూ అటూ దొర్లుతూ గడిపాడు. రాజ్యాన్ని మళ్లీ రమ్మని చెప్పాలి. ఎలా? వీళ్లు వెళ్లాక తనే వెళ్లి తీసుకొచ్చేందుకు నిర్ణయించుకుని నిద్రపోయాడు. తెల్లవారి లేచిన దగ్గిరనుంచీ ఎవరి హడావిడి వాళ్లదిగావుంది.

రాజ్యం తన పెట్టెలోవున్న రంగారావు బట్టలు తీసి మంచంపైన పెట్టేసింది. తనవి పెట్టెలో దిగులుగా సర్దుకుంటోంది. "చూడు పెట్టె తీసుకెడతావా!" అని రంగారావు అడుగుతున్నాడు. "వోసారి అలా వెళ్ళరా అన్నా! బట్ట కట్టుకోవాలి" అంటూ నాగరత్నం తడిబట్టలతో గుమ్మంలో నిల్చుంది.

అంతా బస్సుస్టాండుకి చేరారు. ముందు చిత్తూరువెళ్లే ది సిద్ధంగా వుంది. హారన్ వేస్తున్నాడు డ్రయివర్. రాజ్యాన్ని అందులో ఎక్కించాడు రంగారావు. మాట్లాడేందుకు వ్యవధి లేదు. బస్సు కదిలింది. రాజ్యం కనపడేటంతవరకు చూస్తున్నాడు. తన కేసి చూడనయినా చూడలేదు రాజ్యం. వంటరిగా పంపుతున్నందుకు కోపమయివుంటుంది. బాధపడుతూ తను ఎక్కే బస్సుదగ్గరకి వచ్చాడు రంగారావు. అవధాన్లు ఆయాస పడుతూ పక్కచుట్ట పుచ్చుకొని పరుగెత్తుకుంటూ వచ్చాడు బస్సుదగ్గరికి. "హామ్మయ్య వెళ్ళిపోయిందేమోనని హడిలిపోయాను" అన్నాడు లోపలకూర్చుంటూ కాంతమ్మతో.

బస్సు కదిలింది. అవధాన్లు చూడకుండా రాజ్యం బస్సు వెళ్లిపోయినందుకు కాంతమ్మ మనస్సులోనే మొక్కుకుంది దేముడికి. తన కొడుకుని ఒకసారి ఆప్యాయంగా చూసుకుంది. "వెర్రినాగన్న వద్దంటే మాట్లాకుండా పంపేశాడు. ఎంత మంచివాడు. వీడికితగ్గ పిల్లకాదు, గడుగ్గాయిని కట్టబెట్టాడు" అని మధ్యవర్తిని తిట్టుకుంటూ సుఖంగా కునికిపాట్లు పడుతోంది కాంతమ్మ. తన వెనకసీట్లో కూర్చున్న ఆవిడ చీరలాంటిది కొనుక్కోవాలి. ఆవిడ దుద్దులు కదిలినప్పుడల్లా

మెరిసిపోతున్నాయి. తనెప్పుడు కొనుక్కుంటుందో ? తను అదృష్టవంతురాలు. కనుకనే అంత పెద్దచదువు చదివినవాడు తన్ను చేసుకునేందుకు వప్పుకున్నాడు. తను జాగ్రత్తగా వుండి అన్నీ కొనిపించుకోవాలి. భవిష్యత్తుని గురించి, రంగురంగుల కలలు కంటూ మురుస్తోంది నాగరత్నం.

మైలురాళ్లు తిరుపతిని దగ్గరికి తెస్తున్న కొద్దీ, రంగారావుకి మనస్సు పీకుతోంది. రాజ్యం వచ్చినరోజు అన్నమాటలు చెవులలో హోరుపెడుతున్నాయి. "మీరు ఇంత మంచిగా వుంటారనుకోలేదు నే వచ్చేటప్పుడు. అమ్మకి నే రావటం ఇష్టంలేదు అయినా మా నాన్నని వప్పించి తీసుకువచ్చేశా. నేను తిరపతి వస్తానని మొక్కుకున్నా. అందుకునే మీలో ఇంత మంచి మార్పు వచ్చింది"అని అమాయకంగా తనకేసి చూస్తూ చెప్పడం కళ్లల్లో కదులుతోంది రంగారావుకి.

రాజ్యం వంటరిగా ప్రయాణం చెయ్యడం మొదటి సారేమో, కొంచెం బెరుకుగా కూర్చుంది. మనస్సులో బాధగా వుంది. మళ్లా పుట్టింటికి వంటరిగా వెడుతున్నది. కారణం తల్లికి చెల్లెలికి చెబితే హేళన చెయ్యొచ్చు, చెప్పకూడదని నిర్ధారణ చేసుకుంది. తను వెళ్లిన కొత్తలో ఎంత ఆదరం చూపారో గుర్తుకి వచ్చింది. ఈ మార్పు ఒక్కరోజులో వస్తుందన్న వూహాకికూడా, మనస్సులో తావుఇవ్వలేకుండా వుంది. పెళ్లికి తీసుకువెళ్లకపోతేమానె, మళ్లా రమ్మని మాటకైనా అనలేదు. అవును! తన్ని రమ్మని ఎవరు ఆహ్వానించారు ఇంతవరకుమట్టుకు తనే వచ్చింది. అలాగే మళ్ళావస్తే వద్దనకపోవచ్చు అనుకుంది. మళ్లా ఈసారి ఏమయినా రమ్మనందే రాకూడదు అనుకుని

తనమీద తనే సానుభూతి చూపుకుంది. ఆలోచనలు 'చిత్తూరు వచ్చింది' అన్న కండక్టరు కేకతో ఆగిపోయాయి. తను దిగి పెట్టె దింపమంది.

రాజ్యం వంటరిగా రావడంచూసి తండ్రి ఎదురువచ్చి 'అత నేడే' అని అడిగాడు. కొద్దిగా నవ్వి వూరుకుని రిక్షా డబ్బులు ఇచ్చి పంపి లోపలికెళ్లింది. తల్లి హాల్లో ఎదురయి "అనుకుంటూనే వున్నా!" రఘు పెళ్లి అంటే ఎగబడి వస్తాడని "మీ ఆయన వచ్చాడా" అని అడిగింది రాజ్యాన్ని. "అబ్బే రాలేదు" అని ముక్తసరిగా చెప్పింది. "వూ ఎందు కొస్తాడు! వేలకివేలు గుమర్కించి, బంగారంలాంటి పిల్లని ఇచ్చినందుకు మేము శత్రువుల్లో జతే. నువ్వు తెగింపు తెచ్చుకువెళ్లినందుకు నిన్నేనా బాగా చూస్తున్నందుకు సంతోషపడాలి'' అంటూ కళ్లు తుడుచుకునే తల్లినిచూసి చలించింది రాజ్యం. తనూ కళ్ళు తుడుచుకుంది.

"అమ్మడూ" అన్న తండ్రి కంఠం విని సంతోషాన్ని మొహంలోకి తెచ్చుకునేందుకు ప్రయత్నించింది రాజ్యం. "నీ పెళ్లికే మీ పిన్ని పల్లెటూరు ఇస్తున్నామని నానా హంగామా చేస్తూ ఉత్తరాలు వ్రాసింది. ఇప్పుడు తన కొడుకు దమ్మిడీ కట్నం లేకుండా చదువు, సంగీతం, ఏమీరాని అమ్మాయిని చేసుకుంటున్నాడు. పెళ్లి రేపు తిరపతిలో చేసుకుంటు న్నాడు. పెళ్ళికి రానని మీపిన్ని భీష్మించుకు కూర్చుంది, అని మీ బాబాయి వ్రాశాడు" అని చెప్పి తండ్రి నవ్వుతూ కళ్లలో వచ్చే నీళ్లని పంచెకొంగుతో తుడుచుకోవడం రాజ్యం తేరి పార చూస్తోంది.

"సర్లెండి పోలిక తెచ్చారు. కోడల్ని ఎక్కడనించి తెచ్చుకున్నా, మన యింటికివస్తే మన అలవాట్లు నేర్చుకుంటారు. కొంతకాలానికయినా మార్చుకోవచ్చు. అదే అల్లుడు మారతాడా? మార్చగలము కనుకనా" అని వుసూరుమంది తల్లి. "నువ్వు అల్లా అనుకుంటున్నావు కానీ అమ్మాయి నడుగు మమ్మల్ని చూడగానే ఎంత పొంగిపోయాడో నీ అల్లుడు?" అంటూ తృప్తిగా రాజ్యంకళ్లలోకి చూశాడు తండ్రి. "ఆ తెలుస్తోందిగా అమ్మాయిని నక్కుర్తినీ పెళ్లికి పంపడం" అంటూ తల్లి మూతి తిప్పుకుంది "వచ్చేందుకు వీలులేకపోయిందేమో" అంటూ అల్లుణ్ని సమర్థిస్తూ తండ్రి చెప్పడం రాజ్యానికి తృప్తిగా వుంది.

ఆ సాయంత్రం ప్రయాణానికి అంతా సర్దుకుంటున్నారు బట్టలూ నగలూ. తల్లితో మెల్లిగా "పోనీ నేను ఇంటిదగ్గర వుంటా"నంది రాజ్యం. "అదేమిటే మీ పిన్ని, నువ్వు ఇక్కడ వుండి తీసుకురాలేదంటే వూరుకుంటుందా? పోనీ మనిద్దరం పెళ్ళి అవగానే వచ్చేద్దాం" అని తండ్రి అనడంతో సరేనని వప్పుకుంది రాజ్యం.

రాజ్యం తల్లిప్రక్కన కూర్చుంది బస్సులో. తీరా వాళ్లు తనని చూసి ఏమన్నా అంటారేమోనని గుర్తుకిరాగానే వళ్లు చల్లబడ్డట్టు అయింది. ఎన్ని పెళ్లిళ్లు అవుతాయో అక్కడ వాళ్ళని కలుసుకునే అవకాశం వుండకపోవచ్చు. తండ్రి చెప్పాడుగా పెళ్లి అవగానే వెళ్లిపోతేసరి. అని సమాధాన పడింది రాజ్యం. చెల్లెలు వేసే ప్రశ్నలకి వూఁ వూఁ అంటూ సమాధానమిస్తూ పరధ్యానంగా కూర్చుంది రాజ్యం.

మంగాపురం చేరేసరికి, దీపాలు వెలిగాయి. తల్లి చెల్లెలు లోపలికి వెళ్లారు. సామాను పట్టించుకుని రాజ్యం తండ్రి వెనుక మెల్లిగా సత్రవలోకి వెళ్లింది.

రఘు ఎదురొచ్చి "చూడు పెదనాన్నా! అమ్మ మూర్ఖం కానీ, ఇంతవరకూ వచ్చాక ఇప్పుడు చేసుకోనంటే ఏం బాగుం టుంది? నువ్వు కొంచెం నచ్చచెప్పాలి. అమ్మ ఏమంటే దానికి బాబాయి తాళం వేస్తారు" అని చెప్పి లోపలికి తీసుకెళ్లాడు.

పిల్ల తన కేమీ నచ్చలేదని రాజ్యానికి చెప్పి కళ్లు తుడుచు కుంది పినతల్లి. "చేసుకునేవాడికి నచ్చినప్పుడు మనకి నచ్చక పోయినా ఇబ్బందిలేదు" అని మరదల్ని సముదాయించి "రాజ్యం! నువ్వు వెళ్లి చూసిరావే మీ కాబోయే వదినగార్ని" అని తండ్రి చెప్పడం విని నవ్వింది రాజ్యం. తల్లీ, చెల్లెలూ మేనమామభార్య పిల్లని చూడ్డానికి, ఆత్రంగా పెళ్ళివారి సత్రా నికి బయలుదేరడంచూసి, ఏో మూల గట్టుమీద కూర్చుంది రాజ్యం.

తల్లి తిరిగివచ్చే ధోరణి చూస్తే, రాజ్యానికి భయ మేసింది. ఏమిజరిగిందో వూహించలేకపోతోంది. "పెళ్లికూతురు ఎవరో తెలుసా?" అంటూ ఆయాసపడుతూ చెల్లెలుదగ్గర కూలబడింది రాజ్యం తల్లి. నా బిడ్డని తీసికెళ్లకుండా, రెండేళ్లూ తొంగిచూడని దాని అత్తగారు నా కాబోయే వియ్యపురాలు. అంతకంటే చుప్పనాతి శూర్పణఖ నా కాబోయే కోడలు." అని చెప్పి గట్టిగా వూపిరి వదిలింది రాజ్యం తల్లి. అప్పగారి మాటలు వినగానే ఏడుపు కొనసాగించింది పెళ్ళికొడుకు తల్లి.

చుట్టూ కొందరు చుట్టాలు చేరి తలోపుల్లా అగ్నిహోత్రంలో వేసి నట్టు సాయపడుతున్నారు.

రాజ్యం మాత్రం కిటకటాల్ని పట్టుకు ఆ గట్టుమీదే కూర్చుని దూరంగా వినపడే సన్నాయిని వింటోంది. రఘు వచ్చి రాజ్యం ప్రక్కన కూర్చుని చేతులకైన మట్టిని దులుపు కుంటూ, "ఏమే రాజూ ! ఇప్పుడేమి చెయ్యడమే" అని దీనంగా అడిగాడు.

"ఏం చేస్తావు ? పెళ్లి చేసుకుంటావు" అని ఆలోచించ కుండా అనేసింది. "పిళ్ల మాటలు వింటుంటే ఆ అమ్మాయంటే కొంచెం భయం పట్టుకుంది" అన్నాడు అదోలా మొహం పెట్టి తువ్వాలతో నుదురు తుడుచుకుంటూ రఘు.

రాజ్యం రఘు కళ్ళల్లోకి చూసింది. 'నువ్వెందుకు భయ పడడం ? నీ దగ్గర బాగానే ఉంటుందేమో' అని సర్ది చెప్పింది అన్నగారికి.

"నిజమే నువ్వు చెప్పింది. అమ్మాయి ఎలాంటిదయినా మనలో కలిసేటట్టు నేను చెయ్యగలనన్న ధైర్యం నాకుంది అనుకో. నేను అనుకున్నదానికి భిన్నంగా జరిగితే ఏం చెయ్య టమా ? అన్న ప్రశ్న ఇప్పుడు కొత్తగా వచ్చింది" అని రఘు రాజ్యంతో అన్నాడు.

'చూడు రఘు' అంటూ తల్లి అక్కడికి వచ్చి కూర్చుంది. 'నీకు కావల్సింది ఆ పిల్లేగా ? మమ్మల్ని ఎల్లాగా అతకనివ్వదు. రాజ్యాన్ని తీసుకెళ్లకుండా ఏడిపించారనేనా నీకు అభిమానం లేకుండా పెళ్లికి సిద్ధపడుతున్నానంటే నాకు నావాళ్ల మీద ఎంత ప్రేమ వుందో తెలుస్తోంది' అంటూ కాళ్లు

జాపుకూర్చుని, కొంగుతో మెడదగ్గర విసురుకుంటోంది రఘు తల్లి.

రఘు చిరాగ్గా "నాకు ముందు ఇవన్నీ తెలిస్తే వప్పుకునేవాడినికాదు. నాకేదో తెలిసి వప్పుకున్నట్టు మాట్లాడతావేమిటి?" అని తల్లితో అన్నాడు. "చూడు పిన్నీ, అన్నయ్యాని చేసుకుంటే ఆ పిల్ల మారుతుందేమో ఇంక ఇప్పుడు మానెయ్యడం ఏం బాగుంటుంది?" అనే రాజ్యం మాటల్ని కటకటాల అవతల నిల్చున్న రాజ్యం మామగారూ, పెళ్ళి మధ్యవర్తి విని వొకర్ని వకరు చూసుకున్నారు. రాజ్యం తండ్రి వచ్చి వాళ్ళని లోపలికి తీసుకురావడంతో రాజ్యం అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

"నాకు చిన్నప్పుడు రెండో పెళ్లి చేశారని రాజ్యం పెళ్ళయ్యాక తెలుసుకున్నాట్ట ఈ పెద్దమనిషి, తెలుసుకు చేసిన ఘనకార్యం ఏమిటో తెలుసా? దాన్ని ఇప్పటిదాకా గడప తొక్కనివ్వలేదు, మరి ఏ మొఖమెట్టుకుని నాకొడుక్కాళ్ళు కడుగుతున్నాడో" అని కసిగా రఘుతో చెప్పుకుంది తల్లి.

రాజ్యం మామగారు ఏదో సమాధానం చెప్పుదామని కండువా దులుపుకున్నాడు. మధ్యవర్తి కళ్లతో వారించాడు.

రఘు తల్లికి విడిదిలోకే తెప్పించారు భోజనం. రాజ్యం కూడా పినతల్లి దగ్గరేకూర్చుంది. పెళ్ళివారి బంతిలో రాజ్యం కోసం వెతుకుతున్నాయి రంగారావుకళ్లు. హైరాన పడుతూ, శాంతమ్మ వడ్డనచేస్తూ కొడుకుని చూచింది "ఆ సామాజకం లోకే పిల్లనిపంపుతూ నా కోడల్ని తెచ్చుకోకపోవడం నాఖర్మ కాలిందేమిటి? చిన్నపనీ పెద్దపనీ చెయ్యలేక చస్తున్నాను"

అంటూ కొడుకు మీద విసుక్కుంది. "నీ కోడలేట పెళ్ళి కొడుక్కి, పెళ్ళికొడుకు తల్లికీ 'నీకూతురుమంచిది. పెళ్ళిమాని వెళ్ళొద్ద'ని నచ్చచెప్పి ఒప్పించింది" అంటూ మధ్యవర్తి రాజ్యం తల్లి వినేటట్టు గొప్పగా చెప్పాడు కాంతమ్మతో. "మా కోడలు వచ్చిందా? ఏదీ" అంటూ బంతి అంతా కలయచూసింది కాంతమ్మ.

రాజ్యంతల్లి మొదట నాలుగూ అడగాలన్న కచ్చితో కంఠం ఎత్తినా, వియ్యపురాలు సౌమ్యంగా మాట్లాడే ధోరణిని బట్టి, కంఠం సవరించుకుని, "విడిదిలో మా చెల్లెలు దగ్గరవుంది" అని చెప్పింది.

రాజ్యం వో మూల పక్క పరచుకుని పడుకుంది. "ముహూర్తం వేళ అవుతోం"దంటూ అంతా హడావిడిగా వెడుతూంటే, రాజ్యం లేచింది. అప్పటికే అందరూ ముస్తాబులు చేసుకు బయలుదేరారు. రాజ్యం, పెళ్ళికొడుకు తల్లీ తలైనా దువ్వుకోకుండా పెళ్ళికి తరలివెళ్లారు. రంగారావు హడావిడిగా వచ్చినవాళ్లకి మర్యాదలుచేస్తున్నాడు. దూరంగా స్తంభం వెనకనక్కి కూర్చున్న రాజ్యాన్ని చూసి నవ్వుకున్నా పెళ్లి హడావిడిలో ఆ మాట మరచాడు. రాజ్యం ఎప్పుడో విడిదిలోకి వెళ్లి స్నానం చేసి తండ్రికోసం ఎదురుచూస్తూ కూర్చుంది. "పెళ్లి అయింది కనక మనం కొండమీదికి వెళ్లి వద్దా"మంది తండ్రితో, ఆ మాట విన్న ఇంకో కొందరు వీళ్ల వెంట బయలుదేరారు. రాజ్యం తల్లి రాజ్యంకోసం వెతికితే కొండపైకి వెళ్లారని ఎవరో చెప్పడంతో తనతో చెప్పకుండా వెళ్లినందుకు కూతురుమీద విసుక్కుంది. రఘు స్నేహితుడు

మధ్యాహ్నం వెళ్లి పోవాలి అనడంతో కొండపైకి స్వామిదర్శ నానికి ఇప్పుడే వెడతామని రఘు తల్లికి చెప్పాడు. రఘు స్నేహితుడి కారులో బయలుదేరాడు.

"అదేమిటి? అన్నిటికి మీ ఇష్టమే. పెళ్ళిచేసుకుని వక్కడివి వెళ్ళడమేమిటంట?" అని పెత్తల్లి మందలించి పెళ్ళికూతుర్ని కూడా తీసుకు వెళ్లమంది. "అదేమిటి పిల్లని వక్కత్తినీ ఎలా పంపడం రంగా! నువ్వెళ్లరా" అని కొడుకునిపిల్చింది కాంతమ్మ.

రంగారావుకి అందులో అంతాకొత్తే. రఘూని గురించి వినడమే తప్ప ఇంతకుముందు చూడలేదు. వాళ్లలో ఇరుక్కుని కూర్చున్నాడు తల్లి చెప్పిందని.

నాగరత్నం సగం రఘు వళ్లో కూర్చున్నట్టేలెఖ్క. కారు వంపులుతిరుగుతూ పైకి వెడుతూంటే వింతగా వంగిచూస్తోంది. స్నేహితులు మాటల్లోపడ్డారు. రంగారావు ఎటో చూస్తున్నాడు. నాగరత్నం చీరకొంగు ఎగురుతుంటే పట్టుకునే ప్రయత్నంలో సతమత మవుతోంది. రఘు తలకితగిలి జుట్టును కదుపుతోంది. నుదురుమీదపడే వుంగరాల్ని వేళ్లతో జుట్టులోకి సర్దుకొంటూ నాగరత్నం కొంగుని చేతికిచుట్టుకున్నాడు. రఘు స్నేహితులు చేతులు తడుతూ గోలచేశారు. రంగారావు కూడా కొద్దిగా నవ్వాడు. రఘూ వాళ్ల ధోరణి మార్చాలని "మా రాజ్యం వచ్చివుంటే నాకీబాధ తప్పేది" అన్నాడు రంగారావుతో. నాగరత్నానికి ఆ మాటలు అంత ఇష్టంగాలేవు. మూతిముడుచుకొని కొంగుని అతని చేతిసించి విడదీసేందుకు చూస్తోంది. "మీ చెల్లెల్ని కొంచెం కదలకుండా కూర్చోమని చెప్పాలి" అంటూ రంగారావుకి చెప్పి చీరకొంగుతో నాగరత్నం చెయ్యి

నొక్కి పట్టుకున్నాడు రఘు. కారు కొండపైకి రావడంతో బస్సులో దిగే జనం గుంపుల్లా కనపడ్డారు.

కారు ఆపి అంతా బిగుసుకున్న కాళ్లని స్వాధీనం చేసుకొంటూ లోపలికి వెడుతున్నారు. లోపలికెళ్లే జనంలో రాజ్యం కనపడింది. రంగారావుకి మనస్సు తేలికయ్యింది. మళ్లా ఏమని మొక్కుకొంటుందో అనుకుని నవ్వుకున్నాడు. ఎవరో వచ్చి పిల్లనీ, జనాన్ని తప్పిస్తూ కొంచెం ముందుకి తీసుకువెళ్లారు. రాజ్యం బాగా దగ్గరగావున్నా ఎవర్నీ చూడలేదు. ఆడవాళ్ల వేపు నాగరత్నం జరిగింది. రంగారావు వకసారి స్వామిని, వకసారి రాజ్యాన్ని చూస్తున్నాడు. రాజ్యం రెప్ప ఆర్పకుండా స్వామికేసి చూస్తోంది. అర్చన పూర్తిఅయి హారతి ఇస్తున్నారు. స్వామి సజీవంగా వకసారి అందరికళ్లల్లో కదిలి నిల్చినట్టయింది. ఆడామొగా అంతా వోపక్కకి చేరి ముందుకు కదులుతున్నారు.

రాజ్యం వెనక్కి చేరాడు రంగారావు నెమ్మదిగా. హారతిచీటీ ఇచ్చింది. మళ్ళా తనివితీరా స్వామిని చూసింది. పూజారి జరగండనే అదిలింపుకి ముందుకి జరుగుతూ దేవుణ్ణి చూస్తూ వెళ్లింది రాజ్యం. ఇవతల మండపంలోనికి వచ్చి కూర్చొని తండ్రికోసం చూస్తోంది. రఘు పెత్తండ్రితో మాట్లాడుతూ రాజ్యం ధగ్గరికి వచ్చాడు. వాళ్ళతో వచ్చిన వాళ్లు అంతా అక్కడికి చేరారు.

"ఏమే రాజ్యం! మీ ఆయన ఎలాగో కష్టపడి నీ దగ్గరికి చేరితే, నువ్వు చూడనయినా చూడకపోవడం అన్యాయం సుమా!" అంటూ కొంటెగా రంగారావుకేసి చూశాడు రఘు.

కిందకెళ్లే బస్సు సిద్ధంగా వుంది. రాజ్యం తండ్రి "వెళ్ళి పోదామా" అన్నాడు. ఇద్దరికే చోటు వుండడంతో రాజ్యం, తండ్రి వెళ్లారు. రంగారావుకి బస్సులో వెళ్లాలనివున్నా, ఖాళీ లేకపోవడంతో మళ్ళీ వాళ్లలో ఇరుక్కు-కూర్చోడం తప్పలేదు. రాజ్యం తన్ను పరాయివాడిలా చూడ్డం రంగారావుకి కొంచెం కోపం వచ్చినా, ఈసారిరానీ అప్పుడు ఏడిపించా లనుకొని సర్దు కున్నాడు.

ఆ సాయంకాలం రాజ్యం, తండ్రీ వెళ్లాలని బయలు దేరితే "ఎందుకూ అందరం పోద్దున్న వెళ్ళవచ్చుగా" అని రాజ్యం తల్లి అనడంతో ఆ పూటకి ఆగిపోవలసివచ్చింది. రఘు తల్లి "పిల్లని ఇప్పుడు మనతో తీసుకువెడితే మళ్లా వాడు వచ్చే దాకా మనదగ్గర ఉంటుందా?" అని రఘు తండ్రిని అడిగింది.

"వాళ్లు రఘూనే వాళ్ళతో తీసుకెడతా మంటున్నారు. ఏదో ఒకటి తేల్చుకోండి తెల్లారి బయలుదేరవచ్చు"అని రఘు తండ్రి చెప్పాడు. రఘుకి సెలవు లేకపోవటం మూలానా, పట్నం దగ్గరకనక అక్కడికి కావాలంటే వచ్చి వెళ్ళిపోతానన్నాడు రంగారావుతో. కాంతమ్మకి ఆ సలహా చాలా సంతోషంగా వుంది.

రాజ్యం తల్లి వాళ్ళతో వెళ్లాలని బయలుదేరింది. రంగారావు వచ్చి రఘుని చెల్లెల్ని తనతో తీసుకెడుతున్నానని. రాజ్యాన్ని కూడా పంపమని రాజ్యం తండ్రికి చెప్పాడు. "తనెం దుకు వాళ్లంతా వున్నారుగా ?" అంది రాజ్యం. రఘు తల్లిని పెత్తల్లినీకూడా రమ్మని కాంతమ్మ పిల్చినా వెళ్లేందుకు సుము

ఖంగా లేకపోవడంతో రాజ్యాన్ని వాళ్లతో బస్సెక్కించి వచ్చాడు రాజ్యం తండ్రి.

రంగారావు తండ్రిపక్కన కూర్చోవడంతో రాజ్యం కేసి చూసే ధైర్యంలేక తలవంచు కూర్చున్నాడు.

రఘూకి వాళ్లు అంతా ఒకచోటే కూర్చున్నా, కొయ్య బొమ్మల్లా మాట్లాడక పోవటంచూచి చిరాకేసింది.

ఆ రాత్రి రంగారావు గదిలో రఘూకి పడక ఏర్పరచ డం, మధ్యగదిలో కాంతమ్మ సాయంత్రమే పక్క వేసుకోవ డంతో రంగారావుకి తన పడక ఎక్కడ అన్న సమస్య వచ్చింది. అవధానికి, తండ్రికీ మధ్య గదిలోనే వేశాడు రంగా రావు. కాంతమ్మ కూతురికి ఏవో రహస్యంగా చెప్పి, పాల చెంబు ఇచ్చి పంపింది. రంగారావు ఈజీ చెయిర్ మెట్ల గదిలో వేసుకుని నడుం వాల్చాడు. రాజ్యం వంటగదిలో పొడిగా వున్నచోట పక్క పరచుకుంది. కాని ఎలకల సైన్యం కిందకి దిగటంతో ముడుచు కూర్చున్నది.

తెల్లవారాక నాగరత్నం "ఇవాళ వెడతారటమ్మా, మళ్ళీ రెండు నెలల్లో వస్తారట" అని ఆగి "పోనీ నేనుకూడా వెడితే ఏం?" అని నెమ్మదిగా అంది. "అదేమిటే నిన్ను ఎల్లా పంపడం? ఇప్పుడు మళ్ళీ తొందర్లోనే వస్తానంటున్నాడుగా!" అని కాంతమ్మ అంది. మళ్ళీ బొంబాయిసించి బదిలీ అవుతే నేను ఎల్లా చూస్తానమ్మా" గారంగా అంటోంది నాగరత్నం. "నేను ఒప్పుకున్నా మీ నాన్న మండిపడతారు ఈ మాట వింటే" అంది కాంతమ్మ. "నాన్నకి నెమ్మదిగా నువ్వు చెప్పి చూడు వింటా"రంది తల్లితో.

ఇదే సమయం అని రంగారావు "అమ్మ చెప్పింది అక్షరాలా నిజం. మన యింటి ఆనవాయితి తప్పించడం మంచిది కాదు. అధమం ఓ రెండేళ్ళు కొత్త కోడలు పుట్టింట్లో వుండాలి. అల్లుడైతే ఈ లోపల ఆ గడప త్రొక్క కూడదు. కోడలయితే మరో కొన్నేళ్లు. అనాది నించి వచ్చే ఆచారం" అన్నాడు రంగారావు.

నాగరత్నం రోషంతో వక్క విసురుని లేచి కూర్చుని "నువ్వేం చెప్పనక్కర్లేదు. నాన్నమాట మీద మహా నువ్వు నడిచినట్టు చెబుతున్నావు. ఎవరికీ చెప్పకుండా ఆవిడను తెచ్చుకు కాపరం చేస్తున్నావుగా?" అన్నగారిని అని మాట రాక ఆయాస పడుతోంది.

"ఏమిటే గందరగోళం" అంటూ తండ్రి నాగరత్నాన్ని అడిగాడు. "ఏముంది మీ అమ్మాయి అల్లుడితో ఇవాళే వెడతానంటోంది. మీ అబ్బాయి మన యింటి ఆనవాయితి తప్పించక వో రెండేళ్లు వుండమని చెప్తున్నాడు" అని కాంతమ్మ చమత్కారంగా చెప్పాననుకొని నవ్వుకుంది.

"మన పిల్లల దేముందిలే? వాళ్ళ వదిన తెచ్చిన మార్పే" గోడవారగా నిల్చున్న రాజ్యం కేసి చూస్తూ నాగరత్నం తండ్రి కొద్దిగా నవ్వుతూ అన్నాడు.

"మీ నాన్న మళ్ళా మనుష్యుల ధోరణిలో పడ్డారోయ్ అబ్బాయి" అంది కాంతమ్మ. "మొదట మీ నాన్న సర్దాగానే వుండేవారు. వాళ్ళ నాన్నకి చెప్పకుండా బల్లకట్టుదాటి మా

వాళ్ళ యింటికి వచ్చే సేవారు" అంటూ తృప్తిగా ఒకసారి అందరికేసి చూసి "పోస్లే అల్లుడు వల్లనో, కోడలు వల్లనో మారడం కావాలి. ఆయన మారితే ఏం కనక? నాకు చచ్చే చిరాకు ఎక్కువయింది. అది తగ్గుతుందని నాకు తోచదు" అని తన సంగతి చెప్పడం పూర్తి కాకుండానే "ఏమేయ్ కోడలు పిల్లా! అల్లా నిల్చుని మా మాటలు వినకపోతే వెళ్ళి కుంపటి ముట్టించరాదూ" అని గంభీరంగా కాంతమ్మ మొహం పెట్టింది. రఘు వచ్చి "మీలో మార్పు మా అమ్మ వచ్చి వుంటే కలిగేదేమో" అన్నాడు.

సాయంత్రం బొంబాయి రైలుకి రఘు బయలుదేరాడు. నాగరత్నంకూడా సర్దుకూర్చుంది. రఘు వద్దన్నా వస్తానని పట్టు పట్టింది. స్టేషనుకి అంతా బయలు దేరారు. కాంతమ్మ కారు ఎక్కుతుంటే వెనుక నుంచి ఎవరో తుమ్మడంతో అక్కడే మెట్ల మీద కూలబడి "మీరు వెళ్ళండి" అని వాళ్ళకి చెప్పింది. "నాగరత్నం జాగ్రత్తేవ్" అంటూ కళ్ళు వత్తుకుంటూ, బొడ్డులో దోపుకున్న కొంగువిప్పి కొంత డబ్బు కూతురు చేతిలో పెట్టింది. రైలు కదిలేముందు రఘు ఓ కాగితం ప్యాకెట్టు తీసి రాజ్యం చేతిలో పెట్టాడు.

నాగరత్నం అదేమిటో అన్న కుతూహలంతో రఘు పక్కన ఖాళీ చేసుకు తొంగి చూస్తోంది. రైలు కదిలింది.

రంగారావు నవ్వుతూ "వెడదాం పద" అంటూ రాజ్యం భుజంమీద వేసిన చెయ్యి తండ్రివున్నాడని గుర్తుకు రాగానే తేలు కుట్టిన వాడిలా తీసేసుకుని ముందుకు నడుస్తు

న్నాడు. వెనక వచ్చే రాజ్యం తన అసమర్థతకి నవ్వుతోందేమోనని అనుకున్నాడు. స్టేషను గేటు దాటాక "బండి ఎక్కు" అని సౌమ్యంలేని మామగారి కంఠంలోంచి వచ్చిన మాట వినగానే ఉలిక్కిపడి రాజ్యం బండిలో చేరింది. మైలురాళ్ళ మధ్య ఎడంలా రంగారావు ముడుచుకు కూర్చున్నాడు. ఇద్దరి మధ్యా బండివాడు విశాలంగా జరగడంతో రాజ్యం హద్దుదాటి రంగారావుకి దగ్గరయింది తన ధైర్యం ప్రదర్శిద్దామన్న ఆలోచన పూర్తి కాకుండానే బండివాడి ఆజ్ఞతో తండ్రి దగ్గరకి జరిగాడు రంగారావు.

ఇల్లు వచ్చేసినందుకు తండ్రి ఆనందంగా దిగాడు.

"అప్పుడే వచ్చిందే" అన్న మెరపు రంగారావు మొహంలోకి వచ్చి మాయమయింది.

రఘు, నాగరత్నం మాటలు ఎల్లా మొదలు పెడతారో అని వూహించుకుంటూన్న రాజ్యానికి అప్పుడే అంతరాయం వచ్చినందుకు విసుగు మొహంలో కదిలింది.

మామగారు ముందు మేడపైకి వెళ్ళారన్న ధైర్యంతో, వయ్యారంగా కొంగు జరుపుకుంటూ చీకట్లో నెమ్మదిగా మెట్లు ఎక్కుతోంది రాజ్యం.

మెట్ల మలుపు దగ్గర రాజ్యం చెవి పట్టుకు ఆపి "ఇప్పుడు ఏమనుకుంటున్నట్టు నన్ను గురించి" అన్నట్టు రాజ్యం కళ్ళల్లోకి చూశాడు రంగారావు.

దూరంగావున్న వీధి దీపం ఇచ్చిన కాంతి రాజ్యం కళ్ళ మీదికి కొద్దిగాచేరి "ఇంత పిరికివారా" అన్న ప్రశ్న మెరిసినట్టు

అయింది రంగారావుకి. "నిజమే తనకి అన్నీ వున్నాయి ఏం లాభం ఇంకా కొంచెం చొరవ, ధైర్యం వుంటే ఎంత బావుండునో" అని నిట్టూరుస్తూ రాజ్యం వెనక నడుస్తూ మేడపైకి చేరాడు రంగారావు.



# కొత్త చోటైనా పాత మనుషులే



పద్మకి భర్త రాఘవరావు వచ్చి చెప్పినవార్త విన్న దగ్గరనించీ, సంతోషంతో మనస్సు రకరకాలుగా పురకలు వేస్తూంది.

ఎక్కువసేపు మనస్సులో నిలుపుకోలేక పక్కయింట్లో కాపరమున్న శ్యామల్ని పిల్చి, మావారికి ప్రమోషనుతో ట్రాన్స్‌ఫర్ అయిందో అనిచెప్పి, పమిటకొంగుతో మొహం తుడుచుకుంది. ఆ, ఇన్నేళ్ళ సర్వీస్‌వుండి ఇప్పటికి రావటం ఏమంత గొప్పకాదులే! మా బావ రాత్రే చెప్పాడు. మీ ఆయన్ని పంపేచోటికి అతన్ని వెళ్ళమంటే, నాకు ప్రమోషను వద్దు ఏమీవద్దు నన్ను ఇక్కడినించి కదపవద్దని బతిమాలుకున్నాట్ట అని అక్కసు వెళ్ళబోసింది, శ్యామల. ఎందుకు చెప్పేనా ? అని మనస్సు చివుక్కుమని, వస్తానంటూ లోపలికి వెళ్ళిపోయింది పద్మ. రాఘవరావు స్నేహితులు ఒకరొకరే వచ్చి సంతోషాన్ని వెళ్ళబోస్తూన్నట్టు మాట్లాడి, పార్టీ ఎప్పుడంటూ కాఫీ కప్పులు ఖాళీచేస్తున్నారు.

క్లబ్‌కి వెళ్ళాలన్న ఆత్రంతో ఇంటికి వచ్చేవాళ్ళమీద విసుక్కుంటోంది పద్మ. చూడు, ఈ నాలుగురోజులు వచ్చేవాళ్ళని భరించటం తప్పదు, కనుక ఎవర్నయినా వంటకి పెట్టరాదూ ? అని రాఘవరావు పద్మని సముదాయిస్తూ అన్నాడు. మరే, మనంపిలిస్తే వద్దామని సిద్ధంగా కూర్చున్నారు వంట

వాళ్లు. మీ మాటలన్నీ ఇల్లాగే వుంటాయి అంటూ మళ్ళీ కాఫీతో కప్పులునింపి, రాఘవరావుకిచ్చి పంపింది.

ఎల్లాగో తెములుచ్చుకు క్లబ్బు ఆవరణలోకి చేరుకుంది పద్మ. వరండాలో వెలిగే దీపంకాంతి గేటుదగ్గర చేరేసరికి చీకటి కలుపుకుంది. హాల్లో దీపాలు అద్దాల తలుపులోంచి మసగ్గా కనపడుతున్నాయి. వేపచెట్లు తలలూపుతున్నాయి. ఎంతో నిశ్శబ్దంగావున్న హాల్లోంచి వక్కసారి చాలా కంఠాలు పై స్థాయిలో మొదలుపెట్టాయి ఘర్షణ.

గుమ్మంలో నిల్చుని అందర్నీ తెల్లబోయి చూస్తోంది పద్మ. పేకముక్కలు విసిరివేసినవి, బల్లలకిందకి చేరి దాక్కుంటున్నాయి. చెప్పి ఆనందిద్దామనుకున్నకోరిక ఆ వాతావరణంలోకి రాగానే మనస్సులోనే మరుగుపడింది. క్లబ్బు శెక్రటేకి కమిటీ మెంబర్లకి మధ్య వివాదం ఎక్కువయింది. కొందరు పద్మదగ్గరకి వచ్చి చెప్పుకుంటున్నారు, ఎంత అన్యాయం జరిగిందో ! పోనీ ఆ ఆట లేదు అనుకుని మళ్లీ కొత్తగా మొదలు పెట్టక పోయారా ? అని పద్మ వాళ్లతో అనటం క్లబ్బ శెక్రటీ విని–

మహా తీర్పు చెప్పావులే అంతా నకరకం జట్టుకనకనే నీ దగ్గర మొరపెట్టుకుంటున్నారు. వోర్చలేనిగుణాలు అని కంఠము బిగపెట్టుకు వూపిరితియ్యకుండా అనేసింది కసిగా క్లబ్బు శెక్రటీ. కమిటీ మెంబర్లలో వకామె కొంగు దోపుకు కొద్దిగా ముందుకువెళ్లి మీరు చాలా అమర్యాదగా మాట్లాడారు. మొదట మా అందరికి అపాలజీ ఇచ్చితీరాలి, అని శెక్రటీని గదమాయించింది. నాకు అవసరంలేదు ఇవ్వనని ఆమె, ఇచ్చి

తీరాలి అని ఈమె వాదన పెరిగి క్లబ్బు ప్రెసిడెంటుని పిలిపించే దాకా జరిగి ఆవిడ రాకతో ఇద్దరూ, రెండోవాళ్ళదే తప్పు అని తోచే సమర్థతతో చెప్పుకున్నారు. శ్రక్రటీని మీరు కొంచెం తొందరపడ్డారనిపిస్తోంది అని, ఎవరము సర్దుకున్నా పోయేది అని కమిటీ మెంబర్సుతో రాజీగా చెప్పింది ప్రెసిడెంటు. ఆవిడ అపాలజీ ఇచ్చితీరాలని అంతా గట్టి పట్టుపట్టారు. శ్రక్రటీ కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ, ఛీ, ఇంక ఈ క్లబ్బుకి శ్రక్రటీగా నేను వుండనని చెపుతూ అసలు అంతా పద్మనించే ఇంతవరకూ వచ్చింది. ఇవాళ ఆవిడ మొగుడుకి పెద్ద పదవి వచ్చిందనేగా మీరంతా ఆవిడదగ్గర మొరపెట్టుకోవటం, ఇన్నాళ్ళు లేని మర్యాద వక్కసారి మీ అందరికీ పుట్టుకొచ్చింది. మా ఆయనకి వాళ్ళకీ వీళ్ళకీ చాకిరీలు చెయ్యటం, కూరలు మొయ్యటం రాదు, వస్తే ఆయనా ఆఫీసరయ్యేవారు అంటూ మొహం వికృతంగా తిప్పుకుంటూ అనేసింది శ్రక్రటీ.

పద్మ వుత్సాహం అంతా నీరుకారినట్టు అయింది. ఆరోజు లేచినవేళ ఎంత మంచిదో అని ముందు మురిసినంతసేపు పట్టలేదు. తన సంతోషం ఎవరితో చెప్పుకుందామన్నా వాళ్లే ఈర్ష్య వెళ్ళపొయ్యటంతో పద్మ సంతోషం దుఃఖంగా మారింది.

క్లబ్బు ప్రెసిడెంటు మాకు చెప్పనేలేదే మీ వారికి ప్రమోషను వచ్చినట్టు, అంటూ చాలా సంతోషం అని పద్మ వీపు చేత్తోరాస్తూ అబ్బే అల్లాకష్టపెట్టుకోకండి, ఆవిడ మాటలకేం, అయినా మీరు బొత్తిగా సభ్యత లేకుండా మాట్లాడారంటూ శ్రక్రటీని మందలించినట్లు మాట్లాడింది. పద్మ వాళ్ళ

అందరిదగ్గర సెలవుతీసుకు ఇంటికి చేరేసరికి రాఘవరావు సామాన్లన్నింటినీ మధ్యగాపోగు పెడుతున్నాడు. పద్మని చూడకుండానే ఏమిటీ ఇంతసేపు చెప్పుకోవాలా ఖబుర్లు అని అడిగాడు.

పద్మదగ్గరనించి సమాధానం రాకపోవటంతో వెనక్కి తిరిగి చూశాడు. ఏం? స్నేహితుల్ని విడిచి వెళ్లాలని విచారమా? చిత్రమే, మీ ఆడాళ్ళు వకచోట వుంటే వకళ్ల మీద వకళ్ళు చెప్పుకోవడమో, లేక తగూలు పెట్టుకు మాటలు మానుకోవడమే లేకపోతే, అందరికంటే అతీతులమన్నట్టు నోరు తెరచి ఎవరితోనూ మాట్లాడకుండా విడిగావుండటమో జరుగుతుంది. తీరా అందులో వక్కళ్లుదూరంగా వెళ్ళిపోతున్నారంటే కొందరి కళ్లయినా చెమ్మగిల్లుతాయి. అవునా? అంటూ పద్మ దగ్గరికివచ్చి వంచినతల పైకి ఎత్తి కళ్లల్లోకి చూశాడు రాఘవరావు.

అబ్బే అటువంటిదేమి జరగలేదు అంటూ కళ్లు తుడుచుకుని క్లబ్బులో జరిగినదంతా చెప్పింది పద్మ. ఆవిడ ఎల్లాగా ఏడుస్తోందిగా, ఇంక నువ్వు ఏడవకూడదు ఆవిడన్నవాటికి. సరే కానీ ఇంకోమంచివార్త మన డాక్టరు స్నేహితుడు వచ్చాట్ట. వాళ్ల చుట్టాలింట్లో వోవాటా ఖాళీ అయిందని, అది ప్రస్తుతం ఇంకా ఎవరికీఇవ్వ లేదనీఅన్నాట్ట. ఇతనేమంటాడంటేమనసామాన్లు లారీలో అతనితో పంపితే అతనే సర్దిస్తాడంటాడు. దానికే ఈ హడావిడి అని చెప్పాడు రాఘవరావు. అన్నింటికీ తొందరెక్కువ బాబూ మీకు. ముక్కూ మొహం ఎరగనివాడితో సామాన్లు పంపటమేమిటి? అని విసుక్కుంది పద్మ.

డాక్టరు ముక్కు ఎరుగుదుంగా అంచేత నాకేం భయం లేదు అన్నాడు రాఘవరావు, నవ్వుతూ. కొన్ని సామాన్లు తగ్గించాలి అనివకరు దూరంగా పెడితే ఇంకొకరు కావాలంటూ మధ్యకి చేరవేస్తూ, చాలాసేపు గడిపారు. డాక్టరు రాకతో ఇద్దరూ వకమాటికి నచ్చారు. సామాన్లతో లారీ బయలుదేరే సరికి తెల్లారవచ్చింది.

పెళ్ళివారు వెళ్ళిన ఇల్లులా బోరుమంటోంది. ఇంకా వెళ్ళేందుకు సావకాశంవున్నా, రెండురోజులు ముందే వెడదామని పద్మ పట్టుపట్టడంతో రాఘవరావు వప్పుకోక తప్పలేదు. మిగిలిన సామాన్లు డాక్టరింట్లో పెట్టి ఆరోజు బయలుదేరారు. డాక్టరు చుట్టానికి వీళ్ళని కలుసుకోమన్నవార్త ముందే తెలియ పర్చటంతో, ఇల్లు వెతుక్కునే బాధ కొంత తగ్గిందికూడా. తెచ్చిన సామాన్లు పైకి చేర్చుకుంటూంటే పక్కవాటాల్లోంచి చూసేకళ్లు ఆశ్చర్యాన్ని వెళ్ల బెడుతున్నాయి. పద్మని మేడపైకి పిల్చుకువెళ్లి వాళ్ల భాగం చూపెట్టాడు. ఇంత సామాను ఈ వాటాలో ఇముడుతుందా ? అని భయపడింది పద్మ. ఇల్లు చిన్నదయినా హంగులు చాలా వుండటంతో అన్నీ సర్దేసరికి ఇల్లు విశాలంగావున్నట్టే తోచింది. చాలాకాలంగా మర్చిపోయిన కూరల సంచీ రాఘవరావు చేతికి వచ్చింది. డాక్టరు స్నేహితుడు తరుచు వచ్చి యోగక్షేమాలు కనుక్కుని వెళ్ళటం కొంత సాయంగావున్నది. పద్మకీ, రాఘవరావుకీ ఏదో బెంగగానేవుంది. భాషతో కొంత ఇబ్బంది పడ్డా ఎల్లాగో అలవాటుపడాలని వకరికొకరు ధయిర్యం చెప్పుకుంటూ గడుపుతున్నారు. పద్మకి తలుపులు వేసుకు గదిలో కూర్చోటం, కిటికీ

లోంచి దూరంగా కనపడే కొండ లోయల్ని చూస్తూంటే కాలం జరిగి, పొద్దు జరిగి కొండ కిందకి దిగటం, రాఘవరావు వచ్చే అలికిడికి, తలుపులు తెరవటం నిత్యకృత్యాల్లో వకటిగా అయింది.

ఆ రోజు రాఘవరావు కూడా కొందర్ని తీసుకురావటం చూసి, పద్మకి ముందు కొంత ఆనందం కలిగింది. పద్మకి వచ్చిన వాళ్ళని ఫలానాఅని రాఘవరావు పరిచయంచేసి బట్టలు మార్చేందుకు లోపలి కెళ్ళాడు. అందులో కొద్దిగా వయస్సు మళ్ళిన ఆయన బట్టతల చేత్తో రాసుకుంటూ, మనం దూరంగా వుండబట్టి కానీ చాలా దగ్గరవాళ్ళంకాదూ ? అంటూ సంభాషణలోకి దిగాడు. రాఘవరావు అక్కడికి రావటంతో పద్మ వంటగదిలోకి వెళ్లింది. పద్మ పళ్ళాల్లో ఫలహారాలు సర్దుతుంటే అంతా ఇల్లుచూస్తూ అక్కడికి చేరారు. మీకు ఇంత తొందరగా ఇల్లు ఎల్లాదొరికిందండీ అంటూ వుసూరుమన్నాడు అందులో వకాయన. ఎందుకు దొరకదండీ? అసలు వీళ్ళకోసం ఒక ఇల్లు చూసిపెట్టాను. వీళ్లు నాదగ్గరికి అసలు రాకపోయేసరికి వద్దని చెప్పేశాను అని ఇంకోఆయన సమాధానం ఇచ్చాడు. మాకు చూడమంటే ఇంకా చూస్తూనేవున్నారు కాదా ఎక్కడోవున్నట్టు చెప్తారేమిటే ఖబుర్లు అని కొద్దిగా కసిరాడు. మీకు ఏ ఇల్లు చూపించినా నచ్చదాయె అందుకే మీకు ఇల్లు దొరకటంలేదు. ఆమధ్య మీరు చూసిన ఇల్లు వీళ్ళు ఇద్దరే కనక సరిపోతుంది. చూపించి ఇది మీకు బాగుంటుందేమో, చూడండి అంటూ వో సలహా పడేశాడు. రాఘవరావు ఆ సంభాషణ మార్చుకోవాలని, ఆయనకి నచ్చని ఇల్లు

మా కెందుకండీ ? పైగా మేము ఇంతకంటే మంచిఇల్లు అయితే తప్ప అసలు ఖాళీ చెయ్యమని తేల్చి చెప్పేశాడు.

అది రైటే అనుకోండి. ఆ ఇంటికి మార్కెట్టు పక్కనే వుంది. ఎక్కడికి కెళ్ళాలన్నా ఐదునయాపైసలు టిక్కెట్టు. అన్ని బస్సులూ అక్కడే బయలుదేరటం. మనవాళ్లు నలుగురూ కన పడతారు, అంటూ రెండో ఆయన చెప్పివొప్పించేందుకు ప్రయత్నించాడు. అబ్బే, అటువంటి సౌకర్యాలతో అంతపని లేదు మాకు. మా ఆవిడకి అట్టే ఎక్కడికీ వెళ్ళే అలవాటులేదు. కూరగాయలు ఇప్పుడు ఇంటికే వస్తున్నాయి. నాకు బస్సుల దగ్గర కాచుకు నిల్చునే వోపిక లేదు చెప్పద్దూ అంటూ రాఘవరావు అనేశాడు.

ప్లేట్లు మళ్ళా నింపుకుంటూ ఈవూళ్లో ఎవరూ ఇంటిని అంటుకూర్చోరమ్మా, సాయంకాలం అయ్యేసరికి ఆడవాళ్లు ఎంతో ముచ్చటగా బైటకి వెడతారు. మా ఇళ్ళల్లో కూడా అంతా వెడతారు అంటూ నాగరికత లక్షణం బయట పెట్టాడు మొదటి ఆయన. మనవాళ్లంటే ఈ భాషకి అలవాటు పడ్డారు, ఎక్కడికెళ్ళినా నెగ్గుకురాగలరంటూ ఇంకోఆయన వాళ్ళ ఘనత చెప్పాడు. అంతా వెళ్లేందుకు సిద్ధపడి వాళ్ల ఇల్లు ఎక్కడ వున్నాయో చెప్పి, తెలుసుకోవటం ఏమీ కష్టంవుండదు, ఆ వీధిలో ఎవర్ని అడిగినా చెప్తారు అని మళ్లా ఇంకోసారి ప్రతిభ బయట పెట్టుకున్నారు. వాళ్లనిపంపి, రాఘవరావు తలుపువేసుకుని మధ్యాన్నం పట్టుకున్నారు అంటూ పద్మతో చెప్పి నవ్వుకున్నాడు.

వాళ్ళవరస నాకేం నచ్చలేదు. వోమూల ఇల్లు చూసి వుసూరుమంటూనే ఆ ఇల్లుచూడండి ఈ ఇల్లు చూడండి అని సలహా ఏమిటి ? ఏదోచెత్త కొంపమనకిచూపించి ఈఇల్లు వాళ్లు పుచ్చుకోవాలని కాబోలు. మీరు మాత్రం ఈ రకంవాళ్ళని పిల్చుకరాకండి బాబూ అంటూ విసుక్కుంది పద్మ.

ఓసి పిచ్చిదానా వాళ్లు చెప్పినంతమాత్రాన మనం ఎల్లాగూ మారేది లేనప్పుడు బెంగ ఎందుకు ? అప్పుడప్పుడు నలుగురితో కలుస్తూవుండాలి, మనుష్యులికి దూరంగా వుండేందుకు ప్రయత్నించకూడదు అంటూ పద్మకి బోధించాడు రాఘవరావు. మళ్ళీ కొన్నాళ్లు నిశ్చింతగా కాలం జరిగింది. రాఘవరావు అఫీసుకు వెళ్లాక పద్మపనులు పూర్తిచేసుకు పడుకునేప్రయత్నంతో, వేసిన ఘడియలే మళ్ళీ చూసుకునేందుకు ముందుగదిలోకి వెళ్ళింది. కిటికీదగ్గర నాలుగుతలలు వకరికంటె వకరు ముందుకు వంచుతూ తొంగి చూడటం చూసి, ఎవరో అర్థంకాక తెల్లపోయి చూస్తూవుండిపోయింది పద్మ. అందులో వెనకనిల్చున్న ఆవిడ కంఠము సవరించుకుంటూ రాఘవరావు గారు వున్నారా ? అని అడిగింది.

లేరంటూ పద్మతల అడ్డంగా తిప్పివూరుకుంది. అందులో పళ్లు ఎత్తావిడ పెదిమముందుకీ వెనక్కి జరుపుకుంటూ, తలుపు తెరవటమే తడువుగా అంతాలోపల సోఫాల్లో విశాలంగా జార్లపడుతూ కూలపడి, అబ్బా ఎంతవుక్కగా వుందండీ అంటూ జాకెట్లలోకి వూదుకుంటూ పైకి ఫేనుకోసం చూస్తున్నారు. పద్మకి ఫేను పెట్టాలని లేకపోయినా తను పెట్టకపోయినా వాళ్లే పెట్టుకునేట్టున్నారు అనుకుంటూ స్విచ్ వేసింది.

పళ్లుఎత్తు ఆవిడ జరిగిన పమిటని పూర్తిగాతీసి మళ్లా వేసుకుంటూ, మనము ఎవరమో ఆవిడకి తెలిసినట్టులేదు. మీారు చెపుతారా నన్ను చెప్పమంటారా, అని పెద్ద జరీ చీర కట్టుకున్న మెల్లకన్ను ఆవిడని అడిగింది. జరీఅంచు సవరించు కుంటూ ఈపాటికి ఆవిడ గ్రహించే వుండవొచ్చు. ఆ మధ్య మీావారు బలవంతంగా మావారిని, వాళ్ళ వాళ్ళని తీసుకొచ్చారుట అంటూ మెల్లకన్నుని వయ్యారంగా తిప్పుతూ పెదిమలు తడుపుకుంటూ పద్మకళ్ళల్లోకి చూసింది. వచ్చే ఆవలింతల్ని చిటికెలతో ఆపుతూ, ఆమధ్య ఎవరో రానటం వచ్చారు. అంత వివరంగా ఎవరు ఎవరో తెలుసుకోలేదు. అన్న పద్మ సమాధానం విని వచ్చినవాళ్ళు వకర్ని వకరు చూసుకున్నారు.

అప్పటిదాకా మాట్లాడకుండా నాజూగ్గా సోఫాకిఅతుక్కు కూర్చున్న ఆవిడ ముందుకు వంగి చెంపముంగురులు ఎక్కడ అతుక్కున్నాయో అని చేత్తో రేపుకుంటూ కొద్దిగా నవ్వు మొహంలోకి తెచ్చుకుని కులుకుతూ, ఆరోజు వచ్చిన ఆఫీసరు గారి భార్య ఆవిడే అంటూ జరీచీర ఆవిడ కేసి చూపించి, మేము ఇక్కడికని రాలేదు. మాతో హిందీ చదివే అమ్మాయి ఈ పక్కవీధిలో వుందిలెండి. ఆవిడ టీకి పిలిస్తే వచ్చాము. అక్కడదాకా వచ్చాముకదా మీా ఇల్లు చూసి పోదామని వచ్చాము అంటూపూర్తిచేసి నూపిరిగట్టిగా తీసుకుంటూ మళ్ళా వెనక్కి చేరింది. జరీచీర ఆవిడ అంతకుముందు కళ్లు తిప్పటం, మూతి తిప్పటమే జరిగింది. ఇహ తలకూడా వోలయగా వూపుతూ మీారు ఎప్పుడు ఖాళీచేసేదీ చెపితే మేము ఎల్లాగో సర్దుకు వుం

డేందుకు ప్రయత్నిస్తాము అని పద్మకి చెప్పి, కొంగుజరీ నడుం చుట్టూ సరిచేసుకుంటోంది.

అబ్బే మేము ఎవరితోటీ ఖాళీచేస్తామని, ఖాళీ చెయ్యాలనుకుంటున్నామని కానీ అనలేదే అని పద్మ చెప్పటం విని గుండ్రంగా పచ్చగావున్న ఆవిడ ఎర్రజా కెట్టు పక్కన వంటిమెరుపు వారకంటచూసుకుంటూ, మీరన్నారని మేము మాత్రం అన్నామా? మిమ్మల్ని నలుగురులోకి తీసుకెళ్లాలని మా వుబలాటం. మా ఇంటిపక్కన మేడమీద రెండు గదులూ వరండావుంది. చాలా బాగుంది. మీ ఇద్దరే కనక హాయిగా వుండవచ్చు. మా వారు అప్పుడే ఇంటివాడితో మాట్లాడేశారు కూడాను అంటూ విశదం చేసింది. ఈ సారి పద్మకి కోపం నిజంగానే వచ్చింది.

మీ వారుపాపం ఎందుకు అంత శ్రమపడుతున్నారో మరి! మాకైతే ఇల్లు అక్కర్లేదు. పోనీ వాళ్ళని వుండమనరాదూ? అని జరీచీర ఆవిడని చూపించింది పద్మ. సరే వాళ్లకి చాలదు కనకనే మిమ్మల్ని అందులోకి మార్చటం అంటూ బైట పెట్టింది గుండ్రటి ఆవిడ.

అదేమన్న మాటండీ! వాళ్ళకోసం వీళ్లకి చెప్పామా అంటూ కళ్లతో బెదిరించింది నాజూగ్గావున్నాననుకునే ఆవిడ. ఇంకెందుకూ వెడదాము పదండి అంటూ జరీచీర ఆవిడ విసురుగా లేచినిల్చుంది. పద్మలోపలి కెళ్లటంతో అందరికళ్లూ మూతులూ సైగలతో తిప్పుకుంటూ తీర్మానించుకోవటం పక్క గదిలోంచి చూసింది పద్మ. కాఫీ కప్పులు బల్లమీద పెట్టడంతోనే చెప్పకుండా తీసుకున్నారు అంతా. మళ్లీ ఏం మాట్లాడేందుకూ తోచనట్టు అటూఇటూ చూసి, పళ్లు ఎత్తు ఆవిడ

ఆరంభించింది. ఈ పక్క వీధిలో వో తెనుగు కుటుంబం వుంది కానీ ఆవిడతో ఆట్టేపెట్టుకోకండి నోరుమంచిదికాదు. అయినా నేను చెప్పివుండకూడదేమో అనుకుంటూ కొంగుతో మూతి తుడుచుకుని వెనక్కి జరిగి కూర్చుంది.

పాపం ఆవిడకి అట్టేఎక్కడికి వెళ్లటం అలవాటే లేదుటలే, వాళ్లవారు చెప్పకుబాధ పడ్డారుట, అంటూ పెదిమలు తడుపుకుంటూ నాజూగ్గావున్న ఆవిడ పద్మమీద సానుభూతి ప్రకటించింది. వాళ్లగొడవ మనకెందుకు లెద్దురూ మనంవచ్చిన పని కానేలేదు. మీరుఎప్పుడూ ఇలాంటివే చెపుతారు అంటూ జరీచీర ఆవిడ గట్టిగానే కసిరింది మిగిలిన వాళ్లని.

బయలుదేరిన వాళ్లకి పనిమనిషి మెట్లదగ్గర ఎదురవటంతో వాళ్లబాషా పాండిత్య ప్రదర్శన మొదలు పెట్టిదానికి ఏం చెప్పారో ఆ ఫలితంగా ఆ మర్నాటినించీ అదిచేసేపని తగ్గించి టీ ఇంకా కలపలేదా అని అడగటం దగ్గరికి వచ్చింది. రాఘవరావు పద్మ బజారు సరుకులకని బయలుదేరటం, అదేమొదలు కావటంచేత అక్కడకొన్నీ, ఇక్కడకొన్నీ కొనుక్కు ఇంటికి బయలుదేరుతూ అక్కడ వాళ్లని గురించి మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ వెళ్లటం, వెనకవచ్చే ఆవిడకి కూడా నవ్వు వచ్చి ఎక్కడ వుంటున్నారేమిటి మీరు అంటూ పద్మవీపుతట్టి అడిగింది. సామాన్లు టాక్సీలో పెడుతూ పద్మ సమాధానం ఇచ్చింది.

ఆవిడ తమ ఇల్లుకూడా ఆ ప్రాంతంలోనే వుందనిచెప్పి, ఎప్పుడయినా రమ్మని వెళ్లిపోయింది.

ఆ రోజు రాఘవరావు ఆఫీసుకి వెళ్లకమునుపే పద్మ కడుపునెప్పి, జ్వరంతో మూలుగుతోంది. రాఘవరావు

తొందరగా వచ్చేస్తానని చెప్పి ఆఫీసుకి వెళ్లాడు. వెళ్లినదగ్గరనించీ పద్మకి వాంతులు పట్టుకున్నాయి. మనస్సు పరిపరి విధాల పోతోంది. చాలానీరసంగా మూలుగుతూ సాయంత్రం దాకా తను బతికి వుండనేమోనన్న అనుమానంతో పద్మకి ఏడుపు ఆగటంలేదు. వీధితలుపుచప్పుడు అవటం వినపడింది. నెమ్మదిగా వెళ్లి తలుపు తెరచి అక్కడే కింద కూలపడి నిస్సహాయంగా చూస్తోంది పద్మ. ఆరోజు టాక్సీస్టాండులో చూసినఆవిడ వెతుక్కుంటూ వచ్చింది. పద్మని పలకరించి, అయ్యో మేము ఇంత దగ్గరలో వున్నాంకదా ? ఓ మాటచెప్పి పంపితే ఏం? అంటూ తలుపులేసి పద్మని తీసుకువెళ్లింది.

రాఘువరావు వచ్చేసరికి పద్మకి పర్యలుచేస్తున్నా విడని చూసి ముందుగుర్తుపట్టలేదు. సమయానికి దేవతలా వచ్చారు ఆవిడ అంటూ నీరసంగా మొదలు పెట్టింది వుపోద్ఘాతం పద్మ రాఘువరావుతో.

సరేలెండి ఇప్పుడుకాదు మీరు చెప్పాల్సింది అంటూ ఆవిడ మందలించి రాఘువరావుకి మందులు ఎప్పుడు ఇవ్వాలో చెప్పి అవసరమవుతే తన్ని పిలవమని చెప్పివెళ్లిపోయింది.

పద్మ రెండురోజుల్లో తేరుకుంది. ఆవిడ రోజుకి రెండు మూడుసార్లు వచ్చి కనుక్కుంటూ కావల్సినవన్నీ అమరుస్తూ చాలా సన్నిహితురాలయింది. పనిమనిషికి కూడా నచ్చచెప్పి అన్నీ చేసేటట్టు చేసింది. పద్మ మనసులోనే ఎన్నోసార్లు కృతజ్ఞత తెల్పుకుంది.

రాఘువరావు మొదట వున్నంత చనువుగా ఆవిడతో వుంటంలేదు. పైగా వకటి రెండుసార్లు ఆవిడని విమర్శిస్తూ

మాట్లాడ్డం పద్మకి కష్టంగా తోచింది. ఆవిడ ఇప్పుడు రావటం తగ్గించింది. ఒకరోజు రాఘవరావు మొదట్లో వచ్చిన వాళ్లల్లో ఇద్దర్ని వెంటపెట్టుకు వచ్చాడు.

పద్మనిపిల్చి నువ్వు ఆవిడనుగురించి ఎంతమంచిగా చెపుతున్నావో, అంత చెడ్డదిట ఆవిడ అంటూ లోపలికి వెళ్లాడు.

అబ్బె వట్టి చండాలంమనిషి అండీ. ధర్మరాజులాంటిభర్త. ఆయన్ని పెట్టే తిప్పలు, ఇన్నీ అన్నీ కావనుకోండి. అత్తా మామా వున్నారు వాళ్లని గడప తొక్కనివ్వదు. అని ముక్కుపొడుం పీలుస్తూ చెప్పాడు బొల్లు తల ఆయన.

ప్రతి ఇంట్లో ఏదో గొడవలు వుంటూనే వుంటాయి. వాళ్ల సంసారం గొడవ మనకెందుకులెండి. మేముఎవరో ఏమో తెలీకపోయినా నిజంగా సొంత వాళ్లకంటే ఎక్కువగా చేసింది నాకు. ఆరోజు ఆవిడ రాకపోతే ఏమయ్యేదానో్న అంటూపద్మ చెప్పింది.

అదే ఇప్పుడు చెప్పేది మేము. చేస్తుంది ఏంలాభం? గొప్పకోసం మీఇద్దర్ని గురించీ ఇన్ని చెపుతోంది. వినలేక పోయాననుకోండి అంటూ రెండో అతను వంతపాట మొదలు పెట్టాడు.

రాఘవరావు అక్కడికి రావటంతో రెండో అతను కంఠము పెద్దదిచేసి చెప్పటం మొదలుపెట్టాడు. మీరు చాకిరీ చేయించుకుని కృతజ్ఞతకూడా చెప్పలేదుట. ఒకటేమిటి ఎందుకు లెండి అవిఅన్నీను అంటూ నసగటం మొదలుపెట్టాడు. నిజమే. మాది ఆవిషయంలో తప్పే. మేము వెళ్లి చెప్పి వుండాల్సింది అని పద్మ నొచ్చుకోవటంతో ఇంక ఆ సంభాషణ పెరగలేదు.

కడుపునిండాక పద్మతో కూడా వెడతామని చెప్పి మీరు ఇంతదూరంగా వుంటే ఇల్లాంటి ఇబ్బందులు వుంటూనే వుంటాయి. మా పేటలో వుంటే ఎవరో వకరు మీ ఇంట్లోనే వుండేవారు. ఇప్పుడైనా మించిపోయింది లేదనుకోండి. ఏదయినా ఖాళీఅవగానే వద్దురుగాని అన్నాడు మొదటిఆయన.

పద్మ అప్రయత్నంగా ఆఫీసరుకి ఇల్లు దొరికిందా అని అడిగింది. ఆప్రశ్నకి ఇద్దరిదగ్గరనించి వెంటనే జవాబురాలేదు. కొంతసేపయ్యాక తేరుకుని ఆవిడ చెప్పిందేమిటి ? వాళ్ల కోసం ఈ ఇల్లు మిమ్మల్ని మారమంటున్నామా అని ఇద్దరూ వక్కసారి పద్మని అడిగారు.

అబ్బే ఆవిడేం చెప్పలేదు, పైగామీరు వచ్చినట్టు నేను చెప్పలేదుగా ? అంది పద్మ. రైటు ఆవిడదగ్గర అల్లాగే వుండాలి లేకపోతే బతకనివ్వదు. అసలు నాపేరు చెపితే ఈ చుట్టుపక్కలికిరాదు. ఈసారి చెప్పిచూడండి మీకే తెలుస్తుంది అని రెండో అతను పట్టు చేతులుముందుకీ వెనక్కీ జరుపుకున్నాడు.

వాళ్లు వెళ్లాక పద్మకి ఏమిటి ! వీళ్లుచెప్పింది నిజమేనా! అన్న అనుమానం మొదలయింది. రాఘవరావు నిశ్చింతగా ఈజీ ఛైరులో కూర్చుని పుస్తకం తిరగేస్తున్నాడు. పద్మ మాటలు మొదలుపెట్టింది. వీళ్లుచెప్పింది నిజమంటారా? ఏమో? అన్నట్టు పెదిమ విరిచాడు రాఘవరావు. మాట మారుస్తూ నాకోటు జేబులో వుత్తరాలు వున్నాయి పట్టుకురా అని చెప్పాడు.

పద్మ ఉత్తరాలు చదువుతూ మళ్ళా ఇంత తొందర్లో బదిలీయా ? అని ఆశ్చర్యంగా మొహం పెట్టింది. ఏం ? నీకు ఇష్టంలేదా అని అడిగాడు రాఘవరావు. ఎవరికీ చెప్పక ఇంటి

కోసం ప్రాణంతీస్తారు. ఆ వచ్చే అతనికి ఇస్తేనే మనకి అక్కడ ఇబ్బంది వుండదు అంటూ మళ్లీ పుస్తకం పేజీలు తిప్పుతున్నాడు. మర్నాడు రాఘవరావు ఆఫీసుకు వెళ్లగానే పద్మ పని పూర్తిచేసుకు పక్కవీధిలో ఆవిడ ఇంటికి వెళ్ళింది. ఆవిడ చూసినా చూడనట్టు వూరుకోవడంచూసి పద్మ మనస్సు చిన్న పుచ్చుకున్నా, తనే పలకరించి మీరు చేసిన సాయం ఎప్పుడూ మరవలేను అంటూ కృతజ్ఞత చెప్పి, వెడతానని బయలుదేరింది.

ఏదో వంటరిగా అవస్తపడుతూంటే చూడలేక వచ్చా తప్ప నాకేదో మీ దగ్గరనించి వచ్చి వరుగుతుందని రాలేదు. అయినా తెనుగువాళ్ళతో ఎప్పటికప్పుడు పెట్టుకోకూడదనుకుంటూనే వుంటా నంటూ ఆవిడ స్వగతంగా చెప్పింది.

మీకు ఏదైనా మాలో లోపం కనపడితే క్షమించండి. మిమ్మల్నిగురించి మంచిగా అనుకున్నామేగాని పొరపాటు మాట ఏమి అనలేదే అని పద్మ చెప్పి వెడతానని బయలు దేరింది.

అనకపోవడం ఏమిటి లెండి ? వాళ్లు మీ యింటినించి తిన్నగా యిక్కడికే వచ్చారు. మీవారికి ఇష్టం లేకపోయినా నేను రోజూ వచ్చేదాన్నని, మీ ఇంట్లో బాగున్న వస్తువులన్నీ కావాలన్నానని ఇంకా ఏవేవో చెప్పారనుకోండి అన్నీ చెప్పడం ఎందుకు అని వూరుకున్నా అంటూ ఆవిడ బైట పెట్టింది.

నేను అనుకుంటూనేవున్నా వాళ్లు ఇల్లా తంపులుపెట్టే రకమేనని. వచ్చినప్పటినించీ మా ఇల్లు ఎవరికో ఇవ్వమనటం మమ్మల్ని ఇంకో ఇంటికి మారమని ఆడామొగా రకరకాలుగా ఆపేక్ష వలకపొయ్యటం మాకు ఎక్కడో చుట్టరికం వుం

దంటూ అందరిదగ్గరా లేని వన్నీ చెప్పటం ఆ మాటకి వస్తే మిమ్మల్ని గురించి చెడ్డగా చెప్పింది వాళ్ళేగా ? ఎందుకులెండి గొడవ, మాకు మళ్ళీ మేము ఇదివరకు వున్న వూరే బదిలీ అయింది అని చెప్పి పద్మ ఇంటికి బయలుదేరింది.

మేడమెట్లు ఎక్కుతూంటే పైన వరండాలో ఎవరివో మాటలు వినపడ్డాయి. ఎవరొచ్చివుంటారా ? అనుకుంటూ తొందరగా పైకి వెళ్ళింది పద్మ. మొదట వచ్చిన ఆడవాళ్లు నలుగురూ నిల్చుని నవ్వు మొహంలోకి తెచ్చుకుంటూ మీ కోసమే ఎదురుచూస్తున్నాము! ఎక్కడికెళ్ళారు? అని పద్మని ప్రశ్నలు మొదలెట్టారు. సమాధానం చెప్పకుండానే తలుపులు తీసుకు లోపలి కెళ్ళింది.

వకళ్ళ మొహంలోకి వకళ్ళు చూసుకుంటూ లోపలికి వచ్చి సోఫాలో కూర్చుంటూ అల్లా వున్నారేమి, వంట్లో బాగా లేదా? అని నాజూగ్గావున్నావిడ పద్మ నడిగింది. సమాధానంగా చిన్నగా నవ్వి వూరుకుంది. మెల్లకన్ను ఆవిడ పమిట జారుతూంటే కూడా గమనించుకోకుండా చేతులు తిప్పుతూ, ఈసారి మీమాట నిలబెట్టుకోక పోయారంటే చూసుకోండి ఏంచేస్తానో, వ్యంగ్యంగా అంటూ నాజూకుగా వున్నావిడ కేసి వోకన్ను పెట్టి చిత్రంగా నవ్వింది.

మళ్లా వాళ్లు ఇంటికోసమే వచ్చారని అర్థమయ్యేందుకు అట్టేసేపు పట్టలేదు పద్మకి. ఇంకో ఆవిడ ఆ మాటని మరపించేందుకు, ఏమిటండి, మీరు పూర్తిగా పరిచయం కాకుండానే మళ్ళా వెళ్లిపోతున్నారుట ? ఆమాట విన్నదగ్గరనించీ ఏమీ తోచటంలేదు చెప్పొద్దూ ? అంటూ విచారం వెళ్ళబెట్టింది.

మెల్లకన్ను ఆవిడ పమిట అంచులు సరిచేసుకుంటూ, మధ్య మీ కెందుకు విచారం? సర్వీసు అన్నాక ఎక్కడికి వేస్తే అక్కడికి వెళ్ళాల్సిందే. ఎప్పుడు వెడుతున్నారు? అని పద్మ నడిగింది. నాలుగురోజుల్లో వెడతామని ముభావంగా చెప్పింది పద్మ.

అయితే ఇల్లుమాత్రం ఎవరికీ మాట ఇవ్వకండి మేమే తీసుకుంటాము. రేపు మంచిదికనక కొంతసామాను తెచ్చి పెట్టు కుంటాము. మీరు వోగది మాత్రం ఖాళీ చెయ్యండి అంది.

అది మాత్రం వీలు పడదులెండి. మా సామాన్లు సర్దు కునేందుకే చోటు చాలదు, అన్నీ విప్పి పెడితే. అయినా మీకు ఇస్తాడని నమ్మక మేమిటి? ఈ ఇంటాయన బంధువులెవరో వస్తారట అంటూ మెల్లిగా బయటపెట్టింది పద్మ.

అందుకేగా సామాను ముందుగా తెచ్చి పెట్టటం. ఇవ్వకేంచేస్తాడు? వాళ్ళకి ఇంకోపది ఎక్కువ పారేశామంటే ఇంక మాట్లాడ్డు అంటూ అప్పుడే తనదయినట్టు గర్వంగా తల తిప్పుతూ సమాధానమిచ్చింది మెల్లకన్ను ఆవిడ.

మీకు సామాను సర్దటానికి తోడురమ్మంటే మేము వస్తాము అంటూ నాజూగ్గా వున్నావిడ, పద్మని ప్రసన్నం చేసు కునేందుకు అడిగింది. ఎవరూ అఖ్ఖర్లేదండి. మాట్లాడ్డం అయింది వాళ్ళేసర్ది సామాన్లు ఎక్కిస్తారుట.

మీకు ఆమధ్య సుస్తీచేసిందటగా! మాకు ఎవరికీ తెలి యనే తెలీదు మీ పక్కవీధిలో వున్నావిడ వచ్చి చెప్పేదాకా అంటూ గుండ్రపాటిఆవిడ పద్మతో అంది.

చేసింది ఏమన్నా వూరుకుంటుందా? ఇంటింటికీ వచ్చి చేప్పేమాటలు విన లేకపోయాం బాబూ! ఆవిడ చేస్తోందికదా అని మీరు అన్నీ మంచంలోనే జరపమన్నారట కదూ? మీ వారేమో ఆవిడ వెంట కూడా కూడా రాసుకుతిరగటం, ఆవిడ కాఫీ ఇస్తోంటే చేతిని గట్టిగా నొక్కారని, పైగా మావారి తోటి చెప్పటం. సిగ్గులేని మనిషి. ఆయన వకటే నొచ్చుకున్నారు. చెప్పొద్దూ అంటూ నాజూగ్గావున్నావిడ సాను భూతిగా మూతి పొడుగ్గా పెట్టుకుంది.

పక్కవీధి ఆవిడ అంతవిగ్రహం ఎప్పుడు వచ్చిందో కూడా తెలియలేదు. ఏమిటీ మళ్ళా చెప్పు అంటూ రెట్టిస్తూ లోపలికివచ్చే దూకుడుచూసి అందరూ తెల్లబోయి చూస్తూ వుండిపోయారు.

నేను చెప్పానని చెప్పాడా? పనికట్టుకు మీ ఆయన వచ్చి, వాళ్ళఇంటికి ఎందుకు వెళ్ళావు? ఆయన సంగతి తెలీసట్టు వుంది నీకు. ఆడవాళ్ళని చూస్తే వదలడంటూ వాగి, పైగా నేను అన్నానంటాడా? నేను అడక్కుండానే వాళ్ళ పుట్టు పూర్వోత్తరాలు అన్నీ చెప్పింది ఎవరో? కనపడనీ అడుగుతా ఏమలుతాననుకోకు, నువ్వేదో అంటున్నావే, సిగ్గులేంది నువ్వా నేనా? అవసరాలు వుంటే గడపవదలకుండా తిరిగేది ఎవరో గుర్తుతెచ్చుకో అంది.

నువ్వు చేసిందేమిటో మహాచెబుదూ, నీ నోటికి జడిసే మీ వీధికి రావాలంటేనే భయంపట్టుకుంది. నువ్వు చెప్పకపోతే ఎల్లా తెల్సిందేమిటి? వాళ్ల ఆయన చెయ్యిపట్టుకున్నట్టు

అంటూ నాజూకు ఆవిడ వోకంట పద్మని చూస్తూ పక్కవీధి ఆవిడకి సమాధానం చెప్పింది.

మీ ఆయన చెప్పినమాటలు విన్నాక నిజమేనేమోనని జరిగినది చెప్పాను, మీలా అబద్ధాలు చెప్పను చస్తే. తెలిసిందా? అంటూ ఆయాసాన్ని అణుచుకుంటూ పక్కవీధి ఆవిడ పైస్థాయిలో సమాధానం ఇచ్చింది.

మెల్లకన్ను ఆవిడ కళ్లు తేలవేస్తూ వెనక్కి జార్లపడి వొంగ్రడింవు మొదలుపెట్టటంతో అంతా ఆవిడచుట్టూ నిల్చుని ఫిట్టు వచ్చిందంటూ వుపచారాలు మొదలుపెట్టారు.

ఇంటి యజమాని కొన్ని సంచులు డబ్బాలు బుట్టలూ తెచ్చి మధ్యగా పెట్టి అలమార్లు ఖాళీచేస్తే పెట్టుకుంటానని పద్మతో అనటంవిని అంతా వక్కసారి వాళ్లసామాను సర్దుకోకుండా మీరు అడ్డుపెట్టడం ఏమిబాగుంటుందని అటకాయించారు.

నేను రావుతో ముందే చెప్పాను. పెట్టుకోమంటేనే తెచ్చానంటూ వో అలమారు ఖాళీగావుంటే దాంట్లో అన్నీ సర్దుకుంటున్నాడు ఇంటిఅతను. అదేమిటండీ ఎవరైనా ఈ వూళ్లో ఇంటివాడి చేతికి ఇల్లు వప్పగిస్తారా? మనవాళ్ళకి ఇచ్చుకునే వాళ్ళంగా? వాడు పగిడీలేందే మళ్లీ చచ్చినా ఇవ్వడు అంటూ సన్నపాటి ఆవిడ గట్టిగా కసిరింది పద్మని.

వాళ్ళు ఎల్లాంటి వాళ్ళయినా మనంచేసేది చెయ్యాలి కానీ ఇల్లా తెలివితక్కువగా ఇంటివాడికి వదిలారు ఏమిటి? అని పక్కవీధి ఆవిడ పద్మని కొద్దిగా మందలించింది.

వాళ్ళంతా వకటిఅవటం పద్మకి ఆశ్చర్యాన్ని కలిగించి బిత్తరపోయి చూస్తోంది. అసలు వాళ్ళకి ఎందుకు ఇవ్వాలి ఇల్లు?

అడగాలనుకుంది. రాఘవరావు రాకతో ఆ ప్రస్తావన ఆపి ఇంటి యజమాని సామాను తెచ్చుకున్నాడని చెప్పింది. మంచిపని చేశాడు. మనకి బాధతీరింది. ఎవరికి ఇప్పించినా నష్టంకమే అంటూ లోపలికి వెళ్ళాడు.

ఈ కొంపకోసం ఎన్నిసార్లు ఈ గడప తొక్కాల్సి వచ్చింది. చిన్నదశలోంచి పైకివస్తే ఇల్లాంటిబుద్ధులే వుంటాయి. మావారిలాంటి వాళ్లు ఎక్కడో కానీ వుండరు. లేకపోతే కింద వాళ్ళతో ఇంతచనువుగా ఎవరుంటారు? అప్పుడే తెలివితెచ్చు కున్న ఆఫీసరుగారి మెల్లకన్ను భార్య నీరసంగానిర్వచనం చేసింది.

ఏమండోయి, మీవారిపదవికి జడిసి మీతో రావటం లేదు. ఏదో పాతవాళ్లు ఇంటికోసం అవస్థపడుతున్నారనితప్ప అంటూ గుండ్రపాటి ఆవిడ పౌరుషపడింది. వాళ్ళు ఘర్షణపడు తూనే మెట్లు దిగుతున్నారు.

మీరు పక్కవీధిఆవిడ చెయ్యి పట్టుకున్నారని చెప్పిందిట అని పద్మ రాఘవరావుకి చెప్పింది. హతోస్మి ఆంజనేయదండకం చదువు అంటూ రాఘవరావు మెట్లదగ్గరకు వెళ్ళాడు. మెట్ల పైన నిల్చున్న పక్కవీధి ఆవిడ రుసరుసలాడుతూ రాఘవరావు కేసిచూసి చరచరా దిగి వెళ్ళిపోయింది.

అంతా వకరకం సజ్జులాగే వున్నారు. కొంగుతో మొహం తుడుచుకుంటూ మాటల్లోన్నా కాస్త వుపకారబుద్ధి వుంది. ఈ పక్కవీధి ఆవిడ వాళ్ళకంటే వెయ్యిరెట్లు నయం అనుకుంటూ అంది పద్మ. "స్త్రీ బుద్ధిః — తరవాత ఏమిటి?" రాఘవరావు నవ్వాడు.

# మంగతజీవి చివరిచూపు

ఆరోజుకి, ముసురుపట్టాక మూడురాత్రులు గడిచాయి. సూర్యరశ్మికోసం ప్రాణాలు తల్లడిల్లుతున్నాయి. కాంతమ్మ పాకలో నీళ్లునిలిచి, సామాన్లు పైకి తేలుతున్నాయి. బోషాణం పెట్టె సగందాకా నీళ్ళల్లోవుంది. తెల్లవారి ఏ కొద్దిసేపో వెల్తురు చిమ్మినా మళ్ళా నల్ల మేఘాలు ఆకాశాన్ని మూటకట్టినట్టు నలుప్రక్కలా చుట్టుకున్నాయి. కాంతమ్మ గుండెపై రాయిపడినట్టువుంది. ఐదేళ్ళ సుందరి కన్ను తెరవకుండా పడివుంది. వళ్ళు వేడితగ్గినా పిల్ల కదలకుండా పడివుంది. పాపిష్టి దాన్ని ఎందుకు కొట్టినట్టు! తన దరిద్రానికి పసిదాన్ని నిందిస్తే అది ఏంచేస్తుంది—అని బాధపడుతోంది కాంతమ్మ. మోకాలి లోతు నీళ్ళల్లో నిల్చుని గోపయ్య, కాంతమ్మగోయ్ అంటూ కేకలు పెడుతున్నాడు. నీళ్ళల్లోకి దిగటం ఇష్టంలేక ఎందుకని బోషాణం పైనించే అడుగుతోంది.

ఎవరో ఎంకటేశులు అంటండీ మీకోసం వచ్చారంట. పెద్దింట్లో వుండారు. మీ యల్లుడుగారు మిమ్మల్ని పిల్చుక రమ్మంటుండారు. నేను పోతుండా అని గోపన్న అరవటం దూరమవుతోంది.

వెంకటేశ్వర్లు పేరువినగానే వళ్ళు అంతా నీరుకారినట్లు అయింది. మళ్లా ఇక్కడికి ఎల్లావచ్చాడన్న ఆశ్చర్యంతో మనస్సు కొంతసేపు మొద్దుబారింది. పక్కనవున్న సుందరి మొహంలో వెంకటేశ్వర్లు కనిపించాడు. వుద్రేకంతో పిల్ల పీక పిసకపోయి

తనతప్పు తెల్సుకుని వెనక్కి జరిగి కూర్చుని మోకాళ్ళపై తలెట్టు కుంది. గతంలోకి మనస్సు వెడుతోంది. ఎంతకాదు అనుకున్నా ఆలోచనలు పెద్దపెద్ద ఆకారాలతో ఎదుట నిలుస్తున్నాయి. పిల్ల పుట్టుకల ముందుకి వెళ్ళింది మనస్సు.

ఆరోజు ఇల్లాగే వున్నపళంగా కుండపోతగా వర్షం కురు స్తోంది. గాదిదొడ్లో తల ఆనుపెట్టుకుంటూ పంచలో మంచము చాటుగా ముక్కాలిపీటమీద కూర్చుని వర్షముధారలతో చూపుకలిపి కిందకీపైకీ చూస్తోంది. మబ్బుల్లో దాగిన నీరెండ మబ్బుల్లోనే దాక్కుని చీకటిని మబ్బులకి కప్పినట్లు, చుట్టూ నల్లగా చీకటిదిగుతోంది. జుట్టు పైకిమడిచికట్టుకు కొంగు నెత్తి పైకి లాక్కుంటోంది.

పదిబారల పెరడు దాటితేగాని ఇంట్లోకి వెళ్ళలేదు. తల మళ్ళా తడుస్తుందేమొ. పోనీ కొంచము వెలిశాక వెళ్ల వచ్చు అనుకుని పీటమీద చతికిలపడింది.

గాదివెనక ఏమిటో కదిలినట్టు అయింది. భయంతో కాళ్లుకూడా పీటపైన పెట్టుకు ముడుచుకు చుట్టూ చూస్తోంది. ఎవరో కళ్ళుమూస్తున్నారు. గట్టిగా అరిచింది. వర్షపుహోరు గోడలానిల్చి అరుపుని బైటకి వెళ్లనివ్వలేదు.

అరవకు నేనే-అంటూ వెంకటేశ్వర్లు ఇకిలిస్తూ జరుగు తున్నాడు.

ఛీ అంటూ విదిలించి పరుగుపెట్టింది. చీకట్లో మంచం కోడు తగిలి కిందపడింది.

నామాట వినకుండా వెడితే యింతేఅవుతుంది. చీకట్లో తడుముకుంటూవచ్చిన వెంకటేశ్వర్లుచేతిలో యిరుక్కుంది,

ఎంతో బతిమాలింది. తిట్టింది. గిల్లింది. మొండిఘటం ఛీ అస హ్యంతో వళ్లు జలదరించి కళ్లు మూసుకుంది.

ఏం నీక్కా-బోయేభర్త నాకంటే చిన్నవాడేం కాదులే, అయితేమానె, అల్లుడు ఇంట్లోనే వుంటాడుట, నీ కళ్ళతో కట్టేస్తావు మనసుని. ఇంకా ఏదో చెబుతూనేవున్నాడు. దూరంగా వర్షంలో మసగ్గా దీపపుకాంతి కదులుతూరావడం చూసి గాదినెక్కి- తప్పుకున్నాడు వెంకటేశ్వర్లు. ఇంట్లోకి వెళ్ల కుండా నూతిలో దూకాలనిపించింది కాంతానికి. అంతదూరం నించే అమ్మాయి అని తండ్రిగొంతు వినపడగానే కొంగుకప్పుకు వర్షంలో తడుస్తూ యెదురెళ్లింది. తడుస్తూంటే మనస్సు కొంత తేలికయినట్టు తోస్తోంది. ఇదివరకు వానంటే భయం, చినుకులు పడితే ఏవో ముళ్లుగుచ్చుకున్నంత బాధగా అనిపించేది. వంట వసారాలో తల్లి ఎదురుచూస్తోంది. పిచ్చిమొహాము, వానకి జడిసి గాదిదొడ్లో వుండిపోయినట్టు వుంది.

తల అంతా తడుపుకున్నావా? అత్తయ్యని తుడవమను. ఆ మొహమంతా కాటిక అల్లా పూసుకొన్నావేమిటి! భూతక్కి బొమ్మలా, అంటోంది. అమ్మని తప్పించుకు సావిడిలోకి తప్పు కుంటూ, తలనొప్పి అని వంకపెట్టి వెళ్లి పడుకుంటే, బామ్మ సొంటిగంధం తీసుకువచ్చి గట్టిగా పట్టువెయ్యటం తెల్లవార్లు కంటిమీద కునుకు లేకుండా మాట పెడుతూనే వుంది.

బయట వర్షపుగాలి ఎంత చల్లగా వేస్తున్నా వళ్లు మండటం తగ్గలేదు. ఎప్పుడో కునుకుపట్టింది.

సూర్యభగవానుడు కడిగిన అద్దంలా స్వచ్ఛంగా మెరిసి పోతూ తూరుపుకొండలపైకి ఎగబాకుతూ కాంతిని వెనక్కి నెట్టి,

వేగంగా గమ్యంకోసం వెతుక్కుంటూ ముందుకివస్తున్నట్టు, కళ్ళఎదట నిల్చి అంతలోనే జరిగి ముందుకి వెళ్ళిపోయాడు. కాంతానికి వళ్ళుఅంతా నొప్పులు జ్వరం వచ్చినట్టువుంది. నిన్న వానలో తడిసిందామె కొద్దిగా పులకరంగాని తగిలి వుండవచ్చు అని బామ్మ నుదుటుమీద చెయ్యేసి చూసి అంటోంది.

రెండురోజుల్లో జ్వరం తగ్గింది. లేస్తే కళ్ళు తిరగటం, ఏదో కడుపులో దేవటం తగ్గలేదు. పైత్యం ఎక్కువయింది అంటూ బామ్మ మాత్రలు చేసివేసింది. గుళ్ళోకి సాయంకాలానికే అంతా వెళ్ళిపోయారు. చిన్న మేనత్తని సాయంపెట్టారు తనకి. దొడ్డి కిటికీలోంచి కాయితాలుచుట్టి ఎవరో వేస్తున్నారు. అన్నీ మేనత్త వడిలో పడుతున్నాయి. ఏమిటేఅవి అంటూ ఇప్పబోయింది. చూస్తానంటూ తీసుకొని అన్నీ అటేపడేసింది కాంత.

వెంకటేశులు పెరట్లోకి రమ్మనమని సైగ చేస్తున్నాడు.

ఇంతలో భజంత్రీలని తీసుకు పల్లకిని వెంటబెట్టుకు తల్లి వచ్చింది.

కాంతానికి మొదట ఈ పెళ్ళిఅంటే ఇష్టంలేకపోయినా వెంకటేశ్వర్లుకి దూరంగా వుండవచ్చునన్న ఆనందం వకటి కలిగింది.

తండ్రికికూడా ఈ పెళ్లి సుతరామూ ఇష్టంలేదు. తల్లి అయినా పెళ్ళికొడుకుని ముందు చూసివుంటే వప్పుకునివుండేది కాదేమో, ఎల్లాగయినా ఆడపిల్లపైపు బంధువులు పక్కకిజరిగి కళ్లు వత్తుకుంటున్నారు. పెళ్ళికుదిర్చిన పెద్ద చిందులు తొక్కుతున్నాడు. ఏమయిందిఅంట. నిక్షేపంలాంటి సంబంధం? చిల్లి

గవ్వ కట్నంలేకుండా వచ్చింది. బోలెడు ఆస్తివుంది తెలుసా? అంటూ పళ్ళు కొరుకుతున్నాడు బామ్మపైన.

తంతు పూర్తవగానే ప్రయాణాలు అవమని తొందర పడుతున్నాడు అటునుంచివచ్చిన పురోహితుడు. మర్నాడుగాని పంపమని బామ్మ ఎదురుతిరగటంతో కొంచెము స్థిమితపడ్డాడు పురోహితుడు.

ప్రయాణంలో తోడుగా చిన్న మేనత్తని పంపారు. పెళ్లి కూతురికి వచ్చిననాడు ఇచ్చిన విడిదే ఆపాక. ముందు కొంచెము కష్టంగావున్నా నెమ్మదిగా అలవాటయింది.

మేనత్త నెమ్మదిగా పనివాళ్ళదగ్గర ఆరాతీసి తెల్సు కుంది. ముందున్న నేడా, భూమి, కూతురుపేర పెడితేకాని ఈ పెళ్ళికి వప్పుకోలేదట-మొదటి సంబంధం వేపు బంధువులు. ఆమాటవిన్న మేనత్తకి వర్షంకంటే ఎక్కువగా కంటిధారలు జారుతున్నాయి. కాంతానికి ధైర్యంచెప్పి వెళ్లిపోయింది. ఆ పాకలో అప్పటికేవున్న సామాన్లలో బోషాణం ఒకటి. విరిగిన మంచాలు చెక్క పెట్టెలుతో వారగా వున్నా వాటిజోలికి అట్టే ఎవరూ వెళ్ళరల్లేవుంది. దుమ్ముపడివున్నాయి. కాంతంవచ్చిన రెండురోజులకి ఒకసారి కూతురువచ్చి చూసి వెళ్ళింది. మరో రెండురోజులకి అక్కడికి రమ్మని కబురుపెడితే వెళ్లింది. అల్లుడు తన్నెంతో ఆదరంగా పలకరించటంచూసి కూతురుమొహం ముడుచుకుంది.

ఆరాత్రి ముసలాయన చాలాకోపంతో వచ్చాడు. అసలు అక్కడికి ఎందుకెళ్ళావు? ఈసారి వెడితే డొక్కచీల్చేస్తా

నంటూవచ్చి మంచంమీద కూలపడ్డాడు. కాంతానికి అర్థం కాక చూరుకిందకెళ్ళి కూర్చొని పెద్దింటిదీపాలకేసి చూస్తోంది. ఏమిటె అటు చూస్తున్నావు అప్పుడే అటుపడిందా నీదృష్టి అంటూ కాంతం రెక్కపుచ్చుకు ఈడ్చుకువచ్చాడు లోపలికి.

ఎందుకో కప్పడుతున్నాడో అర్థంకాక పోయినా ముసలాయనమీద జాలేసింది కాంతానికి. ఆపాకలో ఆరభసలో ఏళ్ళు జరక్కపోయినా నెలలు గడిచాయి. వేసంగి ఎండలో పొలం వెళ్లి వచ్చిన ముసలాయన సంధ్యవేళ మల్లా తగూపెట్టుకున్నాడు. ఇప్పుడు నిజంచెప్పు, నీకు వాడితో . . . అంటూ పెద్దింటికేసి చూపెట్టి అడుగుతున్నాడు. కాంతం కళ్ళు అప్పచెప్పి చూస్తోంది. ముసలాయనకి కోపంతో వళ్ళు తెలవటం లేదు. మూలనున్న కఱ్ఱఎత్తాడు.

వెనకనించి ఎవరో పట్టుకున్నారు. నువ్వా, నువ్వా ఇక్కడే దాక్కున్నావన్నమాట అంటూ, అల్లుడుమీదకి వురికాడు. చీకటి చిమ్ముతున్న పెరళ్ళోకి దొర్లాడు. అంతే మరిమాటలేదు. మంచంలో కొన్ని నెలలుగడిపి బోషాణం పక్కన కళ్ళు మూశాడు ముసలాయన.

అప్పటినించీ ఆపాకే తనకి శరణ్యం. ఎన్నోరోజులు తినకపోయినా ఎవరూ అడగలేదు. పసిదానికి పాలులేకపోయినా బాధలేదు. పక్కపాకలో దూడలికి గుప్పెడు పచ్చిక దొరికేది. తనకీ పిల్లకీ ఎన్నో కరువయ్యేవి. అల్లుడు తలుచుకున్నప్పుడు విస్తరి దొరికేది. తండ్రి తీసుకెళ్లేందుకు ఎన్నోసార్లు ప్రయత్నించాడు. తనకే మనసు వప్పలేదు.

తిండికికూడా హీనపడతానసుకోలేదు అన్న తండ్రి మాటలకి కాంతం కళ్లు చెమర్చాయి.

ఆమాటలు విన్న అల్లుడు, తిండికి ఏర్పాటు చేశాడు. కానీ పెద్దింట్లో అనుమానం మంటలా కాలుస్తోంది. నిత్యం అవే గొడవలతో తెల్లవారుతుందట. అల్లుడిని అంతా ఆడిపోసు కుంటున్నారుట. నిజంగా మనిషిఅంటే అల్లావుండాలి. తన్ని ఎంత గౌరవంగా చూస్తాడు. పిల్లంటే ఎంతజాలి. గుడ్డిలోకం మంచిని చెడుగా చెప్పుకుంటోంది. అన్నిమాటలు ఎల్లాభరి స్తున్నాడో మానవుడు. ఐనా తప్పుగా తనతో ఎప్పుడూ మాట్లాడలేదు.

వెంకటేశ్వర్లు వయస్సుని కండువాలా కప్పుకొని వైరాగ్యం కబుర్లు నోటినిండా నములుతూ పెద్దమనిషిలా ప్రతి మాటకి వుపమానంగా బోడిబుర్రని చూపెట్టి నాకేంకావాలి ఇంక అంటూ చప్పరించి వచ్చేపోయే పిల్లల్ని రహస్యంగా చూస్తూవుండటంతో పోల్చుకుంది. కానీ మంచివాడుగా చలా మణి అవుతున్న వెంకటేశ్వర్లుని తను కాదంటేమాత్రం నమ్మతారా?

అల్లుడుమంచి కూతురు ఎందుకు తెలుసుకోలేదో. డబ్బు వుందన్న గర్వమైవుండాలి. అన్నీవున్నా వాళ్ళకి సుఖపడేరాత లేదు. ఎంతసేపయిందో తను అల్లాకూర్చుని. మెడ స్వాధీనం తప్పింది. కాళ్ళు తిమ్మిరెక్కాయి. పిల్లకేసి చూసింది. ఎల్లా పడివున్నది అల్లాగేవుంది.

పొద్దుతిరిగి వుండవచ్చు. వర్షం హోరు తగ్గినా వాన తగ్గలేదు. తీగెల్లా వానధార పడుతోంది. అరటి చెట్లబోదెల్లో

మురికి అంతా కొట్టుకుపోయి, తేటనీటితో తేలిగ్గా ప్రవహిస్తోంది. కాలంతో కలసి పాపంకూడా పల్చపడుతుందేమో.

ఏమండోయి అన్న సూరి అరుపుతోటి మళ్ళీ యథాస్థానానికి రాక తప్పలేదు కాంతానికి.

ఇందాక ఓసారి పిలిచారంటగా! మీ అమ్మాయిగోరు అగ్గిఅయిపోతున్నారు. అల్లా ముడుసుక్కూకోపోతే ఎల్లి ఓముద్ద తినరాదటండీ! అని సలహా యిచ్చింది సూరి.

ఎక్కడో కట్టలు పెళపెళ్ళాడుతున్నాయి. పాకపైకి చూసిన సూరి అమ్మబాబో అంటూ నీళ్ళల్లోంచి అవతలికి పరుగెట్టింది. కాంతమ్మకి భయపడాలని వున్నా తన శరీరం స్వాధీనంలోకి తెచ్చుకునేసరికి తనేమైపోతున్నానో అన్నట్టు తోచింది. ఏమయినా పిల్లని బతికించుకోవాలి అనిపించింది. పొడిగుడ్డ తీసి కప్పింది. పిల్లని గుండెదగ్గరగా తీసుకుంది.

పాక పెంకు విరిగి కిందకి పడటం చూస్తూనేవున్నా నోట మాటరాలేదు.

పిల్లకంఠం కీచుమని అరిచి వూరుకుంది. బోషాణం కిందికి దిగినట్లుతోస్తోంది. నీళ్లు వంటికి తగులుతున్నాయి. పిల్లని ఇంకా గట్టిగా పట్టుకుని ఊపిరిసలపక ఆయాసపడుతోంది కాంతమ్మ.

ఏవో కంఠాలు వినపడుతున్నాయి. నెమ్మదిగా పైకి లేపండి పాకని అంటున్నారు.

కదిపినపాక నేలమీదకి వరిగింది. ఆ కెనుగులాడుతోంది కట్టా కంపా తోటి.

కాంతమ్మకి తెలివివచ్చి కన్ను తెరచింది. అంతా చీకటిగా వుంది. దూరంగా ఎవరో కునుకుతున్నారు. వళ్లు అంతా ఏమిటో కట్టుకట్టారు. మళ్ళీ మగత వస్తోంది. వెలిగించిన వెల్తురిని యెవరోపైకి తోస్తున్నారు. తూర్పు ఆకాశం ప్రశాంతంగా తెల్లబట్టలు ధరిస్తోంది. రంగులు తెలవని పక్షులు గుంపులుగా పిల్చుకుంటూ వెడుతున్నాయి. స్పృహ వచ్చిన కాంతమ్మకి అవయవాల స్పర్శ స్పష్టంగా తెలుస్తోంది. చెవలకి చాలా చిన్నశబ్దంకూడా వినపడుతోంది. నెమ్మదిగా మాటలు వినపడుతున్నాయి.

నీకెందుకు ఈపీడ తండ్రిని వచ్చి తీసుకెళ్లమని కబురు పెట్టించు—ఆ కంఠం వెంకటేశ్వర్లుదే. సందేహంలేదు.

నేచెపితే వినుగదా ఖర్మ. పోనీ మీరు చెప్పి చూడండి. ఆచెప్పేది అమ్మాయే ననిపించింది కాంతాన్కి.

ఇంతచక్కదనం నీకుండగా దానికోసం ఇదవడ మేమిటి? మీ ఆయన నాకు నచ్చలేదు.

ఇది అంతా నాఖర్మ. ఏమిచెప్పనులెండి అని అమ్మాయి ఏడుపు వినిపిస్తోంది.

లాలింపుగా సకిలిస్తున్నది వెంకటేశ్వర్లే నేమో. కాంతమ్మ గోపన్నను పిలిచింది . మెల్లగా, మళ్ళీ లోపలినించి మూడో కంఠము గట్టిగా వినపడుతోంది. అసలు మీకున్న వయసెంతో మీరుచేసే పని ఏమిటీ అంటూ గద్దిస్తున్న కంఠం అల్లుడిదే. హామ్మయ్య అనుకుంది కాంతమ్మ.

మంచివాడు అనుకుని కష్టం సుఖం చెప్పకున్నాను అని సన్నగా ఏడుస్తోంది అమ్మాయి.

నాకు ఆవిడకు లేనివి కట్టి ఇద్దరూ ఆనందిస్తున్నారు అంతేగా!

ఆవిడ చిన్నప్పటినించీ అంతేట, అందుకే ముసలాడికిచ్చి కట్టబెట్టారు. ఆమాట నిజమే చెప్పాడు ఆ వెంకటేశ్వర్లు అని ఏడుపులోనే చెపుతోంది అమ్మాయి.

చూశాగా నిజాయితీపరుణ్ణి. చెప్పింది నమ్మాల్సిందే నేను సమయానికి రాకపోతే అంటున్నాడు. వూరుకోండి అల్లాంటి మాటలు అనకండీ అంటూ అమ్మాయి కంఠంలో హీనస్వరం పడింది.

చిన్నవయస్సులో వున్నా ఎప్పుడైనా వెకిలిగా ప్రవర్తించిందా? ఒక్కనాడయినా ఇదిలేదు కావాలని అడిగిందా? ఆమె తండ్రి రమ్మని బతిమాలినా ఆ పాకనిపట్టుకు వేళ్లాడిందే కాని వెళ్ళిందా?

నీకు ఎప్పుడైనా ఆవిడనిచూసి జాలివేసిందేమో గుర్తుకు తెచ్చుకో ఇన్నేళ్ళనుంచి నీపక్కనే కాపరంచేసే ఆవిడగుణం. ఎవడో ముక్కూమొహం తెలియనివాడువచ్చి వాగినది పట్టుకొని ఆనందిస్తున్నావా? నిన్నుగురించి నేను అలాచెపితే నీకెలా వుంటుంది. అని అల్లుడు అడగటం, మనస్సులో ఎంతో తృప్తిగా వుంది కాంతానికి.

అవున్లెండి. కట్టుకున్నదనే గౌరవమైనా లేకుండా ఇష్టం వచ్చినట్లు అంటున్నారు. అనండి. మీకు ఏమీ లేకపోతే ఆవిడకోసం అంత ఇదవుతున్నారేం? ఈ మూడుపూటలు తిండైనా సరిగ్గా తిన్నారో లేదో ఆవిడ కాపలాయే సరిపోతుంది.

అని అమ్మాయి గట్టిగానే అంటోంది. ఒకవేళ ఆవిడ బతికినా పిల్ల కనపడక గోలపెట్టి ప్రాణం విడుస్తుంది.

ఇంకా కొద్దిగా ప్రాణంవుంటే అది నువ్వు అనే మాటలలో పూర్తవుతుంది.

అందుకే వళ్ళుమండుతోంది. ఆవిడంటే మీకు ఎందుకు అంతజాలి అంటాను? అసలు నాకొంపలో ఆవిడ వుంటే నాకు మనస్థిమితం వుండదు తెలిసిందా! రేపే వెళ్ళకొడతా చూస్తూవుండండి. అని గట్టిగా అరచి విసుచుకుపడిపోయింది.

కాంతానికి దుఃఖం వచ్చినా కళ్ళు నీళ్ళతో నిండలేదు. పిల్ల ఏమయింది! అబ్బా మంట కడుపులో, ఏదో భగ్గుమన్నట్టు బాధగా వుంది. ఇక్కడినుంచి ఎందుకు తను వెళ్ళిపోవాలి ఎక్కడికైనాసరే. తన మంచి ఒక్కమనిషి తెలుసుకున్నాడు. అదే తనజీవితానికి తృప్తి. లేచేందుకు ప్రయత్నించింది, కాళ్ళపైన ఏదో బరువు వుంది.

ఓ గోపన్నా నన్ను తీసుకెళ్ళి ఏ పాడుపడ్డ కొంపలోనైనా పడెయ్యక ఇక్కడెందుకు వుంచారయ్యా అంటూ కాంతమ్మ ఏడుస్తోంది.

మత్తుకి మందు వేశారు, వూరిచివర సత్రంలోకి చేర్చారు కాంతమ్మని. సూరితల్లి దగ్గరే వుంటోంది. రోజులో చాలా భాగం మత్తులోనే గడుపుతోంది కాంతమ్మ.

ఆరోజు చాలా వుత్సాహంగా వచ్చింది కూతురు. సవతి తల్లిని పేరెట్టి పిలవటమే అలవాటు. కాంతం కాంతం ఈవింత విన్నావా, నీ పాకలోవున్న బోషాణంలో బోలెడు బంగారం నగలు దొరికాయి. అందుకే నేమొ నాన్న ఎప్పుడూ ఆచోటు

పదిలేవాడుకాదు. అని చెప్పుకుపోతోంది. మధ్యలో కాంతం వినటంలేదేమోనని అనుమానంవచ్చి వూపిచూసింది.

కదలటంలేదు. పలకటంలేదు. కాంతం కాంతం అంటూ మారుమోగేలా కేకలు పెడుతోంది.

సూరి తల్లిని తిట్టింది దగ్గరవుండి చూడలేదా, అని.

ఏమోతల్లీ నాకేటి తెలుస్తుందండీ. అయ్యాల మీాతో మాట్టాడాడే ఆముసలాయన వచ్చి ఏదో అన్నాడండీ. గట్టిగా అరిచారండి అమ్మగోరు. ఆమందుసీసా తెరచి కొద్దిగా వంచుతూ అంతా అయ్యేదాకా వంచేశారండి. అమ్మగోరు ఎంటనే నిద్ర పోయారండి. మళ్ళీ లేవలేదండి—అని ముసిల్ది వూరుకుంది.

అయ్యో ఎంతపని జరిగిందే తొందరగా వెళ్ళి ఆ డాక్టరు గార్ని, అయ్యగార్ని పిల్చుకురా అంటూ గాభరా పెట్టింది.

డాక్టరుచూసి పెదిమవిరిచాడు. చాలా నీరసంగా వుంది పల్సు. తెలివిరాక పోవచ్చు అని నీళ్ళునమిలాడు. కూతురు నిజంగా దుఃఖిస్తోంది.

భర్తకేసిచూసి ఇంకా గట్టిగా ఏడుస్తోంది. ఏమిటూ మార్పు అన్నట్టు చూశాడు.

మీారు నవ్వండి. హేళనచెయ్యండి. కానీ నాకు మా శాంతమ్మ కావాలి. ఆవిడ లేకపోతే నాకు జీవితముమీాద విసుగు పుడుతోంది. అసలు ఇక్కడికి మీారెందుకు పంపారు ఆవిడని? అంటూ భుజాలుపట్టుకు వూపుతోంది.

అర్థంకానట్టు ఆమెనుచూస్తూ నిల్చున్నాడు. నిజంగానే నండీ. ఆవిడని బతికించమని డాక్టరుతో చెప్పండీ. ఇంకెప్పుడూ ఆవిడని యేమీాఅనను. మీారు చెప్పినట్టు పెట్టుకుంటాను.

నేను ఒంటరిగా వుండలేకపోతున్నా ఆకొంపలోనని తన ఆవేదన చెప్పుకుని ఏడుస్తోంది.

ఇదేం చిత్రం! నీకు వుపకారం చేశానని నేను గర్వపడు తూంటే మళ్ళా ఈ పిచ్చిఏమిటి? అని వెంకటేశ్వర్లు గర్వంగా అంటూంటే, నువ్వెందుకు యిల్లా చేశావు? నిన్నెవరు చెయ్యమన్నారు ఈపని? అంటూ గట్టిగా అరచింది కూతురు. ఏ ఆశ పెట్టుకుని ఈపని చేసినట్లు? ఈపిల్ల ల్లా అరుస్తుందేమిటి? అర్థంగాక వికటంగా నవ్వుతున్నాడు వెంకటేశ్వర్లు.

ఆ మొహంలో ఏదో వికృతరూపం కనపడి కెవ్వుమని కేకపెట్టి మూర్ఛపోయింది కూతురు.

నీళ్ళుజల్లి మొహం వత్తుతోంది సూరితల్లి. భర్తచెయ్యి గట్టిగా పట్టుకుంది–చూడండి నన్ను ముందు ఇంటికి తీసుకుపొండి. అతన్ని మన ఇంటికి ఎప్పుడూ రానివ్వకండేం, అంటూ పసి పిల్లలా కండువాలో మొహందాచుకు ఏడుస్తోంది.

వెంకటేశ్వర్లు వేదాంతి మొహం ఎరువుతెచ్చుకుని కాంతంకేసి చూస్తూ–"అంతా జరిగిపోయింది. కార్యక్రమం ఆలోచించండి," అంటూ తత్వాలు తవ్వుకుంటున్నాడు స్థిమితంగా కూర్చుని.

కాంతం మగతలో ఒకసారి కన్ను తెరచింది. పశ్చాత్తాపం తొంగిచూస్తున్న కూతురుమొహం ఆ పక్కనే జ్ఞానేంద్రియాల్లా మెరిసిపోయే అల్లుడికళ్ళూ ఆ చూపులో కలిసి పోయింది. మగతజీవి మాలిన్యం కడిగినట్లు రెండు మేఘాలు చేరి సన్నజల్లులు జల్లాయి. ★

(26)

# ఆడవాళ్ళ పెట్టెలో ప్రయాణం

నేను ఢిల్లీ నుంచి బయలుదేరిన దగ్గరనుంచీ, రకరకాల మనుష్యులు ఎక్కుతూ, దిగుతూవున్న వాళ్లని, చూస్తూ, కాల క్షేపం చేస్తున్నా. నేను కూర్చున్నది రెండవ తరగతి ఆడవాళ్ల పెట్టె. మధ్య మధ్య కొంచెము చోటు ఇస్తారా? అనీ, 'ఎంత వరకూ వెడతారూ?' అని యిల్లాంటి ప్రశ్నలు తప్ప పెద్ద సంభాషణ ఎవరితోటీ జరుగలేదు.

ఆ పెట్టెలో మొదటినుంచి వున్నవాళ్లు నలుగురము. ఒకామె పైన పడుకునే వుంటుంది, ఇంకొక ఆమె ఒకమూల పూర్తిగా సామానుతోటి, ఇద్దరు పిల్లలతోటి సొంతం చేసుకుంది-ఆమె వస్త్రధారణని బట్టి ఆంగ్లో ఇండియన్ స్త్రీ అనుకోవాలి. ఇంకో ఆమె మధ్యసీటులో కూర్చుని వచ్చేపోయే తిను బండారాలు అన్నీ కొనుక్కుని నోటికి విరామం లేకుండా తింటూ వాటితాలూకు తొక్కలు, కాగితాలు, ఆకులు, బైట వెయ్యమని, ఎవరు తనకేసిచూస్తే వాళ్ళకి పురమాయిస్తోంది- ఆవిడ వేషధారణ దక్షిణాది వాళ్ళకి చెందినట్లువుంది. అడ్డ చారల చీర, మెరిసే కమ్మలు, లావు పెదిమలు దగ్గర వంకులు వున్న చింపిరి జుట్టు, పొట్టిగా, లావుగావున్నా, నవ్వినప్పుడు కళగా వుండే మొహం. అన్నట్టు పడుకునే వున్నావిడ విషయం చెప్పటం మరిచా. సన్నగా, పొడుగ్గా వెలిసిపోయే రంగులోంచి వచ్చిన తెలుపులాంటి వంటిరంగు చిన్నకళ్ళు, పొడుగుముక్కు సన్నగా తీగల్లులాంటి పెదిమలు, నున్నగా తాళ్ళలాంటి జుట్టు

అన్నీ విడివిడిగా చూస్తే బాగానేఉన్నా మొత్తంగాచూస్తే వెలవెలపోయే కళలేని మొహములా కనపడుతుంది. ఆవిడ వేషధారణబట్టి గుజరాతీవాళ్లు అనుకోవచ్చు. ఇంకో మూల ఆక్రమించుకున్నది నేనూ అనుకోండి. ఎక్కడైనా రైలు ఆగితే 'యిది ఏ స్టేషను' అని పడుకున్న ఆవిడ హిందీలో అడగటం, ఎవరోవకరు 'ఫలానా'అని చెప్పటం జరుగుతోంది. మధ్యన కూర్చున్నావిడ ఏదైనా కొనే ప్రయత్నములో కిటికీదగ్గరికి వెళ్లినప్పుడు ఆవిడ స్థూలశరీరంలో భాగం పిల్లలమీద ఆనుకుని, వాళ్లు కియ్యోమని కేకవెయ్యటం—వాళ్ల అమ్మ ఇంగ్లీషులో ఆవిడతోటి దెబ్బలాడటం, మళ్ళీ కొంత సేపయినాక ఎవరి చోట్లో వాళ్ళు మొహాలు మాడ్చుకుని ధుమధుమలాడుతూ కూర్చుని ఒకరు చూడకుండా రెండోవారు చూసుకుంటూ, మళ్లీ మధ్యలో ఎవరైనా కొత్తవాళ్లు నక్కితే-యివి మర్చిపోయి వాళ్లని చూస్తూ వెళ్లబుచ్చుతున్నారు. నేను కిటికీదగ్గరే వున్నాను కనుక నాకు ఏమయినా కావలిస్తే నేనే కొనుక్కుని నా బాధ యితరులకి లేకుండా కిటికీలోంచి బయటికి చూస్తూ నాకు వీడ్కోలు యిచ్చేందుకు వచ్చేటట్లు వుండే చెట్లని, రైలు ముందుకు పోతూవుంటే నేను వెనక్కి వంగి చూస్తూ మళ్లా ఎన్నాళ్లకో మిమ్మల్ని చూడ్డము అనేభావంతో దిగులుగా చూస్తూ నన్ను వెళ్లమని చేతులు వూపుతున్నట్టు వుండే వాటి 'నీడ' లని చూస్తూ కాలం గడుపుతున్నా.

ఎన్నో స్టేషన్లు వస్తూ, వెడుతున్నాయి. జనం గుంపులు ఎక్కుతున్నారు. దిగుతున్నారు. కొందరు మైలురాళ్ళలా వున్న మా నలుగురునీ వాళ్ళ వాళ్ల భాషలో శాపనార్థాలు

పెడుతున్నారు. పూర్తిగా దెబ్బలాడి హక్కులు బలపర్చు కుందామనే వుద్దేశ్యము వున్నా, మళ్లా వాళ్ళు దిగే స్టేషన్ ఎక్కడ వచ్చేస్తుందో అన్న భయంకొద్దీ గుమ్మంలోనే మకాము వేసి, చూపులతోటే చుర చురా చూస్తూ వాళ్ల గమ్యాం రావడంతో ఇక్కడ దిగాల్సివచ్చిందికాని, లేకపోతే మీ అంతు తేల్చేవాళ్లం అనే భావంతో ఆఖరిచూపు విసిరి దిగిపోతు న్నారు. ఎప్పుడు నిద్రపట్టిందో పట్టింది. ఎన్ని స్టేషనులు వెళ్లాయో తెలియదు. నాగపూర్‌లో మెళుకువ వచ్చింది. కొంచం కళ్లుమూసుకొని, పడుకునేవున్నా. -ఇద్దరు ఆడవాళ్లు ఒక ఎలుకపిల్లలాటిపిల్ల, ఏడు, ఎనిమిది పెట్టెలు రెండు పక్క-చుట్టలు, నాలుగైదు బుట్టలు, యింకా చిల్లర సామానుకొంత-వీటితో ఎక్క సన్నాహము ఉపక్రమించారు. వాళ్లని సాగనంపేం దుకు వచ్చిన ఆయన, ఆయన పరివారం—నా కాళ్లని పక్కకూ చుట్టలతో తోస్తూ, నేను ఓ మూటాకారం వచ్చేదాకా జరిపారు నాకు కొంచెము విసుకువచ్చి వాళ్ళశ్రమ వృథా అయ్యేటట్లు పక్క చుట్టని ఒక్క తన్ను తన్నాను. ఏమనుకున్నారో వాదనకి దిగకుండా మళ్ళాపక్క ఇవతలికి జరిపి ............ పిల్లని పడుకోబెట్టి ఒకావిడని కూర్చోబెట్టారు. వీళ్లదృష్టి మధ్య స్థలం మీందికి వెళ్లింది. "ఈ రథము లేచి కొంచెము చోటు యిస్తే బాగుండును," అనుకుని వాళ్ల మాటకి వాళ్లే మురిసిపోయి నవ్వుకుంటున్నారు. ఆ 'రథం' లేవటమూ, వాళ్లు సామాను పెట్ట పోతే, తన స్థలంలో వద్దనీ, ఆమూల ఎల్లాగ సామాను వుంది కనుక అక్కడే మీవి కూడా పెట్టకోమని తన భాషలో అమూల్యమైన సలహా యిచ్చి తను మళ్లా నిద్రకు ఉపక్రమిం

చింది. పరివారం రెండు పెట్టెలతో ఆమూలకి వెళ్లటం, ఆ పెట్టెతాలూకు కోను ఆవిడకు తగలడం, ఆవిడ ఒక్కతోపు తోయ్యటం పెట్టెతో సహా రథంలాంటి మనిషిమీద పడటం, ఆవిడ గాజులుతాలూకు కొన్ని పెళపెళలాడటం, పడ్డమనిషి 'సారీ' అని లేవటం — జరిగాయి. ఆవిడ ఎంత గట్టిగా మాట్లాడగలదో అంత గొంతుకతోటే తన భాషలో మృదువుగా తిట్లు మొదలు పెట్టింది. ఇంతలో విజిల్ వెయ్యటం, పరివారంతో వచ్చినాయన ఖంగారుపడి దిగటంతో కాలుజారి క్రిందపడటం—"దెబ్బతగిలిందా" అని 'ఎరక్కపోయి బయలుదేరాము ఈపూట' అని 'మొదటి తరగతిలో ప్రయాణం చేస్తే ఈ గొడవలే వుండేవి కాదని' లోపల వాళ్లు యిద్దరూ పురాణంలా మాట్లాడ్డము మొదలుపెట్టేసరికి, రైలు కదలటం — 'నాకేం ఫరవా లేదు, మీరు జాగ్రత్తగా వెళ్లండని' అవతలినుంచి అతను మాట్లాడటం, 'వెళ్లగానే వైరు ఇస్తామని' లోపలినుంచి వీళ్ల కేకలు — రైలు కూత, గార్డు విజిల్ — అన్నీ కలిసి చెవులు గింగిర్లెత్తాయి. కొంచెముసేపు నిల్చున్నట్టే నిల్చుని ఇంకోచోట కూర్చునేందుకు ధైర్యం లేక నా దుప్పటి ఎత్తి కాళ్లమీద పడేసి ఆసనంలో రెండో ఆమెకూడా కూర్చుంది. కొంతసేపు నిశ్శబ్దంగా గడిచింది.

మళ్లీ నాకు మెళుకువ వచ్చేసరికి ఆంగ్లయువతీ కొత్తగా ఎక్కిన ఈ ఇద్దరూ ఆంగ్లంలో హోరాహోరిని మాటలు వదులుకుంటున్నారు. నేను అప్రయత్నంగా లేచి కూర్చున్నాను. ఇంతలో ఏదో పెద్ద స్టేషను రావటం — గార్డు అటూ ఇటూ తిరుగుతూ ఈ గంద్రగోళం విని ఇక్కడకి రావటం — ఆంగ్ల

యువతి వాళ్ళపై నేరం చెప్పటం బట్టి అసలు విషయం 'యిదే' అని తెలిసింది — వాళ్ల కూజా ఆవిడ చెయ్యి తగిలి పగిలిందిట— దాంతో ఈ గొడవ బయలుదేరింది. గార్డు ఏదో చెప్పి వెళ్లి పోయ్యాడు.

ఇంతలో ఇంకో ఇద్దరు కొత్తవాళ్ళు ఎక్కడంతో కొంత గొడవ తగ్గింది. వాళ్ళు పెట్టె నాలుగు మూలలా చూసి మధ్య స్థలంలో ఆవిడపైన చూపు నిలిపి చేత్తో ఆవిడని తట్టి లేపి ఆ స్థలంలో వాళ్ళు చతికిల పడ్డారు. వాళ్లతో యుద్ధానికి దిగు దామని తెరిచిన నోరుని వాళ్ల ఆకారాలు చూసి ఆవలింతగా మార్చి వాళ్లతో పాటు జరిగి కూర్చుంది. వాళ్ళు ఈవిడకంటె ఒక చుట్టు ఎక్కువే వుంటారు. కానీ తక్కువ మాత్రం వుండరని చూసేవాళ్ళు నిముషంలో కనుక్కోవచ్చు. వాళ్లకి చోటు యివ్వ లేదన్న కోపం కొద్దీ ముందు ఎక్కినవాళ్ళు వాళ్లని తెగ మెచ్చు కున్నారు.'మీరు కాబట్టి లేచింది—కాని మాతో యిందాక ఎంత గొడవ చేసిందో' అని. ఈ పెట్టె వాళ్ల సొంతంలాగా చూసు కుంటున్నారనీ' ఇల్లా చెప్పుకు పోతున్నారు. కళ్లతో నన్నూ; ఎదుర కూర్చున్నావిడని, పైన పడుకున్నావిడని చూపిస్తూ ఇంకా ఏవేవో చెప్పుకుపోతున్నారు. ఎదటి ఆవిడ సలహాతో ఒకావిడ నేను కూర్చున్న కిటికీమీద కాళ్లుపెట్టి పడకకు పుపక్రమించింది. నేను కొంచెం సర్దుకు కూర్చున్నా. ఆ కాళ్లు నెమ్మదిగా నా నడుముదగ్గరకి, తరువాత ఒళ్లోకి జారిపడటం మొదలుపెట్టాయి. నాకు ఒళ్లుమండి నిద్ర నటించే ఆవిడను కొంచెము గట్టిగా తగిలేటట్టు చేత్తో తట్టిలేపాను. ఆవిడ విసుగుకుంటూ 'అల్లా గట్టిగా కొట్టి లేపకపోతే నెమ్మదిగా పిలవచ్చుగా' అంటూ

సాగతియ్యటం మొదలు పెట్టింది.'కాళ్లు మీదపడే సేటంత మొద్దు నిద్ర మీకు పడితే పిలిస్తే ఎక్కడ లేస్తారు మీరూ?' అన్నాను నేను.

"నిద్దట్లో పడితే పడ్డాయేమో – ఏమి చెయ్యమంటారు" అంది – 'ఏమి చెయ్యమంటాను – తీసి ఒంటికి దగ్గరగా పెట్టుకో మంటాను' – 'అబ్బో! చాలా తెలివిగా మాట్లాడా ననుకుంటు న్నట్టున్నారు – మీ నోరు దగ్గర పెట్టుకు మాట్లాడండి' – ఆవిడ సహాయానికి 'రెండో ఆవిడ' 'కొత్తవాళ్లు యిద్దరూ' మాటలు అందుకున్నారు.

ఇల్లా కొంతసేపు జరిగేసరికి పైన పడుకున్నావిడకి నన్ను చూసి జాలివేసిందో ఏమో, ఆవిడ వాళ్లతో వాదనకి దిగింది. మనిషి అర్భకురాలైనా మాట మంచి జ్యాంకారంగా మాట్లాడు తోంది. ఆవిడ ఆసరాతో మిగిలినవాళ్లు యిద్దరు కూడా మాట కలిపి కసితీర మాటలు అందస్తున్నారు. ఇప్పుడు 'నా పక్షమే ఎక్కువ వున్నారుకదా! అని ధైర్యంతో నేను కూడా గట్టిగానే మాట్లాడా. మధ్యలో ఎక్కిదిగే ప్రయాణీకులు తెల్లబోయి మమ్మల్ని, వాళ్లనీ చూస్తున్నారు. మా కీచులాట అప్రస్తుతంగా అనేక రకాల మాటల్లోకి దిగుతోంది. వేసుకున్న దుస్తులదగ్గ ర్నుంచి పెట్టుకున్న వస్తువుల్ని హేళన చేసుకోవటం, ఎవరికి ఏదితోస్తే అది అనటం జరిగింది. ఇల్లా టైం గడుస్తోంది. ఇంక తెల్లకి టైం అయింది. ఏదో స్టేషనులో రైలు ఆగింది. అంతా అంతా పక్క కిటికీల దగ్గరికి గుమ్మందగ్గరికి ఎగబడ్డారు. యీ వెళ్లటంలో వాళ్ల పక్షం మాట్లాడే వాళ్ళలో ఒకరి కాలుకి వాళ్ల పెట్టె కొట్టుకుందిట. ఆ పెట్టెను సునాయాసంగా చిన్న

బంతిని తన్నినట్లు తన్నింది. వాళ్లు ఆవిడని ఏమీ అనలేక 'అయ్యో!' దాన్నిండా గాజుసామాను. ఏమయిందో, అను కుంటూ, ఒకళ్ల కేసి ఒకరు చూసుకున్నారు. అల్లా చూసు కోవటం ఆవిడకి కష్టం తోచింది. ఏమో 'ఏమిచెయ్యమంటావ్' ఇంత సామాను ఎవరు తీసుకురమ్మన్నారు. దారిలో పెడితే ఎవరు వూరుకుంటారు. పగిలితే బైట పారేయ్' అని ఎదురు తిరిగేసరికి ఎటూ మాట్లాడలేక బిక్కమొగము వేసుకు కూర్చున్నారు.

ఎవరికి కావల్సింది వాళ్లు తెప్పించుకుంటున్నారు. నేను చపాతీలు తీసుకున్నా. వాళ్ల క్యారియర్‌లో ఏదో తెచ్చుకున్న ట్టున్నారు. 'మేము ఎక్కడపడితే అక్కడ అల్లా కొనుక్కు తినలేమని' వాళ్ల ఘనత కొంచెం చూపించారు. నన్ను ఉద్దే శించి 'యీరొట్టెలు అసలు తినలేము, తోళ్ళులాగ' అన్నారు. ఎదటివాళ్ళు కూడా రొట్టెలే తింటున్నారేమో – 'ఎప్పటిదో తెచ్చుకున్న చద్దివాటికంటే ఇవే ఎంతో కమ్మగా ఉంటాయి' అని వాళ్లే సమాధానం ఇవ్వటం జరిగింది. ఇంక ఎక్కువ గొడ వలు లేకుండా చిన్నచిన్న మాటలతోటే బెజవాడ చేరు కున్నాం, తెల్లవారు ఝామకు.

మావారు స్టేషనులో కనబడుతారేమోనని కిటికీ లోంచి చూస్తున్నా. దూరంగా మా నౌకరు గురవయ్య కళ్లు నులుపుకుంటూ వస్తున్నాడు. నేను కిందికి దిగాలంటే వాళ్ల సామాను అంతా దిగాక దిగాలి. యీ లోపల రైలు ఉంటుందో, వెళుతుందో – దైవాధీనం. నేను దిగాక వాళ్లకి చెప్పేందుకు వీలవదేమోనని నాతోటి ప్రయాణం చేసినవాళ్లకి

వెళ్లివస్తానని చెప్పాను. వాళ్ళు 'మీరు దిగండి. సామాను మేము అందిస్తాము, అని నాకు దారిలేక అటూఇటూ చూస్తుంటే 'ఆ పెట్టెలమీద అడుగుపెట్టి దిగమని' చెప్పారు. నా సామాను ఎక్కువలేదు కాబట్టి పెట్టె చేత్తో నేను పట్టుకుంటే, నా పక్కచుట్ట, 'చిన్నబుట్ట' చేతిసంచీ పైన ఉన్నావిడ అందించింది. వాళ్ళు ఇద్దరు మళ్ళా అంటున్నారు. 'అల్లా వాటి పైన నడవపోతే కిందికి తన్నెయ్యరాదూ! ఖాళీ అవుతుందని 'ఒకావిడ,' వాళ్ల సొమ్ము ఏం పోయింది, అని ఇంకో ఆవిడ సాగతీస్తున్నారు. జవాను గురవయ్య కనిపించాడు. వాడిని పిలిచి సామాను తీసుకోమన్నా. 'అయ్యగారూ! వచ్చారండీ! మీరు వస్తున్నట్టు చెప్పలేదండి! ఇంకెవరో ఆడంగులు వస్తున్నారు సామానుతోటి, ఎల్లి దింపుకోమని 'టెలిగ్రాం వచ్చిందని సెప్పారండి' – అసలు అయ్యగారే కాపడలేదండీ అప్పటి నుంచి వెతుకుతుండా' 'సరే మనము వెడదాము పద' వాళ్ళు వెళ్లిపోయారేమో చాలాసేపైందిగా రైలువచ్చి అన్నాను. 'మళ్ళీ ఓసారి సూడద్దంటారా?' రాండి, పోదాము, మీరుండారుగా మీరు చెప్పితే తిట్టరులెండి"

మళ్లీ పెట్టెలో వాళ్లకేసిచూసి వెడతానని సైగచేసి యివతలికి వచ్చాము. 'మనకారు యీడే వుంది, అమ్మగోరూ! యీ పెట్టె యీడ పెడతా కూకోండి." అన్నాడు. 'రెండు రిక్షాలు మాట్లాడు వెడదాం, వాళ్ళు ఎంతమంది వున్నారో! ఇంటికి తాళంపెట్టి వచ్చారా అంటే లేదండి వంటాయన వున్నాడుగా అన్నాడు.

ఇంటికి వచ్చి నాపనులు పూర్తిచేసుకుని స్నానముచేసి, గురవయ్యచేత ఇల్లు సర్దించి తుడిపించాను. ఏడుగంటలైనా 'ఆయనకాని, 'ఆ వస్తారన్న వాళ్ళుకానీ' రాలేదు. గురవయ్య ఇంటికిపోయి వస్తానని పోయాడు. పెరట్లో కనకాంబరం మొక్కలు మోళ్ళలా వుంటే వాటికి మొదళ్ళు తవ్వటానికి కూర్చున్నా. వంటవాడు 'నేను తవ్వుతాలే అమ్మా' అంటూ వచ్చాడు, ఇంతలో కారు హారన్ విని బైటికి వెళ్ళాడు గేటు తియ్యడానికి. హాల్లో సగంవరకూ సామానులు నిండాయి. 'అన్నీ వచ్చి నట్టేనా' అని మావారి కంఠం వినిపించింది. 'అబ్బ – ఎప్పుడూ ఆడవాళ్ల పెట్టెలో ప్రయాణం చేయకూడదండీ, బుద్ధివచ్చింది సగము సామాన్లు నాశనము అయ్యాయి అనుకోండి' అని చెప్పుకుపోతోంది. వంటఅయ్యరుని పిల్చి 'గురవయ్య వచ్చాడా, ఏడీ, అని అడుగుతున్నారు. 'అమ్మగారిని తీసుకు అప్పుడే వచ్చాడు. ఇప్పుడే యింటికిపోయాడు. "అమ్మ వచ్చారా ఎక్కడ? 'దొడ్లో మొక్కలుదగ్గర వున్నారు' అంటున్నాడు.

"ఏమిటీ ఈరాక ఉత్తరమైనా రాయలేదే వస్తున్నట్టు" "రాశాననుకోండి. మీరు చూచుకుని వుండరు. చూచినా స్టేషన్‌కి వచ్చేది గురవయ్యేకనక, వాడు కనపడగానే వచ్చేశా.' అన్నాను.

ఆయన తెల్లబోయి నాకేసిచూసి, "కోపము వచ్చి నట్టుందే రాణీగారికి. చూడు మా స్నేహితుడిభార్య, ఆవిడ చెల్లెలు వచ్చారు కాని, వాళ్ళకి ఏమికావాలో చూద్దూ, నా ప్రాణం తీస్తున్నారు ప్రొద్దుటనుంచీ."

'వాళ్ల కేమికావాలో నాకేం తెలుస్తుంది — మీరే చూసుకోండి.'

'మంచిదానివికానీ, రా,' అంటూ చెయ్యిపుచ్చుకు లాక్కుపోతున్నారు. నేను చెయ్యి వెనక్కిలాక్కుని 'ఏమిటదీ కోతిచేష్టలు' - అంటూ హాల్లోకి తొంగిచూద్దునుకదా, రైల్లో నాతో ప్రయాణంచేసిన ఆ యిద్దరూ, అక్కచెల్లెళ్లు హాయిగా కాళ్లు పైకిపెట్టుకుని సోఫాలో కూర్చున్నారు. ఆపిల్లని ఏవో తినేందుకు ముందడేసి కింద తివాసీమీద కూర్చోబెట్టారు. తినేవి పొడిపొడిలాచేసి తివాసీమీద పోస్తోంది. దానికితోడు చొంగచేతులతో అలుకుతోంది - చూస్తే డోకు వచ్చేటట్టు చేస్తోంది.

నన్ను వాళ్ళకి పరిచయం చేశారు మావారు. నన్ను వాళ్లు చూడగానే మళ్ళీ ఇక్కడికి వచ్చినా ఈవిడ తప్పలేదను కున్న రోషమో, మాటరాక గుడ్లప్పచెప్పి చూస్తున్నారు — నాకు 'వాళ్లు మళ్ళా ఇక్కడ తయారయ్యారే అనిపించింది. అందులో పెద్దావిడ కొంచెం తేరుకుని వాళ్ళ వారికి, రామారావుకి (అంటే మావారికి) వుండే స్నేహాన్ని వివరిస్తూ కొంత లెక్చరు ఇచ్చింది. తన చెల్లెల్ని రామారావుకి ఇవ్వకపోతే వాళ్ళ ఆయన అసలు పెళ్లిఅయితే రానని బెదిరించటము — జాతకాలు కలవలేదుకాని లేకపోతే ఆ పెళ్లి ఆపడానికి ఎవరి తరము అయ్యేదికాదని - అంచేత ఈ ఇంట్లో తనకి సర్వ హక్కులూ వున్నాయన్న ధోరణిలో మాట్లాడుకు పోతోంది.

అయ్యారు కాఫీతెచ్చి ఇచ్చాడు. కాఫీ తాగుతూకూడా 'తనచెల్లెలు అంటే రామారావుకి ఎంత ఇష్టమో వర్ణిస్తోంది.'

"మీరు బెనారస్‌నుంచి పంపిన చీరలు ఇంకా దానిదగ్గర వున్నాయి – అంత జాగ్రత్తగా దాచుకుంది." రామారావు మాట మార్చాలని "మీరు తొందరగా తెమిలితే చూడాల్సినవి చూసి వచ్చేయవచ్చు, మళ్ళీ మీకు టైము వుండదు" – "ఏమి వున్నాయి లెండి, ఇక్కడ చూసేందుకు – గుడికెళ్లి వచ్చి, అల్లా వూళ్లో తిరిగివద్దాము" అంటూ సోఫాల్లో జార్లపడింది. మళ్ళీ మాట్లాడ్డము మొదలుపెడితే ఆగదనోఏమో 'తను స్నానంచేసి వస్తానని' లోపలికి వెళ్ళారు.

వాళ్ళు తెమిలి వెళ్లేందుకు సిద్ధము అయ్యేసరికి పది గంటలు దాటింది. ఆయన నన్ను కూడా రమన్నారు. 'నాకు వంట్లో బాగాలేదు రాలేను' అన్నా.

"అయితే మా పిల్లని ఇంట్లో వుంచమంటారేమిటి – మీకు వుంటారు కనక' అంది. అసలే వళ్లు మండుతోంది వాళ్ళ మాటలతోటి – 'నాకు పిల్లల్ని ఆడించడం రాదండి – మీతోటే తీసుకువెళ్లండి' – అని చెప్పేశాను. 'అంతగా ఏడిస్తే ఆయన వున్నారుగా ఎత్తుకుంటారు' – అని కసిగా చెప్పాను. వాళ్లు తిరిగి రెండు గంటలు అయ్యాక వచ్చారు. రామారావు పెందరాలే భోజనంచేసే అలవాటువున్నవాడేమో కొంచెము తలనొప్పి వచ్చింది, ఆలస్యము అయినందుకు. వాళ్లు భోంచేస్తున్నారు. 'అమ్మా, సాపడలే' అంటున్నాడు అయ్యారు. 'అమ్మని పిలు' అన్నారు. అయ్యారు వచ్చి 'పిలుస్తున్నారు అమ్మా' అన్నాడు. వచ్చి దూరంగావున్న విస్తరిముందు కూర్చుని మాట్లాడకుండా తలవంచుకు భోంచేస్తున్నా. అప్పగారు చెల్లెలిని సాధించటం మొదలుపెట్టింది. గుళ్ళోంచి 'ఏవే

శకీ మీరు రారామెరీ, పిల్లగోల పట్టుకో లేకపోయాను - మీరు తొందరగా వచ్చివుంటే వాళ్లయింటికి కూడా వెళ్లివచ్చి, వుండేవాళ్ళం.' ఆమాటవింటే నాకు ఎందుకో మనస్సు చివుక్కు మనిపించింది. తను ఎన్నోసార్లు గుడికి రమ్మంటే 'నువ్వు వెళ్ళి వద్దూ' అనేవారు. చెల్లెలు - 'నువ్వు మహా తొందరగా తెమిలే టట్టూ, - ఇవతలవాళ్ళని అంటావు - అయినా నీతో ప్రయాణము ఏమిటీ నాకు'!

వాళ్లవాదన పూర్తి అయేసరికి, నాలుగైంది. 'ఈ బండికి వెళ్ళం, రాత్రి బండికి వెళ్తాం' అన్నారు వాళ్ళు. మళ్ళా రామారావుకి చెరోపక్కా కూర్చుని సోది మొదలుపెట్టారు. రాత్రి భోజనముచేసి బయలుదేరారు. అంతవరకూ నేను వాళ్లని తప్పించుకు తిరుగుతున్నా - మాట్లాడినా ముభావంగా సమాధానము చెపుతూ గడిపాను. రాత్రి భోజనము చెయ్య లేదు - ఆకలి లేదనిచెప్పి, ఆయన స్టేషన్‌కి రమ్మంటే వంట్లో బాగా లేదని చెప్పి తప్పించుకున్నా. ఆ రైలు రెండుగంటలు ఆలస్యం అవటంనుంచి ఆయన తిరిగి వచ్చేసరికి చాలా ప్రొద్దు పోయింది. నేను బయట మంచం వేసుకుని పడుకున్నా. ఆయన వచ్చి నన్ను లేపకుండా మడతమంచము తెచ్చివేసుకుని పడు కున్నారు - కొంచెముసేపట్లో నిద్రపట్టింది. నాకు అసలు నిద్ర పట్టలేదు. నన్ను లేపితే ఏరకంగా అతన్ని అనాలో, ఆలోచిస్తూ పడుకున్నాను. లేపకపోవడమే కాకుండా, నిశ్చింతగా - నిద్ర పోవడం చూస్తే వళ్ళుమండింది. 'గిల్లి రక్కదామా' అన్నంత కోపం వచ్చింది. కోపాన్ని మంచంలో రుద్దుతూన్నట్టు, ఇటూ, అటూ పొర్లుతూ, చివరకి మంచముపట్టె దగ్గరగాజరిగి, కళ్ల

నీళ్ళతో నవ్వాయ తడుపుతూ, ఎప్పుడో నిద్రపోయాను. మెళు కువ వచ్చేసరికి బాగా పొద్దుఎక్కింది. ఆయన లేవకపోవటం చూసి నేను మళ్ళీ పడుకున్నా. వాకిట్లో గుర్రబండి ఆగిన చప్పుడైతే తలెత్తి చూశాను. మళ్ళా అక్కా, చెల్లెలు సామా నుతోసహా దిగారు. వాళ్ళని చూడగానే బుర్రలో ఏఆలోచనా లేకుండా ఖాళీ అయింది. కొంతసేపటికి తేరుకుని 'మళ్ళీ ఎల్లా వచ్చారా' అని ఆలోచన వచ్చింది. బాడివాడు డబ్బు ఎక్కువ అడిగాడని వాణ్ణి ఇద్దరూ కలసి కేకలు, తిట్లు మొదలుపెట్టారు. వూరుకోకుండా వాడూ అంటున్నాడు. ఆ గోలకి 'మావారు' ఖంగారుపడుతూ లేచి 'ఏమిటీ' అన్నట్టు ప్రశ్నార్థకంగా నాకేసి చూశారు. సమాధానంగా వాళ్ళని చూపించా. "వాళ్ళు మళ్ళీ ఎల్లావచ్చారో అర్థంగాక, మళ్ళీ పడుకుని తెల్లపోయి చూస్తు న్నారు. పెద్దావిడ రొప్పుకుంటూ వచ్చి, వాడు మర్యాద లేకుండా ఎల్లా మాట్లాడుతున్నాడో, రెండు తన్ని పంపు". చిన్నావిడ వాడిని ఎల్లాగో సాగనంపి సినిమాల్లో హీరోయిన్‌లా ఫోజుపెట్టి వయ్యారంగా నడుస్తూ వచ్చింది. 'తను కాబట్టి వాడిని పంపగలిగిందట. 'పెద్దావిడను చూస్తే ఎవ్వరూ లెఖ్ఖ చెయ్యరు' అనేసరికి ఆవిడకు దుఃఖమువచ్చి ఏడుపు మొదలు పెట్టింది. ఇద్దరూ వాదనలోకి దిగారు. నేను లేచి లోపలికి వెళ్ళాను. నావెనక వారూ వచ్చారు - నాతో ఏదో చెప్ప బోయారు. ఇంతలో పెద్దావిడ "పిల్లకి పాలు యివ్వమనండి, ఏడుస్తోంది. అచ్యుతతో చెప్పండి తొందరగా" అంటూ తన ధోరణి మొదలుపెట్టింది. అందరికీ కాఫీలు తెచ్చి యిచ్చాడు అచ్యుత. వాళ్ళు రాత్రి ఎక్కిన పెట్టెలో తెలిసిన అతను ఎక్కా

డట. వీళ్లని 'ఎక్కడకని' అడిగితే వీళ్లు వెళ్లే పెళ్ళివాళ్ల ఇంటిపేరు, యజమానిపేరు చెప్పేసరికి ఆయన తెల్లబోయి, 'అరె వాళ్లు అంతా నిన్నే తిరుపతికి వెళ్లారు, కొండమీద చేస్తున్నారు పెళ్ళి, మీకు తెలువదా' అని అడిగాడట. 'ఇప్పుడు ఏం చెయ్యడం' అని వాళ్లు అనుకుంటే, అతనే 'వచ్చే జంక్షన్‌లో దిగి బెజవాడవెళ్ళేబండి ఎక్కండి, తరువాత తిరుపతి మీరు వెళ్లవచ్చు' అని సలహా ఇచ్చాడుట. అతని సహాయంతో 'ఆ బండిలోంచి', ఈ 'బండిలోకిమారి', – 'ఎంత అవస్తపడి ఇక్కడికి వచ్చారో' చెప్పుకుపోతోంది. మావారు మధ్యలో ఆపి 'ప్యాసింజరుకి వెడితే మీరు రాత్రికి తిరుపతికి చేరేవారుగా' అన్నారు. చిన్నావిడ 'నేను మాత్రం ఇంక ప్రయాణము చెయ్యలేను. మా అక్క కావాలంటే వెడుతుంది' అని సోఫాలో కాళ్ళు జాపుకు ఏటవాలుగా జార్లపడి కళ్లు సగము మూసుకు పడుక వేసింది.

"అదేమిటే పెళ్లికనివచ్చి ఇక్కడ కూర్చుంటే ఏమి బాగుంటుందీ, కావాలంటే మళ్ళీ వెళ్లేటప్పుడు నాలుగురోజులు వుండివెడదాము. ఏం రామూ అంతేనా" అంది పెద్దావిడ. 'తప్పకుండా వెళ్ళాలి లేకపోతే బాగుండదు' అన్నారు మావారు. "బాగున్నా లేకపోయినా నేను మాత్రం రాలేను' అని భీష్మిం చుకు కూర్చుంది చిన్నావిడ.

'అంత ఇష్టములేకపోతే మానెయ్యటమే మంచిదని' నీరసంగా నవ్వుతూ అన్నాడు రామారావు. ఏదో పనివున్నట్టు లోపలికి వెళ్లి కొంచెంసేపట్లో శుభలేఖ ఏదో చేత్తోపట్టుకువచ్చి 'వెంకటేశం పెళ్లి 'అని చెప్పలేదేనాకూఅని చురచురాచూశాను.

'అన్నట్లు మర్చిపోయాను, చెప్పటం. పోనీ దగ్గరేగా వెళ్లివద్దాము, కార్లో వెళ్లవచ్చులే' అన్నారు. పెద్దావిడ 'పోనీ ఆవిడని వెళ్లనివ్వండి' అని సలహా ఇచ్చింది. 'అసలు పెళ్ళి కొడుకు తనకే బంధువని, తను వెళ్ళకపోతే బాగుండదనిచెప్పి, శాంతని వెళ్లేందుకు బట్టలు సర్దమని పురమాయించాడు,' రామారావు.

'మీరు వెడితే మేము ఏం చెయ్యాం యిక్కడ? లేవే వెడదాం' అని చెల్లెలుని బతిమాలింది. వాళ్ళని ప్యాసింజరులో ఎక్కించి మరీవెళ్ళమని రామారావుకి పురమాయించింది, ఆవిడ. 'పోనీ కొంతసామాను ఇక్కడ పెట్టివేస్తే,' అంది చెల్లెలు. 'మళ్లా అన్నీతీసి సర్దుకునేందుకు టైము వుంటుందా,' అని రామారావువంక చూసింది, రామారావు వాచీ కేసి... చూస్తూనే సమాధానము ఇచ్చాడు—'టైము లేదు. అయినా పెళ్ళివారి సామానులో మీ దెంత? వచ్చేటప్పుడు వాళ్లే చూసుకుంటారు. ఇప్పుడు నేను రైలు ఎక్కిస్తానుగదా' అని, అయ్యరుని పిలిచి 'జట్కా తీసుకొచ్చి సామానుతీసుకు స్టేషన్‌కి వెళ్లమని' చెప్పి, తను బట్టలు మార్చుకునేందుకు లోపలికి వచ్చారు. నేను పెట్టెమీదకూర్చుని, మళ్ళీ రానంటే ఏమో, అని ఆలోచిస్తున్నా, 'ఏమిటె, ఇంకా ఆలోచన? లే'అని చెయ్యి పట్టుకుని పైకిలాగారు, 'మీరు వాళ్ళని పంపిరండి. ఇక్కడ నుండి వెళ్లవచ్చు' అన్నాను. 'సర్లే, రద్దూ' అని లాక్కుపోతున్నారు. 'అబ్బా, వుండండి. చీరమార్చుకువస్తా' అన్నాను.

అంతా తెమిలి వెళ్లేసరికి రైలు వచ్చేటయిమ్ అయింది. తొందరగా టిక్కెట్టు తీసుకుని' ఎక్కడ ఖాళీవుందో పెట్టెలు

చూసుకుంటూ ఆడవాళ్ల పెట్టె ఖాళీగావుందని, అందులో సామానుతో వాళ్లని ఎక్కించారు—

'ఒరే అబ్బాయీ—రామం' అంటూ వెనకనుంచి కేక వినిపించింది. ఆయాసపడుతూ పార్వతమ్మగారు ఆ పెట్టెదగ్గరికి వచ్చింది.

'మీరు ఎక్కడికి వెళ్తున్నారో కోడలా' అంటూంటే మావారు "ముందు నువ్వు ఎక్కు టైము అయింది" అని చెయ్యి పట్టుకు పెట్టెలోకి ఎక్కించారు.

'అబ్బాయీ. పరుపుల పెట్టెలాగుందే, నా టిక్కెట్టు ఇదికాదుగా, చూడు' – 'ఫరవాలేదు కూర్చో, గార్డుకి డబ్బు ఇచ్చి మార్చుకోవచ్చు' నువ్వు దిగితే వేరేదాంట్లో ఎక్కేందుకు వ్యవధి వుండదు' అని టిక్కెట్టు తీసుకు గార్డుదగ్గరికి వెళ్ళాడు.

'నువ్వు ఎక్కవేమే శాంతా?' అంటే 'మేము రావటం లేదు తెలిసినవాళ్ళు వస్తే, వాళ్ళని రైలు ఎక్కించేందుకు వచ్చాము – మీరు వెంకటేశం పెళ్లికి వెళ్లటంలేదా?' అన్నాను.

"నేను ఇప్పుడు అక్కడనుంచేగా వస్తోంటా. వారమయింది, నేను వెళ్లి – పెళ్ళి ఆగిపోయింది. పెళ్లికూతురు బొమ్మ అకస్మాత్తుగా పోయిందట. అబ్బాయికి తెలుసు అనుకుంటా – వెంకటేశం చెప్పాననన్నాడు"

'ఏమో నాకు తెలియదు. నేను నిన్ననే వచ్చానని చెప్పి రైలు బయలుదేరబోతోందని' చెప్పాను. గబగబా వచ్చి

మావారు ఆవిడ టిక్కెట్టు ఇచ్చేసరికి రైలు కదిలింది. ఆవిడ వూరుకోక 'వెంక టేశం పెళ్ళి ఆగిపోయినట్టు నీకు తెలుసుకదరా?' అని ప్రశ్నించింది. 'వాళ్లు ఎక్కడ విన్నారో' అని 'వాళ్ల కేసి చూస్తున్నారు మావారు. వాళ్లు పక్కలు పర్చుకు ఎవ రేనా వచ్చినా లేవకుండా వుండేందుకు వీలుగా అన్నీ మూలకు చేర్చు కుంటున్నారు. 'మరి మేము వెళ్లమా' - అని వాళ్లతో అంటూ - రైలుతో నడుస్తున్నారు.

'చాలా థ్యాంక్సు - మళ్ళా వచ్చి మీఇంట్లో నాలుగు రోజులు వుండకుండా ఎల్లాగా వెళ్లము - మీరు వుండండి' - అని చేతులు వూపుతున్నారు. "అమ్మడూ, శాంతా వెళ్ళి వస్తానే, అబ్బాయి నువ్వు బాపట్ల రారాదూ" అని రైలు వెడు తున్నా, పార్వతమ్మగారు గట్టిగా చెబుతున్నారు.

రైలు వెళ్ళిపోయింది. మేము బైటికి వచ్చేదాకా మాట్లాడుకో లేదు. అయ్యరుని ఇంటికివెళ్ళి వంటచెయ్యమని మేము మధ్యాహ్నానికి వస్తామని చెప్పారు. నేను ఇంటికి వెళ్ళి పోతానన్నా, గొడవచెయ్యక కార్లో ఎక్కమన్నారు. దూరంగా జరిగి కూర్చున్నా పెళ్ళి ఆగిపోయినట్టు మీకు తెలుసునటగా- 'నాకు తెలవదుగా, వాళ్లని పంపుదామని'

'అన్నీ అబద్ధాలు - పైకి వాళ్ళు అంటే ఇష్టం లేనట్లు- ఇష్టం లేకపోతేనే రైలు వెడుతున్నా కూడా నడుస్తూ మాట్లా డారు కాబోలు, అంత ఇష్టం వున్నవాళ్లు ఆవిడనే చేసుకో వల సింది - నన్నెందుకు చేసుకున్నారు' - అన్నాను.

'నిన్ను చేసుకుని ఏడిపిద్దామని' 'వాళ్లు మిమ్మల్ని ఏడి పిస్తున్నారు - అవునా? అంటే ఆయన నవ్వేశారు. ★

# నేనూ అంతేనేమో!

అమ్మ మామయ్యని అడగాలని వచ్చినా మామయ్య మౌనము బాధగాతోంచింది. వచ్చి వారం అయినా అన్నగారు తను అడిగినదానికి ఎటూ చెప్పలేదు. మళ్లీ వకసారి కదిలించి చూసింది. 'నీమాట తీసుకుని వూరికిపోదాము అని చూస్తున్నా, ఏమంటావు అన్నయ్యా?'

'అనేందుకు ఏమివుందమ్మా అన్నీ నీకు తెలిసినవేగా. పెద్దాడి పిల్లని వకయింటిదాన్ని చేసేబాధ్యత నా మీద వుందాయె, సరే చిన్నాడు ఏమన్నా కలిసివస్తాడా అంటే అది లేదు సరికదా వాడిసంసారం కూడా నేనే మొయ్యాల్సివచ్చే. యింతకీ ఆ కంపెనీ ధర్మాన్న యింతమందికి తిండికి లోటు లేకండా జరుగుతోంది.'

'నీ మనసులో పెట్టుకునే వుద్దేశ్యం వుండాలేకాని నా పిల్లలు యిద్దరు నీకు బరువవుతారా? ఈనాటికి మా స్థితి యిల్లా అవబట్టి మిమ్మల్ని మిమల్ని బతిమాలాల్సి వచ్చింది. డబ్బు వున్న రోజుల్లో అంతా తిన్నవాళ్ళే, అవి అన్నీ తలుచుకుంటే ఏంతో బాధగా వుంటుంది.

మళ్లీ అభిమానం చంపుకు అడుగుతున్నా, ఈ రెండు ఏళ్లు మాటదక్కించు అన్నయ్యా. నేను అడిగేదిఅల్లా యిద్దరికీ గుప్పెడు అన్నము పెట్టమనే. జీతముడబ్బు ఆరంగమ్మగారి కాలూ, కడుపు పట్టుకుంటే సాయంచేస్తాను అంది.'

'అదికాదమ్మాయి, ఏదైనాఅంటే నీకు కోపమువస్తుంది కాని వాడుయిప్పుడు కాలేజీలో చదవకపోతే వచ్చేనష్టం నాకు అర్థము కావటంలే. మొయ్యలేని బరువు మొయ్యటం నాచాత కాదుసుమా. వాడిని ఏదోపనిలో చేరిపిస్తే వేడినీళ్ళకు చన్నీళ్లు తోడు అన్నట్టుగా ఏదో నీసంసారం లాక్కురావచ్చు. చిన్నాడి చదువు సాగుతుంది.

'మీబావ చెప్రతూనే వున్నారు, అడిగినా వాళ్లుఏమీ పెట్టుకోరుఅని. సిగ్గులేనిదాన్ని నేనే తయారయ్యా' అంది అమ్మ.

'మీ ఆయనా చెప్పొచ్చాడు. ఆరునెలలు వున్నానో లేదో మీయింట్లో అడ్డమయిన చాకిరి చేయించుకుని నా గడ్డి నాకు పెట్టారు. నాకు అల్లా చేయించుకోవడం రాదు. వుంటే నాతోపాటు చూస్తా లేదా వీలుపడదని చెపుతా, అంతేకాని నంగినంగిమాటలు ఎదురుగా చెప్పి చాటుగా తిట్టిపొయ్యను.'

'ఏమండోయ్ నామాట కొంచము వినిపించుకోండి' అని కాంతము కేకపెట్టింది వంటగదిలోంచి.

'ఏమిటె నీ గోల.'

'ఇల్లారమ్మంటే అక్కడనించే బొబ్బలుపెడతారేమిటె?'

'సరే, చెప్పేది ఏమిటోకానీ.'

'వాళ్లకి తిండేగా పెట్టమంటూన్నది మీ చెల్లెలు. బట్టలు, జీతం వాళ్లే అవస్తపడుతారు నామాటవిని వుండనీండి.'

'ఇప్పుడు బాగానే వుంటుంది తరవాత నువ్వు చెయ్యలేక, నేను తేలేక చస్తాం.'

'ఎల్లాగో వకలా అవస్తపడదాము వుండనియ్యండి.'

'పరాయిదయినా అన్నయ్యాకంటే వదినేనయం.'

'ఆఁ, నయమే, యింకో నాలుగురోజులు పోయాక చెయ్యలేక చస్తున్నానని తెల్లవార్లు నన్ను చంపుకుతింటుంది.'

'ఏమిటండి ఆమాటలు. అవి అన్నీ నిజం అనుకోరూ. ఎప్పుడయినా ప్రాణంవిసిగి అనుకున్నాను ఏమొ, దాన్ని యింత రాద్ధాంతము చేస్తారనుకోలేదు. నా తెలివితక్కువ కాకపోతే మీ గొడవల్లో ఎందుకు కలుగచేసుకోవాలి? మాటలుపడ్డము దేనికి?'

'అబ్బ నిన్ను ఏమి అన్నారే యిప్పుడు, వంట అవుతే వడ్డించు పోవాలి.'

'ఏవమ్మోయి సూరమ్మా యిక్కడ తుడిచి పీటలు వెయ్యి. ఆ గోడవారని పచ్చడిగిన్ని వుందికాని ముట్టుకోకుండా వెళ్లు. చూడండి అత్తయ్యా నేను యిక్కడ వాగుతూనేవున్నా, దానిపని అక్కడ కానిచ్చింది. ఆకొంగుతో దాన్ని కొట్టింది. బొత్తిగా మడి మైలా తెలీదు, ఏమి పెంపకమో!'

'చూడలేదు అక్కయ్యా.'

'పోనీలే దాన్నిగురించి వుపన్యాసం యివ్వకు పనికానీ.'

కాంతము సహజంగా చాలా తెలివైనది, గడుసుది మంచి మాటనేర్పుకల మనిషి. తనకి వుపయోగము కొంతేనా లేకపోతే దేనికీ ఆమోదించే రకముకాదు. గృహకృత్యాలలో కూడా యింటిపని అత్తగారు, తోటికోడళ్ల చేత చేయించి, బయటవాళ్లకి అంతా తనే చేస్తున్నట్లు కనపడే చాకచక్యము మరొకరిలో మనము చూడకపోవచ్చు. మహాలక్ష్మమ్మ అన్నగారిచేత ఆఁ అనిపించుకొని ఆ రోజే వూరికి బయలుదేరింది.

నారాయణమూర్తిని కాలేజీలో, గోపిగాణ్ణి హైస్కూలులో చేర్పించమని తెచ్చిన డబ్బు అన్నగార్కి యిచ్చివెళ్ళింది మహాలక్ష్మమ్మ. 'అమ్మని రైలు ఎక్కించిరా, నారాయణమూర్తి' అన్నాడు మామయ్య. అమ్మని రైలు ఎక్కించేందుకు వెళ్ళాను.

'ఒరేయి అబ్బాయి వాళ్ళు ఎవరు ఏమన్నా ఎదురుచెప్పకుండా ఏదిపెడితే అదితిని ఏదో కాలం గడుపుకోండి. యిప్పుడు మన అవసరం, నేను చెప్పేది అర్థంచేసుకో, తెలిసిందా. ఏదయినా మరీ అవసరం అయితే వ్రాయి. తల తాకట్టుపెట్టి అయినా పంపుతాము. మీరు మాత్రము అవస్తపడకండి' అని చెప్పింది.

నారాయణకి కళ్ళనీళ్ళు తిరిగాయి, తల్లిమాటలు వింటోంటే. 'యింత కష్టపడి యిన్నిమాటలుపడి చదివిస్తోంది. తరువాత ఏమి సుఖపెడతామొ ఏమొ' అనుకున్నాడు.

'అబ్బాయి జాగ్రత్త, నా మాటలు మర్చిపోకు, బాగా చదువుకోండి నాయినా.'

'అబ్బాయి వెళ్ళివస్తా వుత్తరాలు రాస్తూవుండునాయినా' అని ఆ కొద్దిసేపటిలో జాగ్రత్త, బాగా చదువుకోమని వెయ్యిసార్లు చెప్పింది. ఆవిడ అమాయకత్వానికి జాలివేసింది.

అమ్మ వెళ్ళినా వెఱ్ఱిగా ఆపక్కే చూస్తూ కూర్చునిపోయా. అంతగోలగావున్న ప్లాటుఫారం కొద్దిసేపట్లో నిర్మానుష్యంగా భీతిగొల్పుతూ కీచురాళ్ళకి, కప్పలకీ పోటీపెట్టినట్లు ఒక శబ్దంకంటె, ఒకటి గట్టిగా వినపడాలి అనే వుద్దేశ్యంతో చెవులు చిల్లులుపడేటట్టు అరుస్తున్నాయి.

'ఎవరు అక్కడ కూకుంటా, ఎవరు అంటే మాట్టాడవే, ఏం' అని వెనకనించి ముసిలికూలీ ప్రశ్నతోటి వులిక్కిపడి లేచా.

'ఏంటి కద? మాట్టాడవేమి పరీక్షకాని పోయిందా, ఎట్టిపసాలు ఎయ్యక యింటికిపోయి సుఖంగుండు. బతికుంటే బలుసాకు తినొచ్చు.'

'ఏరా, మావ, యింటికి రావా ఏమి. నే పోతుండా' అని యింకోకూలీ వచ్చాడు.

'వత్తుండారా, ఈ కుఱ్ఱాయిన ముఖము చూస్తే ఏదో అగాయిత్యము చేసేవోళ్లాగుంటే కనుక్కుందాము అని యిట్టా వచ్చా' అన్నాడు.

'నాకేంఖర్మ చావటానికి, కాసేపు కూర్చుని పోదాము అనుకున్నా. మీ కెందుకు నా గొడవ వెళ్లండి' అన్నా.

'ఈ కబుర్లకేంలే, యింతకంటె ధీమాగానే చెప్పాడు ఆ రాజుగారి అబ్బాయి. నీ బట్టలు అయినా మాసివున్నాయి. ఆ కుఱ్ఱోయన ఏమి హోషుగున్నాడు. కొత్తబట్టలు, అత్తరు పూసుకుని, సేతినిండా పేపర్లుపట్టుకూకుంటే దొర్లాగున్నాడు. ఆయాలకూడా నేనేఅడిగా యిక్కడ కూకుండావే అని. పట్నం పోతున్నానని చెప్పాడు. నిజమేకామోల్ను అనుకున్నా అర్థ రాత్రికాడ కబురువచ్చింది రమ్మని. వచ్చి చూస్తునుకందా ఆ కుఱ్ఱోయన్ను సూడంగనే కడుపులో దేవేసింది అనుకో.'

'శుభమా అని చదువుకుందాము అని ఈ వూరువస్తే చావో అని మొదలుపెట్టావు ఏమిటి నువ్వు.'

'ఏరోయి మావ! మనము పోదాముర్రా, నూకలుతీరాయి ఏమో, నువ్వుసెప్పింది బుఱ్ఱకి ఎక్కటంలే. ఎవడిఖర్మ ఆడిది, రాహేసి పోదాము.'

'ఎందుకు మాష్టర్గోర్ని పిల్చుకొస్తేసరి.'

'ఆగరోవు మావోయి! ఆయనకి కనిపించామో యింటికెళ్లి నీళ్లు మొయ్యి, పిల్లనెత్తుకో అని పురమాయిత్తాడు. ఎల్లాగో తప్పించుకువత్తే మళ్లీ ఆయనకాడికి పోదాము అంటావే, నీకుగాని వోపిగుంటే ఎల్లు నే పోతుండా యింటికి.'

'వుండి ఎహే, నీళ్లయినా మొయ్యొచ్చుకాని, రాత్రి అంతా జాగారం సెయ్యవద్దూ యీాయన సత్తే.'

'వాళ్లమాటలు వింటోంటే వొళ్లు మండిపోయింది. మళ్లా నాలోనేనే తమాయించుకుని కిక్కురుమనకండా లేచి యింటికి బయలుదేరా. నేకొంతదూరం వెళ్లేదాకా ముసలాడు చూస్తూనే వున్నాడు. చిత్రమైన మనుష్యులు. వాళ్లధోరణే కాని మనమాట వినిపించుకోరు. పాపం వాడినని లాభము ఏమిటి, వాడి జీవితంలో ఎంతమంది చస్తే కాపలాకాసేడో. నా వాలకం కూడా వాడి అనుమానానికి తగ్గట్టుగానే వుండి వుండాలి. ఏవో ఆలోచిస్తూ యింటికి వచ్చేసరికి బాగా చీకటి పడింది. రాగానే అమ్మమ్మ కోప్పడింది.' యింత రాత్రిదాకా ఏమిరాచకార్యము చక్కపెట్టావు? రైలువెళ్లి ఏజాము అయింది. ఏమయ్యావో కొత్తవూరు అని మనస్సులో పిసుక్కు చస్తున్నా.'

ఆవిడ అన్నదాంలో తప్పులేకపోయినా ఆమాటలు చాలా బాధపెట్టాయి. వెఱ్ఱిదుఃఖము వొచ్చింది పెరటిలోకి

వెళ్లి మొహాము కాళ్లు కడుక్కునివచ్చి అన్నానికి కూచ్చున్నా.

అత్తయ్య వడ్డిస్తూ 'అల్లా వున్నావేం మీ అమ్మ వెళ్లా రనా' అని ఎంతో ఆప్యాయంగా అడిగింది.

ఆవిడసంగతి అంతకుపూర్వము నాకు సరిగ్గా తెలీదు. 'అన్నము చల్లారిపోయింది. వేడిఅన్నము వుంటే కొంచెము పెట్టు అత్తయ్యా' అన్నాను.

'అంతా అల్లాగేవుందిలే తిను' అంది. అసలే పొడి అన్నము, పచ్చడిముద్ద కంఠము దిగటంలేదు. వుండచుట్టుకు బైటికివస్తోంది. 'కొంచము నెయ్యి వేస్తావా' అని అడిగా. గిన్ని వూడ్చి వర్షపుచినుకంత అభికరించింది.

'మీ అమ్మలా అప్పులుచెయ్యటం మీ మామయ్యకి యిష్టంవుండదు. అందుకనే ఆయన ఒక్కరికీ వేస్తాం. మేము ఎవరము నెయ్యి వేసుకోము. మాతో పాటె మీరు' అంది. 'ఏల్లాగో పూర్తిచేద్దాము' అని మజ్జిగ పొయ్యమన్నా. అల్లాంటి వాసనమజ్జిగ పుట్టాక తినిఎరగం. ఇంటిదగ్గర భోజనం కళ్లల్లో కట్టినట్టయింది. నాన్న వందలు వందలు ఎత్తి పంప లేకపోవచ్చు కాని భోజనము పోల్చిచూసుకుంటే మాది జమీందారితిండి అనిపించింది.

వేడిఅన్నము, వేపుడుముక్కలు చారులోకూడా నెయ్యి లేకుండా తినలేనితిండికి అలవాటుచేసింది అమ్మ. బామ్మ చెప్పి నట్టు కరిణీకంపరీక్ష పాసై యింటిదగ్గర కూచ్చుంటే ఎంతో బాగుండేదనిపించింది. యిల్లా ఆలోచన పోయేదేకాని అత్తయ్య కేకతో గబగబామింగి చెయ్యికడుక్కు బయటపడ్డా!

(29)

తెల్లవారుజామున లేచి చదువుదామని లాంతరు కోసము తడుముకుంటున్నా. యింతలో కాంతము అత్తయ్య కంఠము వినిపించింది. 'పడుకో, యిప్పటినించి ఏమిచదువు తావులే, పగలంతా చదివితేచాలు' అని దీపము బుడ్డీవెలిగించి చిన్నత్తనిలేపి 'నీళ్ళకి వెళ్ళమని' పురమాయించింది. పెద్దత్త య్యనిలేపి వేడినీళ్లు పెట్టమని, ఆవిడ కూతురు శాంతని లేపి పెసలు రుబ్బమని చెప్పి, బామ్మతో 'పాలసుబ్బమ్మ దగ్గరికి వెళ్ళి వోసోలెడు పాలు పొయ్యమని తీసుకురండి అత్తయ్యా' అని అతి ఆప్యాయంగా గిన్నిచ్చి పంపింది.

పెద్దమామయ్య చిన్నవయస్సులోనే గతించాడు. కూతురు శాంత, కాంతమ్మ అత్తయ్య దగ్గరే వుంటుంది. వాళ్ల అమ్మ, మేనమామల యింటికి వెళ్ళినా అది వెళ్ల నంటుంది. తల్లిమీద నేరాలు బామ్మకి, కాంతమ్మ అత్తయ్యకి చెపుతుంది.

దినకృత్యాల్లో నాకు మా గోపీకి కొన్ని పురమాయిం చింది. వారానికి ఒకరోజు పల్లెకి వెళ్ళి సంతలో కుండెడు పెరుగు జాగ్రత్తగా చవకగా తెచ్చేపని గోపీకి. కాయకూరలు తేవటం, మామయ్యకి మధ్యాహ్న భోజనము తీసుకువెళ్లటం నాకు నియమించింది. మామయ్య మొదట భోజనము తే వద్దన్నా అత్తయ్య ఏమందో మళ్లీ ఆమాట ఎత్తలేదు.

కాలేజీకీ కంపెనీకి చాలాదూరము. మొదట చాలా కష్టంగావున్నా కాలము జరుగుతోన్న కొద్దీ అలవాటయి, ఒక రోజు వెళ్ళకపోతే ఏదో మర్చిపోయినట్టు రోజుఅంతా తడుము కునే వాణ్ణి.

మా గోపీ, వాళ్లు ఒకటి అంటే వాడు రెండు అనేవాడు. ఎంత చెప్పినా వినేవాడు కాదు.

ఒకవారం పెరుగు తక్కువ తెచ్చాడని అత్తయ్య అనుమానంపడి అమ్మమ్మతో 'చూడండి అత్తయ్యా నాకేమి గోపీమీద పగా? మీరు చూడండి, యిప్పటినించి ఏమి బుద్ధులు చెప్పండి' అంటోంటే గోపీగాడువిని, పెద్దగొడవ పెట్టుకున్నాడు. అంతలో మామయ్య అందుకుని చెయ్యిచేసుకుని బైటకి పొమ్మన్నాడు.

వాడు పెట్టిబేడాకట్టి బైలుదేరాడు. మళ్లీ అత్తయ్య అంతా తనని మెచ్చుకోవాలని 'గోపీ నామాటవిను యీసారికి ఏమీ అనుకోకు; మీ మామయ్య కోపము ఎరగవుకనకనా. అనవసరంగా చదువు పాడుచేసుకోకు. మీ అమ్మ మొహం చూసి మిమ్మల్ని పెట్టుకుంట. మీ మామయ్య వెఱ్ఱికాని పెడితే తింటావుకాని కొడితే పడతారా ఈరోజుల్లో' అని యింకా ఏవో అనబోతోంది. యింతలో వాళ్ల అన్నయ్య సుబ్బారాయుడుగారు పిల్లాడిని తీసుకురావటం చూసి 'ఎప్పుడు రావటము అన్నయ్యా' అంటూ చాటంత మొహము చేసుకుని ఎదురువెళ్లింది. ఆ కుఱ్ఱాడు అత్తయ్యనిచూసి శ్రుతి పెట్టిలా నోరుముయ్యకుండా రాగము మొదలుపెట్టాడు. వాడిని వూరుకోపెట్టే ప్రయత్నంలో అన్నా చెల్లెలు కొంతసేపు అవస్త పడ్డారు. ఏమీ లాభము లేకపోయింది.

నా దురదృష్టంకొద్దీ వాళ్ళకంట నేనుపడ్డా, 'వాడిని ఎత్తుకువెళ్ళి బిళ్ళలు కొనిపెట్ట' మని అర్ధణా యిచ్చి బైటికి కుర్రాడితో సహా తరిమారు. వాడిని ఎత్తుకున్నానన్నమాటేకాని

వాళ్ళంతా జెట్టులు పొకుతోన్నట్టువుంది. వాడి రూపుతో నాకేమిపనికాని ఆ ముక్కు నాచొక్కాకి రుద్దుతోంటే భరించలేక ఒక్కటి తగిలించా. దాంతో ఆ వీధి ఎగిరిపోయేట్టు అరవటం మొదలుపెట్టాడు. వీడి ఏడుపువిని యింటిల్లిపాది ఎక్కడ పరుగెత్తుకువస్తారో అని గబగబా వాడిని దూరంగా లాక్కుపోయి నోరునొక్కి, మరికొంచము చురుగ్గా నోరుమూసిందాకా తగిలించా. లోపలే మింగి ఎగుపులు మొదలుపెట్టాడు. వాడికి ఏదో కొనియిచ్చి కొంతసేపు అక్కడా యిక్కడా కూర్చుని యింటికి తీసుకువచ్చా. మళ్ళీ వాళ్ళనిచూసి రాగముతీసే మొహాము పెట్టాడుకాని, నాకేసిచూసి వూరుకున్నాడు, ఎవరికీ లొంగనివాడు నాకు భయపడ్డాడు అని లోపల కొంత గర్వపడ్డా. ఛాతీవిప్పుకు బొత్తాము సవరించుకు బైటికిపోయా.

ఆ రాత్రి నాచోటు చుట్టము మామయ్యగారు ఆక్రమించారు. నా పడక వెనకపక్క అరుగుమీదకే ఖరాయించా. మొదట నిద్రపట్టినా కొంతసేపట్లో మెళుకువవచ్చి నిద్రపట్టే సూచన కనపడలేదు. చీకటంటే చచ్చే భయము. దానికి సాయము ఎవరో మనిషి వెళ్లిన అలికిడయింది. దొంగ ఏమోనని ఎల్లావున్నవానిని అల్లాబిగిసుకు పడుకున్నా. కొంతసేపటిలో గుసగుసలు వినపడ్డాయి. వళ్లంతా తిమ్మిరెక్కి చెమటపట్టి స్పృహతప్పినట్లయింది. కొంతసేపటికి అవతలమాటలు వినేస్థితిలోకివచ్చా. మాటాడేది అత్తయ్యా, మామయ్యా అని అర్థమయింది. అత్తయ్యా కంఠమే ఎక్కువ వినిపించింది, 'నామాట వినండి ఆడపిల్లకి పెద్దమనిషి అవడమే లెక్కకాని పళ్లతో నిమిత్తములేదు. అసలు అది ఎత్తరిపిల్ల – అందులో ఇంత సంపా

యించుకున్నాడు. పిల్ల సుఖపడుతుంది. మనకి కొంత బెడద తీరుతుంది. మనము పెళ్ళిచెయ్యాలి అంటే ఏమీలేనివాడికి యిచ్చినా అరసంచివుంటేతప్ప. పిల్లవాళ్ళయింటికి వెళ్ళేము. ఇంతకి వాడిమరదల్ని యివ్వనన్నారు కనక మనకి యిల్లా అనుకునే అవకాశం వచ్చింది. తరువాత మీ యిష్టం' అంటోంది అత్తయ్య.

'అదికాదే నాకుమాత్రము యిష్టంలేకనా? వాళ్ళంతా ఎప్పుడు వదులుతారా అని నాకుంది. కాని లోకము ఏమనుకుంటుందో అని భయము. తండ్రి లేడుకదా అని పాతికేళ్ళు వారవున్నా యిచ్చి చేశాడని వాదుపడుతుంది. నారాయణకిచ్చి ముడిపెడదాము అనుకున్నాముగా అల్లా చేద్దాములే.'

'సరేలెండి అన్నయ్యా పెళ్లి అయ్యేదాకా అక్కడవుండి వస్తా. మీరు, మీ వాళ్లు ఏమన్నాకండి. వాడికి పెళ్లి అవదని మీరు భయపడకండి. అసలు మీయింట్లో విశ్వాసము అన్న మాటలేదు. ఎంతచేస్తే ఏమిలాభము. గానుగ ఎద్దులా చాకిరి చేస్తే యింత తిండివేస్తున్నారు. నామాటకి విలువ ఏడిస్తేగా.'

'ఇదిగో నామాట విను. అనవసరంగా పుడుకుమోతుతనం తెచ్చుకోకు. నువ్వుబాగా ఆలోచిస్తే నువ్వే వద్దంటావు. అయినా పెద్దది మా అమ్మ వుందిగా ఆవిడతో అని చూస్తా, ఏమంటుందో.'

'మీరు వూ అంటే మిగిలినవాళ్లని వప్పించే బాధ్యత నాది, తెలిసిందా. బాగా ఆలోచించే చెపుతున్నా! తరువాత మీ యిష్టం.' ఈధోరణిలో సంభాషణ జరుగుతోంది. నాకు

ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు కాని శాంత వాకిలివూడ్చే చప్పుడుకి వులిక్కిపడి లేచి కూచున్నా.

కాంతమ్మ అత్తయ్య చాలా హడావిడిగా అటూ, ఇటూ తిరుగుతూ అందరికి అన్వయించేటట్టు దెప్పిపొడుస్తూ గిల్లికజ్జా తెచ్చుకోవాలనుకున్నట్టు కనిపించింది. వాకిట్లో ముగ్గు వెయ్యలేదన్న నెపముతో శాంతపీపు సుద్ధిచేసింది. అమ్మమ్మ దగ్గరకి పోయి శాంత ఆలాపన మొదలుపెట్టింది.

కాంతమ్మ అత్తయ్య ఈనినపులిలా రంకెలు వేస్తూ అమ్మమ్మపైన యుద్ధానికి దిగింది.

'పొద్దున్నే ఎందుకే యింతరాద్ధాంతం? అయినా ఎవరు ఏమన్నారు? నిన్ను అని యీ యింట్లో బతకగలమా.'

'అనండి అత్తయ్యా మీయిష్టమువచ్చినట్టు వీళ్ళముందు నన్ను చులకనచెయ్యాలి అనేగా మీ వుద్దేశ్యం. మీరు అంతా ఒకటే. నేనేగా పరాయిదాన్ని. ఆ సీతాపతిగారి కోడలులా అందర్ని అప్పుడే వెళ్ళగొట్టివుంటే మీచేత మాటలుపడాల్సి వుండేదేకాదు. యిప్పుడు మించిపోయింది ఏమిటి. నా మాట కాదని యీ మందఅంతా నా యింట్లో ఎల్లా వుంటారో చూస్తా.'

'అమ్మాయి కాంతం. చంటాడికి, మొహాము కడిగి ఏమి తాగుతాడో పట్టమ్మా. రాత్రి నిద్రపోనివ్వడు. పగలు నిలవనివ్వడు. ఎల్లాచచ్చేది వీడితో' అని అన్నగారు చెపుతున్నాడు.

'ఊరుకో అన్నయ్యా వాడిని ఊరికే విసుక్కోకు. ఆ మూడుముళ్ళూ పడితే వచ్చిందే చూస్తుంది. ఎవరికోసం.'

ఆ విషయం నేను ఎత్తటం మానేసి చాలకాలమయినా ఇసుగూ పోరుగూ చెప్పుకుంటూనే వున్నారు.

మళ్ళీ మా ఇంట్లో సందడి మొదలుపెట్టింది. మా మరిది భార్య రాకతో సుధ తనకి బాగా తెలుసునని అందరికి తలో రకంగా చెపుతూ జయరామ్ వచ్చే వేళకి సుధ చక్కదనం గురించి తెగపొగుడుతూ గట్టిగా మాట్లాడేది. కొన్నాళ్ళు నేను వాదానికిదిగినా నాకు నేనే సమాధానపడి నా స్థానం పెరట్లో బాగడచెట్టు కిందకి మార్చుకున్నా. కొత్తగాకాసిన జామిచెట్టు నిండా రామచిలుకలు చేరి చేసేసందడి చూస్తూ గడపేదాన్ని.

నన్ను నేను మర్చిపోయేందుకు నేను ఇంకెవరిగానో వూహించుకుంటూ పెద కథలా ఎందరినో ఆ కథలో మను ష్యుల్లా చూస్తూ దుఃఖం వస్తే ఏడుస్తూ సంతోషం వస్తే నవ్వుతూ అందులో కాలం గడపటం సులువుగా తోచి తీరిక దొరికినప్పుడల్లా మరో లోకంలో వున్నట్టు వూహించుకుంటూ కొంతకాలం గడిపా. దానికి విఘ్నంగా మా దొడ్లో కుక్క పిల్లల్ని పెట్టి చచ్చిపోయింది. మిగిలినపిల్లలు ఏమి పోయాయో ఎవరూ పట్టించుకోలేదు. అందులో నల్లమచ్చలు వున్న కుక్క పిల్ల నన్ను వదలకుండా నా కళ్ళల్లోకి చూస్తూ నా దగ్గరే గడపడంతో మళ్ళీ కుక్కపిల్లతో గడపడం మనస్సుకి కొంత కొత్తదనం ఆకర్షించింది. ఆ కుక్కపిల్ల రాక ఆ ఇంట్లో ఓ రెండు పార్టీలుగా తేలింది. మా తోటికోడలుకి దాన్ని చూస్తే చంపేద్దామా అన్నంత అక్కసు వెళ్ళపోస్తుంది. మా అత్తగారికి కొంచము ఇష్టము, కొంచము చిరాకు అవటం వల్ల అతను ఇంట్లో వున్నంతసేపు కుక్కపిల్లకోసం భార్యా

భర్తలు కొట్లాడుకోవడం సరిపోతుంది. ఇంక జయరామ్‌కి ఇంటి దగ్గర వుండే తీరికేది? నాలుగు వూళ్ళకి ఒక్క డాక్టరు అన్న పేరు మొయ్యలేక కీర్తిని పెంచేందుకు కొత్తకారు కొనుక్కుని నర్సుని తీసుకుని ఆ వూళ్ళు తిరిగి వచ్చేసరికి ఏ వేళ్ళైనా అవ్వొచ్చు. ఎప్పుడో కాని నాతోటి మాట్లాడరు. ఇంక కుక్క పిల్ల ఎందుకు? ఆ రోజు జయరామ్ భోజనానికి చాలా ఆల స్యంగా వచ్చారు. మా తోడికోడలు రాస్తూ పుట్టింటినించి వచ్చిన వుత్తరం పట్టుకొచ్చింది. సుధ భర్త పోయాడుట పాపం. ఇంకా ఏడాదన్నా కాలేదు పెళ్ళయి, అంటూ తడిలేని కళ్ళని కొంగుతో వొత్తుకుంటోంది. జయరామ్ వుత్తరం తీసుకు మళ్ళా చదువుకుని పెదిమ విరిచి, విచారం తెలుపుకున్నాడు. ప్రకృతికి సుధమీద ఆ యింట్లో సానుభూతి పెరిగింది. వాళ్ళా క్కరే విడివిడిగా వుత్తరాలు వ్రాస్తున్నారు. నాకు మళ్ళా జీవితంలో ఏదో పోతున్నట్టు బాధ. ఈసారి నా మనస్సులోది ఎవరికీ తెలపదు. నాలో నేనే వుండిపోయా. నా కుక్కపిల్ల నన్ను వోదారుస్తూ వుంటుంది. నాన్న దగ్గరనుండి వుత్తరం వచ్చింది. వ్యాపారంలో నష్టం వచ్చిందట. మొగపిల్లలు ఎవరూ ఆదుకోవటం లేదుట. అల్లుడు ఏమైనా సర్దుతాడేమో అడగమంటూ. నాకు అప్పుడు నిజంగా అభిమానం వచ్చింది. మళ్ళా ఆయన ఆకారం కళ్ళముందు మెదిలినట్టుంది. ఒక్క శరీరం కోటులో దాచుకుని ఇన్ని అవస్థలు పడుతున్నాడు. ఎవరికోసమో! ఈ కాపన్నం వదులుకుంటే బాగుండును.

తనుమాత్రం డబ్బువిషయం జయరామ్‌ని అడగదల్చుకో లేదు. నాకు అప్పుడప్పుడు గుండెదడ, నొప్పి వస్తున్నాయి.

మొగట్లో కబురుపెడితే జయరామ్ నన్ను వచ్చి మందు ఇచ్చి వెళ్ళేది. ఇప్పుడు కబురుపంపటం మానేశాను. అప్పుడప్పుడు రావటం పరిపాటయిపోయింది. నిన్న రాత్రి నొప్పి చాలా ఎక్కువగా వచ్చింది. కాళ్ళు చేతులూ తిమ్మిర్లెక్కాయి. అయినా జయరామ్‌ని లేపలేదు. ఎప్పుడో వాళ్ళు అంతా మొద్దుబారుతుంది అంతే. ఇప్పుడు నాకు చచ్చిపోతానన్న భయం లేదు. మా గోడ వెనక గుడిసెలో గంగమ్మ ప్రాణం కొట్టుకుం వూసుకుంది. అంతమంది పిల్లలతో అది చేసుకున్న వాడి చేష్టలు తలుచుకుని ఏడ్చిఏడ్చి ఎగిరిపోయింది.

బాధపడని జీవుడు వుండడేమో నువ్వు ఎంత అదృష్టం చేసుకున్నావో అనిపిస్తోంది. నీలా సుఖంగాగడిపే సంసారాలు వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. ఇంకా వ్రాయాలని వుంది. ఇప్పటికే నువ్వు విసిగిపోయి వుంటావు. ఇవాళ జరిగిన సంగతి వ్రాసి పెన్ను మూసేస్తా. గుండెల్లో నెప్పి వుండివుండి వస్తోంది. కడుపులో తిప్పుతోంది. ఎల్లాగో డిస్పెన్సరీకి వెళ్ళగలిగాను. జనంతో కిటకిట లాడుతోంది. జయరామ్ వచ్చి కబురు చెయ్యకపోయావా? నువ్వెందుకు రావటం అని మొహం చిట్లించుకున్నాడు. తల తిరుగుతోంది. ఇంటికి వెళ్ళాలని వెనక్కి తిరిగాను. మెట్లమీదకి తూలటం తెలుస్తోంది. శరీరం నాకు లొంగలేదు. నాకు మెళుకువ రావటానికి పొద్దు తిరిగింది. జయరామ్ స్నేహితుడు పక్కన నిల్చుని పరీక్ష చేస్తున్నాడు. ఎల్లావుంది అని అడుగుతున్నాడు. వాళ్ళ మొహాల్లోకి చూడలేక కళ్ళు మూసుకున్నా. మళ్ళీ అతనే ఇంటికి వెళదామా, అని

మాటమార్చి అడుగుతున్నాడు. సర్సువచ్చి పట్టుకోబోయింది.

జయరామ్ కళ్ళల్లో తడి మెరిసింది. లేవగలవా సుశీ! అంటూ దగ్గరగా నిల్చొని అడగటంతో నాలో దాగిన దుఃఖం కట్టలు తెగిన నదిలా బయటపడి పసిపిల్లల్లా అర్థంలేకుండా ఎంత సేపో ఏడ్చాను. ఆ క్షణంలో జీవితం చాలిస్తే ఎంత బాగుండును అనిపించింది.

మళ్ళీ జీవితంమీద మమత పెరుగుతోంది. కానీ నన్ను అడక్కుండానే శరీరం, జీవుడు, తొందరలోనే విడిపోతారని పిస్తోంది. వాటికి సఖ్యత కొంతకాలంగా వుండటంలేదు. నా పరిసరాలు నన్ను తొందరగానే మర్చిపోతాయి. నాకు వారసులులేరు. జయరామ్ భవిష్యత్ సుధతో సుఖంగా గడచిపోవచ్చు.

నాకు బంధంగావున్న కుక్కపిల్ల రెండు రోజులనించి కనపడటంలేదు.

ఎక్కడవుందో పాపం. దానికి ఆకలి అయితే దీనంగా నా కళ్ళల్లోకి చూసేది. నా వొళ్ళో తలపెట్టుకు తోకఆడిస్తూ గారంచేసేది. మాటలురాని పసిపిల్లలా నన్ను కవ్విస్తూ నా చుట్టూ తిరిగేది. మా యింట్లోవాళ్ళు దాని విషయం ఎక్కువ పట్టించుకోరు. నాకు యిప్పుడు ప్రతి చిన్న విషయం పెద్ద సమస్యగా తోస్తోంది. ఇంక నా బాధ ఆపుతున్నా. మళ్ళీ వ్రాయగలిగితే మరోసారి వ్రాస్తా. అన్నట్టు మీ పాపాయి ఎవరిలా వుంటుంది? నాకో ఫోటో పంపలేదేం. నా దగ్గర చిన్న పిల్లల ఫోటోలు వున్న పాంప్లెట్స్ ఎన్నో వున్నాయి. వాటిలో ఎవరిలావుంటుందో పోల్చి వ్రాస్తా. మరివుంటా —

జవాబు ఆ వుత్తరంలోనే ఖాళీగావున్న కొద్దిచోటులో మీనాక్షి అక్షరాలు ఇరుగ్గా వ్రాసింది, నీ వుత్తరం చదివితే నువ్వు జయరామ్‌ని వదలి ఏ లోకానికీ వెళ్ళలేవు అని తేలి పోయింది. ఇంక రెండోది ఆలోచించే తత్వం వున్నవాళ్ళు ఎక్కువగా సుఖపడలేరు. మూడు – నీకు తొందరలో పాపాయి పుట్టాలని ఆశీర్వదిస్తున్నా. నీ ఆలోచనలు అన్నీ ఎప్పుడు ఎల్లా వుంటాయో వ్రాస్తే చదవాలనివుంది. ఇంక నా అదృష్టాన్ని చాలా గొప్పగా వూహిస్తున్న నీకు అమాంతం నిస్పృహ కలిగించటం నాకు యిష్టంలేదు. పైగా మా పాప రాకతో మా మధ్య వో అగాధం పెరుగుతోంది. అది నీకు వ్రాసేందుకు నాకు చాలా బాధగావుంది. నువ్వు ఎప్పుడో జరిగిన సంఘట నలు తల్చుకుంటూ జీవితానికి దూరంగా వుండేందుకు ప్రయ త్నిస్తున్నావు.

నిత్యం అవే నా జీవితంలో మరో విధంగా నీడల్లా తొంగి చూస్తూ వుంటాయి అంటే నువ్వు నమ్మగలవా? నువ్వు ఊహిం చినట్టు జయరామ్ సుధని చేసుకుంటాడన్న నమ్మకమేమిటి? చేసుకున్నా సుఖపడటంవట్టిమాట. వాళ్ళని కాలందూరం చేసింది. మళ్ళీ కలిసినా మధ్యనిలిచిన నీడలు భూతాల్లా పెరిగి ఆత్మల్ని మింగి జీవితావశేషంలో విరాగుల్ని చేస్తాయేమో? అయినా ఆ వూహాలన్నీ వట్టివి. నువ్వు మళ్ళీ పూర్వంలా ఆరోగ్యంగా వుండాలి అని నా కోరిక. ఇన్నాళ్ళు ఎందుకు దాచావు? ఇంట్లో డాక్టర్ని పెట్టుకుని నువ్వు జబ్బుని పెంచుకున్నావంటే నీ మీద నాకు చాలా కోపంగావుంది. మనం వుండి సాధించలేనిది పోతేమాత్రం ఎవరికి నష్టం. అయినా ఎవరి జీవితం వాళ్ళది.

మీ అమ్మపోతే మీ నాన్న అంత మంచివాడుకూడా మళ్ళీ చేసుకోలేదా ఏమిటి!

ఇంకొకరి కోసం జీవిస్తున్నామన్నమాట వట్టిదే! మన కోసమే మనం పాకులాడుతున్నాము. అది మాత్రం ప్రతివాళ్లు వప్పుకోవాలి. అవునా!

నీవుత్తరం మళ్లా చదువుకుని నీమనస్సు మార్చుకున్నట్లు మళ్లా నీవు వుత్తరం వ్రాస్తావని ఎదురు చూస్తా వుంటా—

జయరామ్ మనస్సుకి పూర్తిగా అర్థమయినట్టులేదు. చదివిందే పదిసార్లు చదువుకున్నాడు. అందులో పూర్తిగా అర్థ మయింది సుధని చేసుకుంటే సుఖముండదు- అన్నవాక్యం. అదే ఆలోచన స్థిరపడింది. అంతా ఎదురు చూసినట్లు కాకుండా సుశీల బంధువు లమ్మాయిని చేసుకున్నాడు. సుధకి ఈసారి జయరామ్‌మీద ఏవగింపు కలిగింది. చుట్టుపక్కల స్నేహితులకి తమ వూహాలు తప్పినందుకు ఇదేమిటి? పిచ్చాడు అని నిర్వ చించారు. వంటావిడ కాలక్షేపానికి ఎన్నో కథలు పోగుచేసింది. వినేవాళ్ళకోసం నిరీక్షిస్తోంది.

జయరామ్‌ను సుశీలకి తను అన్యాయం చేశానేమో నన్న భయం విడపటంలేదు. కొత్తగావచ్చిన వధువును అపు రూపంగా చూచుకొంటున్నాడన్న వార్త వంటింట్లో పుట్టింది. నెమ్మదిగా బజారుదాకా చేరింది. జయరామ్‌కే మార్పువచ్చింది బొగడచెట్టు నీడని కూర్చుంటే మనస్సు స్థిమితంగా వుంటోంది. చాలా పొద్దుపోయేదాకా జయరామ్ అక్కడే గడపటంతో సుశీలకి ఆ చోటంటే ఎక్కువ ఇష్టం అని విన్నవధువు మన స్సులో నల్లమబ్బులు కమ్ముతున్నాయి.

*

# కర్త-కర్మలు పూర్తిచేసిన కథ

ఆరోజు రాత్రి రామచంద్రయ్యకి మెళుకువ వచ్చాక మళ్ళీ నిద్రపట్టలేదు. దూరంగా ఠాణాలో గంటలు కొట్టినప్పుడల్లా లేచి కూర్చుంటూ, మళ్ళీ పడుకుంటూ గడుపుతూ, తెల్లవారుజాముకి నిద్రని బంధించాడు.

సూర్యకిరణాలు మెల్లిగా లాలించాయి. మెళుకువ రాలేదు. సూటిగా కళ్ళల్లో గుచ్చుతూ చెలగాట మాడాయి; లాభంలేదు. ఈసారి అద్దంమీదనించి మొహంమ్మీద పడి వెచ్చటి స్పర్శతో పక్కకి తిప్పగలిగాయి. సీతారావమ్మ వీధి గుమ్మంలో విప్పిన కంఠం మేలుకొలుపులా వినపడి రామచంద్రయ్య లేవటం ఏమిటి, పెరటిగుమ్మంలో కళ్ళు విప్పటమే జరిగింది.

ఆ హడావిడిలో పాలచెంబు కనపడక, కాఫీగిన్నె తన్నేశాడు. ఎంత చిన్న శబ్దమైనా సీతారావమ్మ చెవిని పడుతుంది. మనిషి అర్భకురాలేతప్ప, మిగిలిన విషయాల్లో ఆవిడని కాదనేందుకు ఎవరో కాని సిద్ధపడరు. వంటింట్లోకి ఎకాఎకీని వచ్చేసింది. రామచంద్రయ్య పాతగుడ్డపెట్టి, వో పక్కనించి, తుడుచుకు వస్తున్నాడు. కాఫీ ప్రవాహం మరోపక్కకి తిరిగి కూరాయల బుట్టని ముట్టుకుని వంటపొయ్యి దగ్గరికి చేరింది.

"హవ్వ" అంటూ నోరు చేత్తో మూసుకొంది సీతారావమ్మ.

"మరేం లేదూ" అంటూ నసుగుతున్నాడు రామచంద్రయ్య.

"మరేమోనే నాన్న" అంటూ వసంతలక్ష్మి మాట చెప్పలేకండా సంతోషంతో వచ్చిన ఆయాసాన్ని అణచుకుంటూ మంచినీళ్ళబిందె చొట్టపడేలా కిందపెట్టి, "అమ్మా వినవే" అంటూ గడపమీద కూర్చుని గట్టిగా వూపిరి వదులుతూ పమిటకొంగుని చేతులతో బంతిలా చుట్టేస్తోంది.

"ఆ గడపమీద కూర్చోవద్దని ఎన్నిసార్లు చెప్పాను" అంటూ కూతుర్ని కసిరింది సీతారావమ్మ.

"సర్లేవే" అంటూ కిందకి జరిగి, "మరేమోనే ఆ రావిచెట్టు గట్టుమీద వో స్వాములవారు కూర్చున్నారే. ఆయనే మోనే నన్ను చూసి పిల్చారే వారిట; నేనుట, మగవాడినై వుంటేనేమోనే, చాలా గొప్పవాడి నయ్యేదాన్నిట: కాదు అయ్యేవాడినిట. ఇప్పుడైనా తానేను కట్టుకుంటేనేమో చాలా గొప్పదశ వస్తుందిటే. అమ్మా, వో ఐదురూపాయలు ఇవ్వవే" అంటూ వసంతలక్ష్మి, అప్పుడే భవిష్యత్తుని తలుచుకుంటూ అడిగింది.

"నీ మొహం" నీ దగ్గిర డబ్బు లాగేందుకు ఆ ఎత్తు వేసివుంటాడు. పట్టే అదృష్టానికి తానెత్తు ఏమీ అడ్డురాదు. అయినా నీళ్ళకి నిన్నెవరు వెళ్ళమన్నారే ? ఆ నారిగాడు ఏమయినాడుట – యజమాని ఇంత పొద్దెక్కి లేస్తే, వాడు పొద్దువాలాక పనిలోకి వస్తాడు. అడిగేవాళ్ళేరంట: అంటూ సీతారావమ్మ స్వగతం చెప్పుకుంటూ పెరట్లోకి వెళ్ళిపోయింది.

తనని అంత సులువుగా వదిలిపెట్టినందుకు రామచంద్ర య్యకి ఆశ్చర్యం వేసింది.

"నాన్న, నువ్వేనా ఇవ్వవా ?" అంటూ గారాలు మొదలుపెట్టింది వసంతలక్ష్మి. తండ్రి "ఇస్తాన్లే" అన్నట్టు సైగ చెయ్యటం పెరట్లోంచి సీతారావమ్మ కనిపెట్టి ఇంట్లోకి వచ్చి పడింది.

"సిగ్గు లేకపోతే సరి. నాకు తెలీకుండా దానికి ఇస్తా నంటారు ? ఈడొచ్చిన పిల్లలు ఇంటో వున్నారన్న బెంగన్నా లేదు మనిషికి. పెళ్ళిప్రయత్నం చేద్దామన్న ధ్యాస వుంటేగా, జన్మానికి. ఎంతసేపూ తిండీ, నిద్రా, వీటితో తెల్లారుతోంది. ఏవన్నా అడిగితే జవాబు చెప్పకుండా వూరుకోవటం, వాగి వాగి అదే వూరుకొంటుందిలే అని."

రామచంద్రయ్య పెరట్లోకి జారుకొని చాలాసేపు అక్కడే గడిపి చివరికి స్నానంచేసి తడి గుడ్డలతో వచ్చి నిల బడ్డాడు వసారా మెట్లమీద.

వసంతలక్ష్మి పొడిబట్టలు అందించింది తండ్రికి.

సీతారావమ్మ దేముడు మందిరం దగ్గరికి చేరడంచూసి తండ్రీకూతుళ్ళు రావిచెట్టుదారి పట్టారు. అప్పటికే నాగసుందరి స్వాములవారిని ప్రశ్నలతోటి విసిగిస్తోంది.

స్వామీజీ వుండి వుండి వకసారి కళ్ళు తెరుస్తున్నాడు. తెరచినప్పుడు నాగసుందరినే చూస్తున్నాడు. "ఎప్పుడో ఒక నాడు నిన్ను ఏ రాజకుమారుడో వచ్చి ఎత్తుకుపోతాడు. అంతే" అని మళ్ళా కళ్ళుమూసుకున్నాడు. అక్కడికి తండ్రీ, అప్పా రావటం చూసి, "చూడు నాన్నా ఇప్పుడుకూడా ఎత్తుకుపోయే

రాజకుమారులు వున్నారని చెప్తున్నారు స్వామీజీ" అంటూ గట్టిగా నవ్వుతోంది నాగసుందరి. తండ్రి "నవ్వకు తప్పు" అని వారించాడు.

స్వామీజీకి రామచంద్రయ్య సాష్టాంగపడి తన భవిష్యత్తు చెప్పమని ప్రాధేయపడ్డాడు.

స్వామీజీ మళ్ళీ కళ్ళుమూసుకు ధ్యానంలో పడ్డాడు. మళ్ళీ తెలివిలోకి వచ్చి "ఏమి వుందీ. ఎప్పుడో నాలాగే విరాగివై సర్వం త్యజించే రోజు వస్తుంది" అంటూ కళ్ళు మూసుకున్నాడు. "అదేమిస్వామీ, అలా శెలవిచ్చారు." అంటూ కంగారు పడ్డాడు రామచంద్రయ్య.

వూళ్ళో పెద్దలు మరికొందరు రావటంతో రామచంద్రయ్యకి ఇంకేమి అడిగేందుకు వీల్లేకపోయింది.

ఆరోజునించీ తండ్రికూతుళ్ళలో పెద్ద మార్పు వచ్చింది. ఎసంత తను ఏకాధంగా గొప్పది అయ్యేందుకు అవకాశముంటుందో నని చాలా రకాలుగా వూహించుకుంటూ ఎవరూ చూడనప్పుడు ఠీవిగా వెన్ను విరుచుకు నడవడం, చాలామంది, వీరగాథల సినిమాల్లో హీరోఇన్‌లు పెట్టేపోజులు నెమరు వేసుకొని గంటలు గంటలు అద్దంముందే గడిపేస్తోంది. నాగసుందరి పెట్టెఅడుగు నున్న కాశీమజిలీలు పెల్లగించి అందులో అందమైన రాజకుమారులు వున్న కథలు అన్నీ తనకి కావల్సినంత వరకే చదువుతూ కష్టాలు వచ్చిన పేజీలు అన్నీ తిప్పేస్తూ ఎక్కువసేపు మంచంలోనే గడుపుతోంది.

రామచంద్రయ్యకి రాత్రిపూట కంటిమీదకి కునుకన్నది రావటంలేదు. ఏకవేళ పొరపాటున కన్ను మూసినా తను

బైరాగుల్లో కలిసినట్టు తిండి తిప్పలూ లేకండా దేశంపట్టుకు తిరుగుతున్నట్టూ కలవచ్చి బెంబేలెత్తి భార్యకి చెప్పుకుంటు న్నాడు.

ఆవిడ నోదాస్చి, "రాసిపెట్టి వుంటే తప్పుతుందా అయినా అస్తమానం అదే యావృత్తి అవుతే ఇంకో కల ఎల్లా వస్తు"దని కసిరి తను సుఖంగా నిద్రపోయేది.

స్వామీజీ ఆవూరినించి మకాం పక్క వూరికి మార్చు కున్నారు.

రామచంద్రయ్యకి ఎంతో కాలంగా మిలటరీలో చేరి డబ్బు పంపుతున్న తమ్ముడు పుండరీకాక్షుడు కాస్తా పోయా డన్న వార్త తెలిసిం దగ్గరనుండీ మరీ నీరుగారిపోయాడు.

ఆ తెల్లవారుజామున తనే పోయినట్టు కల వచ్చింది. రామచంద్రయ్యకి. చిన్నప్పుడు తల్లి చెప్పిన మాటలు గుర్తుకి వచ్చాయి. నాలుగో జామున వచ్చిన కల యథార్థ మయి తీరుతుందట. కూతుళ్ళకి చెప్పుకు బోరుమన్నాడు. సీతారా వమ్మకి అఘాయిత్యంగాతోచి "ఆ మాట ఏమిటంటే" అంటూ అక్కడనించి వెళ్ళిపోయింది.

రామచంద్రయ్య మనిషి పుష్టిగావున్నా, మనస్సు వట్టి బక్కది. తను బతకాలంటే సకలేమార్గం- సన్యాసం పుచ్చు కోవాలి. తను అసలు నేలమీద పడుకోలేడు. వక్కపూట కూడా భోజనం మానలేడు. తలుచుకుంటే ముందే దుఃఖం వస్తోంది. వూళ్ళో పెద్దల్ని నలుగుర్ని పిలిచి తన కర్తవ్యం విచారించాడు. పక్కింటి రాఘవయ్యకి మనస్సు తేలికైంది. వీడు ఇంట్లోంచిపోతే తన గొడ్లని వీడి దొడ్లోకి రాత్రిపూట

తోలవచ్చు. ఆడాళ్ళు ఏమి చూసి అఘోరిస్తార్లే అనుకున్నాడు.

వున్న గుడ్డలకే కాషాయరంగు వేయించుకు రమ్మని మనిషిని నారిగాణ్ణి పంపాడు. ఆ గుడ్డలు తేవటం చూసి మళ్ళా గొల్లుమని గోల పెట్టాడు. ఈసారి సీతారావమ్మ కూకలేసింది. ఈ పిచ్చివదిలి ఇంటిపట్టునే వుండిపొమ్మంది.

తన కర్తవ్యం మార్చుకోనంటూ ఆ గుడ్డలు వేసుకుని రామచంద్రయ్య బయటికి నడిచాడు. ఆవూరి సత్రంలో వున్నన్నాళ్ళు ఇంటిదగ్గరనుండి భోజనం వెళ్ళేది. నారిగాడు పక్కా అదీ చూసి మరీ వచ్చేవాడు.

స్వాములవారి ఆజ్ఞ అవటంవల్ల రామచంద్రయ్యా పేరు మార్చుకు వూరు విడవాల్సివచ్చింది.

ఇంట్లోవాళ్ళకి మొదట కొంచెం కష్టం కలిగినా మెల్లిగా అలవాటు పడిపోయారు. అప్పుడే ఆరు నెలలు గడిచాయి. శీతాకాలంపొద్దు తొందరగా దొర్లిపోతోంది. చలిమసగలో దీపాలు కాంతి తగ్గినట్లువున్నాయి. గుళ్ళో ఆకాశదీపం మిణుగురు పురుగులా వుండి వుండి మెరుస్తోంది. ఈశ్వరుడి గుడిలో గంటలు మోగుతున్నాయి. సీతారావమ్మ దీపారాధన చేసేందుకు గుడికి చేరింది. గర్భగుడి ద్వారం చుట్టూ నక్షత్ర మాలలో జ్యోతులు నిల్చి వెలుగుతున్నాయి. ఆలస్యంగా వచ్చినందుకు నొచ్చుకుంది. తను తెచ్చిన ప్రమిదలు నందికేశ్వరుని చుట్టూ పేర్చి వెలిగించింది. గుళ్ళో పార్వతీదేవిని చూసింది. అన్ని జ్యోతులు వెలుగుతున్నా మూలవిరాట్టుల్లో కాంతులు వెలగలేదు. ఎఱ్ఱచీర వెంకి కళ్ళతో అమ్మవారు దిగులుగా నిల్చున్నట్లు తోచింది. కళ్ళు మూసుకు ఆదిదంపతులని మనస్సులో

నిల్చుకుంది. మనస్సంతా వెల్తురుతో నిండిపోయింది. సజ్జ తీసుకు మండపంలోకి చేరి కూర్చుంది. "జై సీతారామ్" అన్న శబ్దంవిని కొద్దిగా చీకటిగావున్న మూలకి చూసింది. ఎవరో సన్యాసి అనుకొంది. రామచంద్రయ్య వెళ్ళిన దగ్గరనుంచీ సన్యాసుల్ని చూస్తే ఏవగింపు పట్టుకుంది. అసలు ఆ స్వామీజీ రాకపోతే ఈ బుద్ధి పుట్టేదేకాదు ఇలా నిక్షేపంలాంటి సంసారాన్ని వద లుకు దేశమ్మీద పడి బావుకునేది ఏమిటో ఇంతవరకూ సీతా రామమ్మ బుద్ధికి తట్టలేదు.

పూర్వాశ్రమంలో రామచంద్రయ్య భార్యని చూడ గానే నిగ్రహం లేక పలకరిద్దా మనుకుంటూ వుండగానే వెళ్ళి పోయింది. ఇప్పుడు ఇంటికి వెళ్లటమా వద్దా అన్నది తేలక ధ్యానంలో పడ్డాడు.

తల్లి ఇంటికి వచ్చేసరికి అక్క-చెల్లెళ్లు కీచులాడటం మాని ఎవరి గదిలోకి వాళ్లు జారుకున్నారు.

ఐనా తండ్రి దగ్గర లేరు. ఏళ్లు వస్తున్న కొద్దీ మరీ చిన్న వాళ్ళలా తగూలు ఎక్కువయ్యాయి. ఇంతకీ అప్పుడే ఇద్దరికీ పెళ్లిళ్లు చేసివుంటే ఎంత బాగుండేది. తను బైరాగుల్లో కలిసే ముందు వీళ్ల పీడకూడా వదలగొట్టాల్సింది. అని విసుక్కుంటూ తన పూజగదిలో చాపమీద నడుంవాల్చింది. రామచంద్రయ్య వెళ్లిన దగ్గరనుండీ సీతారామమ్మపడక దేముడి గదికి మార్చింది.

తల్లికి వినపడేలా ఇంట్లో సామాన్లు సర్ది వంటింటి గొళ్లెంచప్పుడు చేసి తల్లికి పాలగ్లాసు పట్టుకు చిన్నకూతురు ముందుగా వెళ్లింది గదిలోకి.

"అంత తొందర కేమిటి ? పళ్లు తినకుండా పాలు తాగు తుందా !" అంటూ బుట్ట తీసుకు పెద్దకూతురు వచ్చింది.

"అక్కడెట్టి వెళ్లండి, మళ్లా కీచులాట మొదలెట్టకండా" అని సీతారావమ్మ చెప్పటంతో, మూతులు తిప్పుకుంటూ ఇద్దరూ వెళ్లిపోయారు. నాగసుందరి నిద్రకి ఆగలేదు. రోజూ రాజకుమారుణ్ని గురించి రాత్రి అంతా ఆలోచించాలి అనుకునేది కానీ వెధవనిద్ర వెంటనే వచ్చేస్తుంది. ఈరోజు ఏమయినాసరే నిద్రపోకూడదను. గ్లాసెడు నీళ్లు పక్కన పెట్టుకు కళ్లు తుడుచుకోవాలి అన్న నిర్ణయానికి వచ్చేసింది.

హరికేన్ లాంతర్ హెచ్చించి పెట్టుకుంది. వసంతలక్ష్మి, ఎన్నో వీరగాథల్ని పఠనం చేస్తోంది. ఇంతవరకూ ఒక్క విషయంలో కూడా తన్ను ఎవరూ గుర్తించటంలేదు. స్వరాజ్యం రాకముందు పుట్టివుంటే ఎంత బాగుండేది. ఇప్పు డేమిలాభం. తను పుట్టేసరికి స్వరాజ్యం రావడమే కాకుండా తనకోసం ఏ సమస్యా వదలకుండా అంతా తలోటీ పంచేసుకున్నారు. ఏదన్నా కొత్తసమస్య ఆలోచించాలి. ఏది అనుకున్నా ఇదివరకు ఎవరో ఎత్తి వదిలిన విషయమే నంటున్నారు. ఇప్పుడు ఒకటే మిగిలింది. ఈసారి ఎలక్షన్‌లో నిల్చున్న వారికి అండగా కష్టపడి పనిచేస్తేసరి. ఏ ఎమ్. ఎల్. సి. యో తనకి ఇప్పించవచ్చు. మళ్ళీ అది ఎల్లా సాధ్యపడుతుందన్న బెంగ పట్టుకుంది. తల్లి గడపదాటి బైటికి వెళ్ళనివ్వదాయె. పోనీ తండ్రి వుంటే ఏదో నాకు చెప్పివెళ్ళే ధైర్యం వుండును. ఎటూ పాలుపోక సహారా నాడిలా అటూ ఇటూ తిరుగుతోంది. సాయంత్రం నారాయణ చెప్పిన మాట గుర్తుకొచ్చి ఒక్కసారి

నిల్చిపోయి ఆ స్వామీజీ అవునో కాదో అడగడం మర్చిపోయానే అనుకుంది. అయినా పక్కింటి రాఘవయ్య ఇంట్లో దిగారుట. వాళ్ళింటికి వెళ్ళటం ఎల్లా. ఆడాళ్ళు ఎవరూ లేరాయె. పట్నంనించి కొడుకు వచ్చాడని ఆ రాముచేత వంట చేయిస్తున్నాడుట. దానినోరు అసలు మంచిదికాదు. వాళ్ళ ఇంటికి వెడితే ఎన్నేనా పుట్టిస్తుంది. మరి స్వామీజీని చూచే మార్గమే లేదా? అని తన్నే ప్రశ్నించుకుని, ఇప్పుడే ధైర్యం అవసరం అని తనే చెప్పుకుని రాఘవయ్య పెరటి వేపు దీపాలు కదలటం కిటికీ లోంచి చూసింది. నేరేడుచెట్టుదగ్గర ఏదో తవ్వటం వినపడుతోంది. ఎప్పటికీ ఆ దీపాలు ఆర్పటం లేదు. ఈరోజు లాభం లేదు. అనుకుని విచారంగా మంచం పట్టెమీద ఒరిగింది వసంత లక్ష్మి.

నాగసుందరికి తెల్లవారు జామున మెలుకువ వచ్చింది. కల్లో కనపడ్డ రాజకుమారుడు వచ్చి వెళ్ళిపోయాడేమోనన్న భయంతో గది అంతా వెతికింది. వయ్యారంగా అద్దంముందు నిల్చుని వళ్లు విరుచుకుంది, రాత్రిళ్లు అద్దం చూసుకుంటే రాక్షసులు వెంట వెడతారని అమ్మమ్మ చెప్పేది అనుకుని అద్దం చూసుకోకండా పమిట సర్దుకోవటం, జడ ముందుకు లాక్కుని రెండో భుజంమీదకి వేసుకు దూరంగా దిగిపోయే చంద్ర బింబాన్ని చూస్తూ, పుస్తకాల్లో చదివినట్టు, సినిమాల్లో చూసి నలా నిట్టూర్పులు విడుస్తూ మళ్ళా మంచంమీద పడిపోయింది.

ఎవరో మెల్లిగా తలుపు తట్టిన శబ్దం అవుతోంది. లేచి తలుపు తియ్యాలనుకుంది. మళ్ళా మాగన్ను పట్టేసింది. పడు

కున్న మంచం కిటికీదగ్గరగా వుంది. ఎవరిదో చెయ్యి కిటికీ లోంచి తన జుట్టుని సవరిస్తోంది. నుదురు, బుగ్గలు; అబ్బా చూసేందుకు సిగ్గు వేస్తోంది. తప్పకండా రాత్రి కల్లో వచ్చిన రాజకుమారుడే అయివుంటాడు. తన చెయ్యి చేతిలోకి తీసుకు కుంటున్నాడు. ఈసారి కొద్దిగా కళ్ళు తెరచింది. నాగసుందరి. దుప్పటి ముసుగులో మొహం గుర్తు తెలవటంలేదు. ఐనా ఎప్పుడూ రాజకుమారులు మారువేషంలో తప్ప రారన్న సంగతి గుర్తుకొచ్చింది. కొద్దిగా కిటికీదగ్గరగా జరిగింది.

వసంతలక్ష్మి లేచి మళ్ళా అటూ ఇటూ తిరుగుతోంది. చెల్లెలి మంచం పక్క ఆకారం కంటపడి దొంగని పట్టుకోవా లన్న హడావిడిలో దీపం పెద్దదిచేసి తలుపు తెరచింది. ఆ ఆకారం రాఘవయ్య పెరట్లోకి తప్పుకుని తలుపు మూసుకుంది. చేసేదిలేక వసంతలక్ష్మి ఇంటి తలుపులువేసి చెల్లెల్ని లేపింది.

"ఎప్పుడూ నిద్రపోకండా పిశాచంలా తిరక్కపోతే పడుకో రాదు. ఏం కొంప మునిగిందని వచ్చావు" అని అప్పగారిమీద విసుక్కుంది నాగసుందరి.

"ఆఁ, నేను రాకపోతే కొంపే మునిగేది. ఆ దొంగాడు ఎత్తుకెళ్ళేవాడు" అని హేళన చేసింది వసంతలక్ష్మి.

"అంత అదృష్టమే పడితే ఇంకేమి కావాలి! హాయిగా వెళ్ళిపోదును. అయినా నువ్వు చూస్తూ వూరుకోవుగదా! ఖర్మ" అంటూ చేతి గాజులు చూసుకుంది. నక్కటీ మిగల్లేదు నాగసుందరికి.

"ఏదీ చెయ్యి. గాజులు పట్టుకెళ్ళాడు రాజకుమారుడు" అంటూ వెటకారంగా నవ్వింది వసంతలక్ష్మి.

వీళ్ళ సంభాషణ పెరక్కుండానే పెరట్లో పెద్ద చప్పుడయింది. ఎక్కడో వెల్తురు వస్తోంది. నారాయణ కంఠం పెద్దగా వినపడుతోంది.

అక్కా-చెల్లెళ్ళు ఇద్దరూ ఏకమయ్యారు. చెరో దీపం పట్టుకు పెరట్లోకి వెళ్ళారు. దూడల పాక మండిపోతోంది. ఆవు దూడలు అరుస్తున్నాయి. వసంతలక్ష్మి చొరవచేసి పాకలోకి వెళ్ళి దూడల్ని విప్పింది. వచ్చిన జనంలోంచి ఒక యువకుడు వెళ్ళి వసంతలక్ష్మిపై మండుతున్న గెడ్డాడు పడకుండా ఇవతలికి లాగాడు.

నారాయణ చేత దెబ్బలుతిన్న స్వామీజీ అవయవాలు స్వాధీనం తప్పి కిందపడి మూలుగుతున్నాడు. నారాయణ నీళ్లు తెచ్చి మంటలమీద పోస్తున్నాడు. అంతాకలిసి ఎల్లాగో తెల్లారేసరికి మంటల్ని చల్లార్చారు.

రాఘవయ్యకి నారాయమీద పగ తీర్చుకోనేందుకు అదను దొరికింది. రామచంద్రయ్య వదిలాడుకదా అనుకుంటే వీడు అంతకంటే ఎక్కువగా ఆ కొంపని కాపలా కాస్తున్నాడు. వీడిని ఇప్పుడు పట్టిస్తే ఇంక తనకి అడ్డు ఎవరూ అన్న ఆలోచన తట్టగానే నిమిషాలమీద మనుష్యుల్ని పంపి పోలీసుల్ని పిలిపించాడు. నారాయణమీద వాళ్ళకి చెప్పవల్సినవన్నీ చెప్పి మరీ ఇంట్లోకి పిల్చుకెళ్లాడు. స్వామీజీని చూపెట్టి కళ్ళు వొత్తుకున్నాడు. పోలీసులు రెండు ఇళ్లూ చూడ్డంలో రాఘవయ్య దొడ్లో తవ్విన గొయ్యి కనపడింది. కొంచం పక్కగా విరిగిపోయిన కుండా, పేలిపోయిన తూటాలు, పేలని తూటాలు పడివున్నాయి.

రాఘునయ్యా ఇదంతా ,ఆ నారిగాడి పనేనండీ అంటూ గుండెలు బాదుకున్నాడు పోలీసులముందు. రాఘవయ్యా పాలేరు కుత్తాడు పసుగెత్తుకుంటూవచ్చి తూటాల్ని ఏరుకోబోయాడు. పోలీసుల బెదరింపుతో ఆగి, "అయి నేనే దాసుకున్నానండీ. మా అయ్యాకి తెలిస్తే తంతాడని ఈడ భూమిలో దాచి పెట్టానండీ; ఫున్నానికి ఎలిగించుకుందామగదా" అని చెప్పాడు. రాఘవయ్యా నోరుమూసుకోమని "పాలేర్ని కసిరి. వాడికేం తెలీదండీ; అంతా ఆ నారిగాడిపనే. అసలు నాకొంపకే పెడదామనుకొని వుంటాడు" అంటూ ఇంకా నమ్మించేందుకు ప్రయత్నిస్తున్నాడు.

వూరి మునసబు రావటంతో అంతా తలోటి చెప్పకుపోతున్నారు. మునసబు తిన్నగా సీతారావమ్మ దగ్గరకెళ్ళి కుశల ప్రశ్నలడిగి సంగతులు తెలుసుకున్నాడు. వసంతలక్ష్మి రాత్రి తను చూసిందంతా చెప్పి, "చెల్లెలి చేతిగాజులు తీసుకున్న మనిషి రాఘవయ్య ఇంట్లోకి వెళ్ళడం చూశా" నంది. మునసబు వెళ్ళాక అప్పగార్ని చెల్లెలు కోప్పడింది. "ఆ గాజుల మాట ఎందుకే చెప్పటం" అని.

"సంతోషించు. ఇంకా అమ్మకి చెప్పనందుకు. లేకపోతే ఈపాటికి చీల్చి ఎండేసేది" అని వసంతలక్ష్మి చెల్లెల్ని బెదరగొట్టింది.

మునసబుకి రాఘవయ్యమీద వున్న పగ తీర్చుకోవాలంటేఅంతకన్నా మంచి సమయం దొరకటం కష్టం. "అమ్మాయి గాజులు తీసుకు" మీ పెరట్లోకి జారుకున్నాడు; ఎవడో తెలిస్తే చెప్పరాదూ ?" అని రాఘవయ్యని గట్టిగానే అడిగాడు.

రాఘవయ్య కొడుకు చంద్రానికి ఈ గొడవంతా అర్థం కాక అప్పటినించీ చూస్తున్నవాడు గాజులప్రశ్న రాగానే, "స్వామీజీ ఆసనంకింద ఇందాక నాకు గాజులు కనపడ్డాయి" అని చెప్పేశాడు.

"ఏమిట్రా ఆ వాగుడు. పెద్దా, చిన్నా ఏమి తెలియకండా వుందే? ఆయనకి దేనికిరా?" అంటూ పళ్ళు కొరుకుతూ చంద్రం కేసి చూశాడు రాఘవయ్య.

"చూసింది చెప్పాడు, పిల్లాడ్ని ఆడిపొయ్యక" అంటూ రామి తీర్పులోకి వచ్చింది.

అప్పటిదాకా వూరుకున్న ఇన్‌స్పెక్టర్ "చూడు మిస్టర్" ఆ ఆసనంకింద చూడాల్సిన పనేమివచ్చింది మీకు" అని చంద్రాన్ని అడిగాడు.

"ఆ, ఏం వుంటుంది. ఏ అగ్గిపెట్టో చుట్టముక్కో- రహస్యంగా తీద్దామనివుండొచ్చు" అంటూ నవ్వుతూ చంద్రం కేసి చూశాడు మున్సబు.

"అంతే" అన్నట్టు తండ్రిచూడకుండా చంద్రం నవ్వుతూ. తలవూపాడు.

"ఐతే ఈ స్వామీజీకి పొగ తాగడంకూడా అలవాటు వుందేమిటీ" అని పోలీసు ప్రశ్న వేశాడు అంతా మెచ్చుకోవాలని.

వీళ్ళు ఈ సందడిలో వుండటంచూసి స్వామీజీ మెల్లిగా జారుకున్నాడు. పెరటి తలుపు తెరచివుంది. ఆసనం వున్నగది ఇంటి ముందుభాగంలో వుండటంవల్ల తరవాత చూసుకోవచ్చు

అనుకుని ముందు బైటపడి వుంటాడు అనుకున్నారు అక్కడ చేరినవాళ్ళు.

రాఘవయ్య కోపం తారాపథం చేరింది. "స్వామీజీని పట్టించేందుకు కాదు మిమ్మల్ని పిలిపిస్తే; వాడిసంగతి కనుక్కోండి ముందు" అంటూ నారాయణకేసి చూశాడు.

స్వాములవారి ఆసనం పదిలంగా ఎత్తిచూశారు. కొన్ని వస్తువులు, డబ్బు, వాటి రక్షణకోసం కొన్ని కత్తెలూ, చిన్న సంచినిండా భస్మాలు దొరికాయి. పోలీసులు వెతికేందుకు వెళ్ళారు.

"వూరిచివర ఆ లచ్చి గుడిసెలో దాక్కుంటాడు సూడమనండి" అని నారాయణ చెప్పాడు మున్సబుకి.

"అసలు నువ్వు ఎందుకురా ఆయన్ని కొట్టావు" అని చంద్రం అడిగాడు నారాయణ్ణి.

"అసలు మొదటినుంచీ వంటేనండి ఆయన్ని చూస్తేను మా అయ్యగారికి ఎట్టి ఎత్తించింది ఈయనేగదండీ. నిన్నే మొలచ్చికాడ చెపుతున్నాడంట. సిన్న అమ్మాయిగార్ని తీసుకెళ్ళేందుకే రాఘవయ్య ఇంట్లో మకాం పెట్టాడంట. ఆ సెప్పటం మా పిన్నమ్మ ఇనిచెప్పింది. అందుకే నేను ఈ పెరట్లో పడుకుంటుండా నిన్న ఇయ్యాలాను" అని గర్వంగా చెప్పాడు నారాయణ.

పోలీసులు అట్టే శ్రమపడకుండా నదిలో స్నానం చేసే రామచంద్రయ్యని పట్టుకువచ్చారు.

మున్సబు గుర్తుపట్టి "అంతమూరావేంటి" అని రామచంద్రయ్యని పరామర్శించాడు.

పోలీసులు ఘనంగా చెప్పారు. "నో పట్నాన వచ్చేందుకు ఒప్పుకుంటేనా. పట్నుకు వచ్చేసరికి మా పెద్దలు దిగి వచ్చారు."

"భలేవాళ్ళే నే" ఆయనకాదు. తొందరగా వెళ్ళండి వూరుచివర బడ్డీకొట్టులచ్చి కొంపలో సోదా చెయ్యండి" అని చెప్పి పంపారు.

రామచంద్రయ్యకి తన ఇంట్లోకి వెళ్ళాలని బుద్ధిపుట్టింది. వంటగది గుమ్మంలోకి వెళ్ళేసరికి కాఫీవాసన గుప్పుమని వచ్చే సరికి మరి నిగ్రహంమాట వదిలేసి సీతారావమ్మ ఎదటపడ్డాడు.

చిక్కిపోయిన రామచంద్రయ్యని చూసి మాటలురాక కాఫీగ్లాసు అందించింది.

ఏ స్థలంలో సన్యసించాడో మళ్ళా అక్కడే కాషాయ బట్టలకి స్వస్తిచెప్పి సీతారావమ్మ కొంగుతో ముఖం తుడుచు కుంటూ తనకి ఇష్టమైన వంటకాలు చేసిపెట్టమని పసివాడిలా ఏకరువు పెట్టుకుంటున్నాడు.

రాఘవయ్య తన డబ్బు వున్న తోలుసంచి కనపడలేదని నెత్తి బాదుకుంటూ "ఎంతమోసం, ఎంతమోసం" అంటూ పిచ్చిగా అరుస్తున్నాడు.

పోలీసులు, చెయిజారిపోయిన సన్యాసికోసం వెతుకుతామని, కమ్మగా భోంచేసి కేసు రిజిష్టర్లో ఎక్కించుకుంటామని చెప్పి వెళ్ళారు.

రామచంద్రయ్య రాఘవయ్యని వోదార్చి ఆదరించి కొంతకాలం తనింట్లో ఆతిథ్యం ఇచ్చాడు.

రాఘవయ్యలో మరుగుపడ్డ విపప్పు ఆలోచనలు మళ్లా నెమరుకి రాకమునుపు ఒక్క ఆలోచన వచ్చింది. అతని జీవి

తంలో అంత మంచి ఆలోచనకి అదే మొదటి క్షణం. "చంద్రానికి మీ పిల్లని ఇవ్వరాదూ ?" అని పైకి అడిగేశాడు.

రామచంద్రయ్యకి ఈ ఆరునెలల్లో అలవడ్డ గొప్ప గుణాల్లో నిర్లిప్తత ఒకటి. అందుకే ఆ ప్రశ్నకి ఎక్కువ ఆనందం చూపెట్టలేకపోయాడు. పైగా "ఘటన వుండాలి. మనది ఏమివుంది ?" అని తేల్చివేశాడు.

పక్కగదిలోనుంచి వింటూన్న సీతారావమ్మ "వారి మాటలంతేలే అన్నయ్యా, నీకు ఏ పిల్లని కలుపుకోవాలని వుంటే దాన్నే కలుపుకో"మని చెప్పింది.

మున్సబు పెద్దపిల్లకి మనువు తెచ్చాడు; "ఆరోజు మంట ల్లోంచి ఇవతలికి లాగేడే ఆ అబ్బాయేట; పిల్ల నచ్చిందని వాళ్లు వప్పుకుంటే చేసుకుంటానని మా అల్లుడికి వ్రాశాడు. పెద్ద చదువు చదివాడులే. ట్రయినింగ్ అయి వచ్చాడుగా ! కలెక్టరు పని వస్తుందిలే" అని రామచంద్రయ్యకి చెప్పాడు.

సీతారావమ్మ వెంటనే వప్పేసుకోమని చెప్పించింది.

ఇద్దరి కూతుళ్ళని వెతుక్కుంటూ వచ్చిన అదృష్టాన్ని తల్చుకు మురిసిపోయింది సీతారావమ్మ.

రామచంద్రయ్య ఎటూ చెప్పలేదు. "ఘటియవచ్చింది. అయింది" అని ఒక్క మాటతో తేల్చేశాడు.

అల్లుళ్ళు ఇద్దరూ నట్టింట్లో తిరుగుతూంటే సీతారావమ్మ ఆనందానికి అంతులేకండా వుంది.

"వసంతలక్ష్మి చెల్లెల్ని మీ రాజకుమారుడు గాజులు తిరిగి ఇచ్చాడా ? అని నవ్వుతూ అడిగింది.

"మీ వీర పురుషుడు కోసం మళ్ళీ ఏ కొంపేనా అంటు కుంటే దూరకేవు" అని చెల్లెలు సమాధాన మిచ్చింది.

"ఇంక పూరుకోండత్లా మీ దెప్పుకోవడాలు. వాడు దొంగో, సన్యాసో ఎవరైతే ఏంగానీ. మీ ముగ్గురికీ ఎక్కించిన వెట్టి ఇంత తొందర్లో వదులుతుందనుకోలేదు. పర్యవసానం ఇంత సుఖంగా తేరుకొంటామని అసలే ఆశలేదు. నాకు" అంటూ తృప్తిగా పూపిరి వదుల్తూ మంచంమీద కూర్చుంది సీతారావమ్మ.

"మీ అందరి మాటలకేంగాని, మన నారిగాణ్ణి వో ఇంటివాణ్ణి చెయ్యాలి. వాడి రుణం నేనెప్పుడూ తీర్చుకోలేను. నా సన్యాసి ఆశ్రమంలో సుష్టుగా భోజనం అందించేవాడు. అల్లా జరిగి వుండకపోతే మళ్లా మిమ్మల్ని చూసేవాణ్ణేకాదేమో నంటూ సీతారావమ్మ పక్కన మంచంబద్దీమీద కూర్చున్నాడు రామచంద్రయ్య.

ఎల్లా పంపాడు. ఎవరు తెచ్చారన్న ప్రశ్నలు వెయ్య కుండా, చేతికి వున్న కొత్తగాజులు, కట్టుకున్న పట్టుచీర కుచ్చెళ్లూ చూసుకుంటూ అక్కడనించి వెళ్ళిపోయారు అక్క చెల్లెళ్లు.

---

# ఊహించని కోరిక

పార్వతి అత్తగారితో పెళ్ళికి బయలుదేరింది. 'నువ్వు వెడితే చాలులెద్దూ; అదికూడా ఎందుకు' అని తల్లితో వెంకటేశ్వర్లు అన్నాడు. "సరిపోయె, నువ్వూ రాక, కోడల్నీ పంపకంటే, ఇంక నేనా ఏమిటి, తగుదునమ్మా అంటూ పెళ్ళికి వెళ్ళటం ?" అని నరసమ్మగారు కొసుకుని అడిగింది.

పార్వతిని పంపటం ఇష్టంలేకపోయినా తల్లి ఏమనుకుంటుందో అని ఊరుకున్నాడు వెంకటేశ్వర్లు.

నరసమ్మగారు కోడల్నే కాకుండా, పక్కింటివారి కోడల్ని, కూతుర్ని కూడా బెజవాడ చూద్దురుగాని రమ్మని పిల్చుకెళ్ళింది. బెజవాడ స్టేషనులో దిగేసరికి నరసమ్మగారి బంధువు మరొకరు కలపటంతో పెళ్ళివారి ఇంటికి ఇబ్బంది లేకుండా చేసుకున్నారు.

ఊరు పదేళ్ళకి ఇప్పటికీ ఎంతమారిపోయిందో అంటూ నరసమ్మగారు ఆశ్చర్యంతో ముక్కుమీద వేసుకొన్న వేలు తియ్యలేకపోతున్నారు వీధిలోకి వచ్చినప్పుడల్లా.

కోడల్ని, పక్కింటివాళ్ళని తీసుకుని ఊళ్ళోవున్న గుళ్ళూ గోపురాలు అన్నీ తిప్పుకు ఇంటికి చేరేసరికి పెళ్ళివారు వచ్చేశారు అంటూ ఇంట్లోవాళ్లు ఊరికే హడావుడి పడిపోతున్నారు. ముహూర్తం ఆ రాత్రికే. నరసమ్మగారు పెద్ద వాళ్ళలో కలిసిపోయి తిరుగుతోంది. పార్వతి పెళ్ళికివచ్చిన వాకరిద్దరితో పరిచయం చేసుకుని తన ముస్తాబుతో సరసమత

మవుతోంది. పెళ్ళిబాజాలు మోగుతున్నాయి. పందిట్లో పెళ్ళివారి తాలూకు అంతా కూర్చున్నారు. ఆడపిల్ల వేపు వాళ్ళకి చోటులేక మూలలు పట్టుకు నిల్చున్నారు.

పార్వతి, కాయితంపువ్వులు కట్టిన స్తంభాన్ని పట్టుకు నిల్చుని చూస్తోంది. తలంబ్రాలు పోసుకుంటున్నారు. పెళ్ళి కూతురు గడుసుదే, సళ్ళెమెత్తి పోసేస్తోంది అని పక్క వాళ్ళతో అంటోంది ఇటు తిరక్కుండా పార్వతి.

ఆనందం పార్వతిని పలకరిద్దామని అక్కడికి వచ్చి నిల్చున్నాడు. పార్వతి ఇటు చూడటంలేదు. ఆనందం వెనకే కొంతమంది వచ్చి కుర్చీ ఇక్కడ వేయించమంటారా అని మర్యాదచేసే హడావుడికి వెనక్కి తిరిగింది పార్వతి.

ముందు ఆనందాన్ని పోల్చుకోలేదు. కొద్ది క్షణాల్లోనే గుర్తుపట్టింది. సంతోషం మొహమంతా కదిలింది. మాటలు రాక మూతి ముడుచుకుంది.

ఆనందమే పలకరించాడు. పార్వతి చెప్పే మాటల కంటే బావశబ్దమే ఎక్కువ వినపడుతోంది. చాలామంది అమ్మాయిలు పార్వతి వెనక్కి చేరారు. వెనకనించి గుస గుసలు బయలుదేరాయి. ఆయన పెద్ద యాక్టరుట అని, మొన్న మనం చూసిన సినిమాలో లేడూ, అతనేననీ, మనం చూసినదాంట్లో చాలా బాగాచేశాడు అనీ, అన్నీ అతనికి వినపడాలనే అంటున్నారు.

'రేపు వుంటావా!' అని పార్వతిని అడిగాడు ఆనందం. వుంటానని తల వూపింది పార్వతి.

'మళ్ళా కలుస్తాము' అని వెళ్ళిపోయాడు ఆనందం.

పార్వతి చెయ్యిపట్టుకు దూరంగా తీసుకెళ్ళారు కొందరమ్మాయిలు. ఎల్లా తెల్సు అంటూ వూపిరి సలపకుండా ప్రశ్నలు వేస్తున్నారు.

ఆనందం తనకి మేనత్త కొడుకేనని చెప్పేందుకు చాలా రకాల చేష్టల్లో గర్వం కనపడేలా, "అబ్బబ్బ, అల్లా గుంపులా మీదపడతారేమిటే? ఆయనలో కొత్తవిశేషం ఏమివుంది, ఏమిటే! మనం చూసే మనుష్యుల్లాగే వున్నాడుగా? ఎట్నొచ్చీ అదృష్టం అందలం ఎక్కించింది, అంతే!" నంటూ, పార్వతి తనకి అతనితో మాట్లాడటంవల్ల వచ్చిన సంతోషం ఏమీ లేదు అని కనపడేలా మొహంపెట్టుకు కూర్చుంది, అరుగుచివర.

ఒకామె "నీకు తెల్సును కనక అల్లా అంటున్నావు, లేకపోతే ఆయనతో మాట్లాడంలోవున్న గొప్ప అర్థమయ్యేది" అంది. "అబ్బా, దగ్గరనించికూడా ఎంత బాగున్నాడే"నని మరొక ఆవిడ నిట్టూర్చింది. "కొంచెం కనుముక్కు తీరువ వుందని" మరిసిపోయింది మరో ఆమె. "మా పిల్ల నిద్దర పోయింది కాని, ఆయన బసకెళ్ళి కొంచంసేపు కబుర్లువిని వద్దాం అత్తా" అంటూ పార్వతి చెయ్యిపట్టుకు లేవతీసింది. ఇప్పుడు కాదులే రేపు ప్రొద్దుట వెళదాము. నాకు నిద్ర వస్తోంది అంటూ పార్వతి నళ్ళు విరుచుకుంది.

మరో మధ్యవయస్సావిడ, నోట్లో యిరుక్కున్న నక్క పలుకు బైటకిరాక అవస్థపడుతూనే, మాటలు మొదలుపెట్టి, "అబ్బాయి చిన్నతనంలో ఎంత అల్లరిచిల్లరిగా తిరిగేవాడో" నంటూ బోలెడు తెల్సినట్టు మొదలుపెట్టి. "అందుకేగా వీళ్ళ నాన్న యీ అమ్మాయిని యిచ్చి చెయ్యలేదు" అంటూ

పార్వతిని చూపెట్టి తను చెప్పాల్సినది అయిపోయినట్టు పన్ను కుట్టుకోవడం మళ్ళా మొదలుపెట్టింది.

"ఆమెకే ఇచ్చి మీ నాన్న చేసివుంటే మాతో అసలు మాట్లాడేదానివేనా?" అంటూ పక్కింటి అమ్మాయి పార్వతి బుగ్గలు సాగతీసింది.

మర్నాడు ఆనందం వచ్చేసరికి పార్వతి తల దువ్వుకుంటోంది. సగం జడ అల్లుకున్నది వదిలి "రా బావా!" అంటూ తన సామాను పెట్టుకున్న గదికి తీసుకెళ్ళింది.

గది అంతా సామాన్లు, అమ్మాయిలు విడిచిన బట్టలు, అద్దాలు, దువ్వెనలూ తిలకంసీసాలతో గందరగోళంగా వుంది. పార్వతి తన పెట్టిపైన చీరమడత పరచి ఆనందాన్ని కూర్చోమంది.

ఆనందం వేసుకున్న పల్చటి లాల్చి వెనక పచ్చటి శరీరం మెరుస్తోంది. ఏదో వింతసువాసన గది అంతా పరుచుకుంది. పార్వతికి సంతోషం, భయం కలిసి మాటని పైకి రానివ్వటంలేదు.

"ఏమిటి ? కబుర్లు చెప్పు" అని ఆనందం పార్వతికేసి చూస్తున్నాడు.

పార్వతికి ఏమి చెప్పాలో తోచక "మీ ఆవిడ ఎల్లా అంటుంది, పాపాయిలు ఎంతమంది, అత్తయ్య ఎల్లావుంది" అంటూ గుక్కతిప్పుకోకుండా అడిగేసింది.

"మీ అత్తయ్య మంచాన పడింది. ఇంక, పాపాయిలంటావా ? మా ఇంట్లోకి ఎవరూ రావటంలేదు. మా ఆవిడ

వర్ణన నేను చేసేకంటే నువ్వే చూడరాదూ వచ్చి" అన్నాడు. నవ్వుతూ ఆనందం.

పార్వతి మళ్ళా ఏదో అడగాలనుకుంటూండగానే, అత్తగారు అక్కడికి వచ్చింది. మా అత్తయ్యకొడుకు అంటూ ఆప్యాయత యిమిడ్చి అత్తగారికి చెప్పింది.

"ఏం, నాయనా! నిన్ను గురించి మా కోడలు చెప్తూనే వుంటుంది. ఒక్కడవే వచ్చావా." అంటూ కుశల ప్రశ్నలు అడిగింది.

"అవునండీ! పెళ్ళికొడుకు మా సినిమా కంపెనీలోనే పనిచేస్తున్నాడు అని పెళ్ళికి వచ్చాము. మీరూ పార్వతీ నాతో పట్నం రాకూడదా" అన్నాడు.

"అయ్యో! ఎంతమాట ? నీ బంధుప్రేమ అల్లాంటిది నాయనా. అబ్బాయిని వొక్కడినే వదిలివచ్చాము. పల్లెటూరాయె. పాడిగొడ్లు వున్నాయి. అయినా మా చెల్లెల్ని పెట్టే వచ్చామనుకో. ఏమే, నువ్వు వెళ్ళి రెండు రోజులుండి వస్తావా?" అని అడిగింది అత్తగారు.

లోపల వెళ్ళాలని వున్నా, పైకి చెప్పుకోలేదు పార్వతి. "ఇప్పుడెందుకులే బావా? ఏమైనా కథలూ, కార్యాలు జరిగినప్పుడు మేము గుర్తుండి నువ్వు పిలిస్తే సపరివారంగా వస్తాం, సరేనా!" అని నవ్వింది.

"ఎప్పటిమాటో ఇప్పుడెందుకులే. పోనీ వోసారి వెళ్లు. పెంచి పెద్దచేసిందాయె, మీ మేనత్తని చూసిరా. అతను రమ్మనమని అంత ఇదవుతున్నాడా, బాగుండదు వెళ్ళకపోతే. మావాడికి నేను చెప్తాలే, వెళ్ళాక" అని కోడలితో అని

"మావాడిది నట్టి పిచ్చికోపం. ఇంట్లో వాళ్ళని ఎక్కడికీ వెళ్ళ కూడదంటాడు. కోపంవచ్చిన కాస్సేపు వూరుకున్నామంటే, మళ్లా ఎంత బాధపడతాడో అన్నందుకు" అంటూ తన కొడుకు స్వభావం ఆనందానికి చెప్పి మురిసింది, ముసలిహృదయం.

బావ మళ్లా రమ్మంటే వెళ్ళవచ్చులే అనుకుంది పార్వతి.

ఆనందాన్ని చూడ్డానికి చాలామంది అమ్మాయిలు కిటికీవూచల్లోకి చేరారు.

కొందరు నరసమ్మగార్ని తోసుకుంటూ గదిలోకి తొంగి చూస్తున్నారు.

ఆనందం కళ్ళు వయ్యారంగా అందర్నీ పరామర్శించి కిటికీచివర నిల్చున్న అమ్మాయిమీద నిల్చాయి.

తనకేసి చూస్తున్నట్లు గ్రహించిన సుభద్ర, పమిట జరుపుకుంది. పెదిమలు తడుపుకుంది. జుట్టు చెవులకిందికి జరుపు కుని, జడ ముందుకు లాక్కుంది.

ఆ అమ్మాయికేసి చూస్తూ ఆ అమ్మాయి చేష్టలకి కులుకుతూ నవ్వాడు ఆనందం.

ఆ నవ్వూ, చూపు కలిసి సుభద్రని ఇంద్రజాలంలా నిల్చోనియ్యటంలేదు. తన వంటిమీద బట్ట లేనంత సిగ్గు పడింది. ఆ సిగ్గులోనే అతనితో నవ్వు కలిపింది.

దూరంగావున్న సన్నాయి దగ్గరయింది. అంతా అటు వెళ్ళిపోయారు. నరసమ్మగారుకూడా వెళ్ళేందుకు హడావిడి పడింది.

'హమ్మయ్యా' అంటూ సుభద్ర గదిలోపలికి వచ్చి

ఆనందానికి దగ్గరగా నాజూగ్గా కూర్చుని. "మీ బావకి కాస్త కాఫీలాంటిది ఏమయినా ఇచ్చావా" అంటూ పార్వతిని అడిగింది.

"మా యిల్లా ఏమిటె? వెళ్ళి తెచ్చేందుకు" అంటూ మరో పెట్టెపైన పార్వతి కూర్చుంది.

సుభద్రకి ఎల్లా మాట్లాడాలో తెలియటం లేదు.

"అసలు సినిమావాళ్లు బయట బాగుండరంటారే, మీరు అలా కాదు. బైటకూడా" అని వాక్యం పూర్తి చెయ్యకుండానే, పార్వతికోసరం ఇద్దరమ్మాయిలు రావటం, పాట పాడాలంటూ మాట వినిపించుకోకుండా పార్వతిని ఇద్దరూ పట్టుకు లాక్కెళ్ళటం జరిగింది.

ఆనందం కూడా వెళ్లేందుకు లేచాడు.

సుభద్ర ఆనందాన్ని రాచుకుంటూ వెళ్ళి గుమ్మానికి అడ్డంగా చేతులుజాపి వెళ్ళద్దంటూ ప్రాధేయపడింది.

రుమాలుతీసి నుదురు అద్దుకుంటూ, 'ఏమిటె' అన్నట్లు సుభద్రకేసి చూశాడు.

"ఆ రుమాలు నాకిస్తారా" అంటూ చెయ్యిజాపి, "అబ్బ మిమ్మల్ని సినిమాల్లో చూస్తోంటే పిచ్చెక్కినట్లు అవుతుంది. నిజంగా చెపుతున్నా" అంటూ దగ్గరగా జరిగి నిల్చుంది.

ఈ మాటలు తరచు ఉత్తరాల్లో చదవటం అలవాటే. ఎదురుపడి అపరిచితుడనేనా భయం లేకుండా మృదువుగా అన్న చెప్పటం వింటూంటే కొంచం ఆశ్చర్యం వేసింది ఆనందానికి.

సుభద్ర ఆనందం చేతిలోని రుమాలు తీసుకుంటూ

ఆ చేతిని తనబుగ్గమీద పెట్టుకు తన్మయంతో కళ్లుమూసుకుంది.

పార్వతికంఠంవిని ఆనందం దూరంగా బైటికి నడిచాడు.

సుభద్ర ఆనందంకూర్చున్న పెట్టెమీదకూర్చుని వచ్చే వూహాలకి తీగెలు అల్లుతోంది.

ఆరోజు అమ్మాయిలకంతాల్లో ఆనందమే ప్రతిధ్వనిస్తు న్నాడు. ఏదో పనిపెట్టుకు విడిదిలోకి వెళ్ళింది సుభద్ర. తన మనిషి అన్న భావంతో ఆనందాన్ని వెతుక్కుంటూ ఆరోజు అంతా అతని వెనకే తిరిగింది. సుభద్రపినతల్లి చాటుకిపిల్చి కూక లేసింది. "ఆ వెర్రేమిటే పెళ్ళయిన పిల్లవి, లేనిపోని వాదులు తెచ్చుకోకు" అంటూ మెల్లిగా వారించింది.

సుభద్రకి పినతల్లిపీక పిసుకుదామన్నంత కోపమువచ్చింది. ఐనా ఆనందంచూస్తాడేమోనని ఆకోపంలోప లేఅణచిపెట్టుకుంది.

ఆ రాత్రి రైలుకి వెడుతూ ఆనందం పార్వతికి చెపుదా మని వచ్చాడు. అమ్మాయిలగుంపు, మధ్య మాటలు, నవ్వులు లైట్ల వెలుగులో పార్వతిపళ్ళు మెరుస్తున్నాయి. ఎందుకో అంత ఆపుకోలేని నవ్వు అనుకున్నాడు.

నరసమ్మగారు గుంపుని తప్పించుకుని వచ్చి, ఆనం దాన్ని కూర్చోమంటూ కుర్చీదగ్గరకి జరిపింది.

పార్వతిని చూసేకళ్ళు తత్తరపడ్డట్టు, "ఏంలేదండి, నేను వెళ్ళాలి. చెప్పిపోదామని వచ్చాను" అంటూ నరసమ్మ గారితో చెప్పుకున్నాడు.

తాళంచెవులజేబురుమాలు బొడ్డులోదోపుకుని, ఆనం దానికి ఎదురుగావున్న స్తంభాన్ని చుట్టుకునిల్చుంది పార్వతి.

"మీ బాప వెళ్తున్నాడుట," అంటూ అక్కడనించి ఎవరో పిలుస్తే వెళ్లిపోయింది నరసమ్మగారు.

పార్వతిని తనతో పూరికిరమ్మని పిలిచాడు.

ఆనందాన్నే చూస్తూనిల్చున్న సుభద్ర "వెడదాము" అంటూ, పార్వతి బదులు తనే వప్పేసుకుని నరసమ్మగారి దగ్గరకి హడావుడిగా పరుగెట్టింది.

'తొందరగా బయల్దేరు' అని పార్వతి కళ్ళల్లోకి చూస్తూ ఆనందం మళ్ళా అన్నాడు.

"అబ్బే, ఇప్పుడెందుకులే, ఈసారి మీ ఇంట్లో ఏవైనా కథలూ, కార్యాలు అవుతే తప్పకుండా వస్తామని చెప్పాగా!" అంటూ పమిటకొంగుని అనేకరకాలుగా చుడుతూ పార్వతి చెప్పింది.

వెనకనిల్చున్న నరసమ్మగారు, "అదేమిటే, పెద్దమనిషి రమ్మనిపిలిస్తే ఆమాటలేమిటి ?" అంటూ కోడల్ని కూకలేసి, "అల్లాగే వస్తుందిలే బాబూ" అంది.

"మీ అమ్మని నేను చూడలేకపోయినా ఆవిడ వుదార గుణం అంతా చెప్పుకోవటంవిన్నాను. ఎన్నోసార్లు మావాడితో కూడా చెప్పాను. వోసారి అమ్మాయి, నువ్వూ వెళ్ళి చూసి రండర్రా! పెద్దది అన్నాను. దీన్ని ఆవిడే పెంచిందిట కదూ!" అంటూ ప్రశ్న వేసినా వినకుండానే మరోమాట పెడుతోంది నరసమ్మగారు.

పార్వతికి అత్తగారి ధోరణి అలవాటే అయినా, అప్పుడప్పుడు ఆవిణ్ణి మాట్లాడకుండా చెయ్యాలనిపిస్తుంది. "ఎవరో పిలుస్తున్నట్టున్నా"రని, అత్తగార్ని పంపించింది.

ఆనందం చేతికేసి చూసుకుంటూ "ఆట్టే టైములేదు" అంటూ బయలుదేరాడు.

పార్వతి పెట్రోమాక్సులైట్లు పెట్టిన బల్లచివర దులుపుకుని కూర్చుంది.

సుభద్ర, "తొందరగా లే, టైమైపోతుంది" అంటూ పార్వతి గెడ్డంపట్టుకు బ్రతిమలాడుతోంది.

వెళ్ళటమా వద్దా అన్న సందిగ్ధం మనస్సులో తేలక ఎటూ చెప్పలేక వూరికే చూస్తోంది పార్వతి.

మరచెంబూ నీళ్ళూ ఇవిగో నేపిల్లా అంటూ నరసమ్మగారు అక్కడికి మళ్ళీ రావటంతో ఈసారి బయలుదేరింది, పార్వతి.

సుభద్రపినతల్లికి సుభద్ర హడావిడి నచ్చలేదు, "పిన్నీ, నీ కోడలికి చుట్టమైతే మా పిల్లని వెళ్ళమంటున్నావుట దేనికి" అంటూ నరసమ్మగారితో అంది.

"నే నెందుకు వెళ్ళమంటానూ? అది సర్దాపడితే పోనీ వెళ్ళవే, అన్నాను. ఐనా వెడితే ఏమిపోయింది నీకు" అంటూ సుభద్ర పినతల్లితో అంది.

పార్వతిని మళ్ళా మూడోనాటికల్లా తిరిగిరమ్మనమని, తను ఇక్కడేవుంటానని చెప్పి పంపింది నరసమ్మగారు.

సుభద్రని, పార్వతిని, రైలు ఎక్కించేందుకు పెళ్ళి పెద్దల్లో ఒకరు స్టేషన్ కి వచ్చారు.

ఆనందంచుట్టూచాలామందిజనం పోగయ్యారు. పార్వతి, సుభద్రా దూరంగా నిల్చుని రైలురాకకోసంచూస్తున్నారు.

రైలుకూత వినగానే అంతా అటుతిరిగి హడావిడిగా కదుల్తున్నారు. ఆనందాన్ని రైల్లోఎక్కించేందుకు రైలుపెట్టెతో మనిషికూడా రావటంచూసి ఆశ్చర్యపోయింది సుభద్ర. వీళ్ళని కూడా ఆ పెట్టెలోనే ఎక్కించాడు కూడా వచ్చిన పెద్దమనిషి.

పార్వతి పెట్టెకి రంగు వెలిసిపోయింది. పైగా పాత పెట్టె. పెళ్లివారి యింట్లో తాళంపెడుతూంటే గొళ్ళెంకూడా విరిగిపోయింది. దానికిసాయం డబ్బాలా ఎత్తువకటి. దేనికిందా ఇమడదు. పెట్టెలో అంతా ఒక్కోసారి ఆ పెట్టెకేసి చూస్తు న్నారు. వాళ్ళు చూసినప్పుడల్లా పార్వతికి ఎంతో చిన్నతనం వేస్తోంది. అసలు రాకుండావుంటే పోయేది. ఈ సుభద్ర తెచ్చి పెట్టిందా బెడద అని మనస్సులోనే తిట్టుకుంది, తను ప్రయాణ మైనందుకు.

రైలుకదిలినా కొందరు నిల్చునే ఆనందంతో కబుర్లు చెప్తున్నారు. సుభద్ర మధ్యమధ్య ఏవేవో ప్రశ్నలువేస్తోంది. అందులో బక్కపల్చగా తెల్లగావున్న కుర్రాడు, సుభద్ర పలి కినప్రతి మాటనీ మళ్ళీఅని తెగమెచ్చేసుకుంటున్నాడు.

కొంతసేపు వాళ్ళతో కలిసి నవ్వినా, ఆనందం ఆవ లింతలు మొదలుపెట్టాడు. పార్వతి మధ్యమధ్య కునుకు తీయటంచూసి, వెనక్కి ఎత్తివున్న పసుపులాంటి బల్లని కిందికి విడిచి "నువ్వు ఇటు పడుకో" మని పార్వతికి చెప్పాడు ఆనందం.

పమిటకొంగు తలపైన కప్పుకుని సగంచోట్లో ముడు చుకు పడుకుంది పార్వతి.

సుభద్రకి ఆరాత్రి జీవితంలో మొదటి పర్వదినంలా వుంది. ప్రతిమాట సంతోషంతో మునిగి తేలుతోంది. తెల్ల వారు జామున పార్వతిపక్కన ఖాళీచేసుకు పడుకుంది.

స్టేషన్లోపలికి రైలువెళ్లి నిల్చింది. ఎన్నోరైళ్ళు కూస్తున్నాయి, వెడుతున్నాయి, వస్తున్నాయి. ఎంతమందో గుంపులుగా వెడుతున్నారు, విడిచిపోతున్నారు. రంగురంగుల బట్టలు, రకరకాల మస్తులు.

అందర్నీ చూస్తూ పార్వతి నిల్చుంది. "అల్లా నిల్చుండి పోకూడదు" అని మెల్లిగా విసుక్కొంటున్నట్లు చెప్పాడు ఆనందం.

పార్వతికి అభిమానం వచ్చింది. తలవంచుకు ఆనందం వెనకే నడుస్తోంది. సుభద్ర మిగిలినవాళ్లతో కలిసినవ్వుతూ, మాట్లాడుతూ వస్తోంది.

ఆనందం ఎక్కినకారులో ఎక్కికూర్చుంది పార్వతి. అలాగ ఒక్కసారి చెప్పగానే వినాలి అంటూ ఆనందం పార్వతిని మెచ్చుకున్నాడు.

సుభద్ర మిగిలినవాళ్లని విడిచివచ్చేందుకు చాలా విచారంగా మొహం పెట్టి కారుఎక్కి కూర్చుంది.

ఆ కారునిల్చినచోటు చాలా ఇంపుగావుంది. చూచేం దుకు పెద్ద పువ్వులతోటమధ్య అద్దాలతలుపులతో కట్టినమేడ, ఎక్కడచూసినా రంగులముద్దల్లా గులాబీపూలు గుంపులుగా విచ్చి గాలికి మెల్లిగా వూగుతున్నాయి. ఆనందం మెట్లు ఎక్కి మేడపైకి వెళ్లాడు. పార్వతి వీధిమెట్లమొదటే నిల్చుని తోటకేసి చూస్తోంది. ఆనందం కేక వెనుకనించి వినపడగానే తలదింపుకు లోపలికివెళ్ళింది.

మేనత్తగది వెతుక్కుంటూ వెళ్ళింది పార్వతి. వయస్సు మళ్ళిన జానకమ్మ కళ్ళజోడు సవరించుకుని పార్వతిని పోల్చు కునేందుకు ప్రయత్నించి, వూరు, పేరు అడగటం మొదలుపెట్టింది. "వున్నాడా అబ్బాయి" అని పార్వతినే అడిగింది జానకమ్మ.

"నన్ను మర్చిపోయావు చూశావా," అంటూ మేనత్తని వెళ్ళి కావలించుకుంది పార్వతి.

జానకమ్మ కళ్ళు తడిశాయి. "నువ్వా టే" అంటూ చాలాసేపు మాటరాక కళ్ళతో ప్రశ్నలువేస్తోంది. ఇద్దరూ

తనివితీరేదాకా ఎన్నోమాటలు చెప్పుకున్నారు. ఎందరి విషయాలో అడిగి తెల్సుకుని ఆరోజులకోసం మనస్సులో ఏకుతోంటే బోసినోటితో నెమరువేసుకుంటూంటే మళ్ళా వెనక్కి పిల్చాయి నీడలు.

ఆరోజు అంతా జానకమ్మ ప్రశ్నలకి సమాధానం చెప్పటమే సరిపోయింది పార్వతికి.

సుభద్ర ఆ నిమిషంలోనే ఇల్లుఅంతా తొంగిచూసి వచ్చింది. ఆనందాన్ని అడిగి పైకివెళ్లి వాళ్ళల్లో కలిసిపోయింది. జానకమ్మ కోడలిని వకసారి కిందకి రమ్మనమని కబురుపెట్టింది.

ఎప్పుడో మధ్యాహ్నానికి రాధాకుమారి తయారై వచ్చింది. ఆవిడవెనక సుభద్రకూడా దిగింది. ఈసారి సుభద్ర అని తెలిస్తేతప్ప కొత్తవాళ్ళు కనుక్కోవటం కష్టమే. ఇద్దరూ ఒకేరకం బట్టలు కట్టుకున్నారు. జుట్టునికూడా ఆవిడముడిలాగే వేసుకుంది.

ఆవిడ ఎత్తుజోళ్ళే తనూ తొడిగింది. పార్వతి ఆశ్చర్యంగా చూడటం చూసి, "నువ్వూ రావే" అంటూ పార్వతి చెయ్యిపట్టుకు లాగింది, సుభద్ర.

తాళాలగుత్తి, అత్తగారిపక్కమీదకి విసిరి "ఎందుకూ కబురుపెట్టారుట" అని అడిగింది, పెదిమలని గుడ్డతో వత్తుకుంటూ రాధాకుమారి.

"మరేంలేదు, మా మేనకోడలు వచ్చింది. నీకు చూపెడదామని" అంటూ జానకమ్మ పార్వతికేసి చూసింది. "ఇంతేకదా! ఇంకా ఏమిటోనని భయపడిపోయాను. మరి నేను వెడుతున్నా. వచ్చేందుకు కాస్త పొద్దుపోతుందేమో. మీ అబ్బాయి వస్తే చెప్పండి; బహుశా ఆయనకూడా

ఆ పార్టీకే రావచ్చులెండి" అంటూ జోళ్ళు చప్పుడు చేసు కుంటూ వెళ్ళిపోయింది. ఆవిడ వెనకే సుభద్ర కూడా వెళ్ళింది. కారులో డ్రైవరు కూర్చునేచోట, రైల్లో కలిసిన ఎర్రటి అబ్బాయి కూర్చునివున్నాడు.

జానకమ్మ సుభద్రని చూపెట్టి "ఆ అమ్మాయి ఎవరే" అని అడిగింది. "మా అత్తగారికి ఏదో బంధువే" అని ముక్తసరిగా జవాబిచ్చింది పార్వతి.

"చూశావా, ముక్కూ మొహం ఎరక్కపోయినా తనకి ఇష్టమైతే తనగుడ్డలు కట్టబెట్టి వూరంతా తిప్పుతుంది. నేను చెప్పానని నిన్ను పలకరించనైనా లేదు" అంటూ బాధపడింది జానకమ్మ.

"ఆ పోనిస్తూ" అంటూ ఆ పక్కగావున్న మంచము పైన నడుంవాల్చింది పార్వతి.

ఎంతసేపు నిద్రపోయిందో లేచేసరికి ఇల్లంతా దీపాలే. తోటలో రంగురంగుల దీపాలు ఆరుతూ వెలుగుతూ తిరుగు తున్నాయి. అన్నివేళలా పంపులోకి వేడినీళ్ళు ఎల్లావస్తాయో అడిగి తెల్సుకోవాలనివున్నా నవ్వుతారేమోనని భయపడి వూరుకుంది. స్నానంచేసి చుట్టూ జరీవున్న పుల్లేటికుర్రు చీర తీసి కట్టుకుంది. పల్చటి తెల్ల పట్టుజాకెట్టు తొడిగి అద్దంలో చూసుకుంటోంది. ఆ ఇంట్లో ఏముందో, తనకీ అందమైన బట్టలు కట్టుకోవాలనిపిస్తోంది అనుకుంటూ నవ్వుకుంది.

వెనకనించి చూస్తున్న ఆనందం తన్నిచూసే నవ్వుతోంది అనుకుని, "ఎందుకో చెప్పు" అని పార్వతి కెదురుగా వున్న వుయ్యాలబల్లమీద కూర్చున్నాడు.

"అబ్బే, ఏం లేదు. మీ ఇంట్లోనే వుండిపోవాలని

వుంటుందనుకో, అప్పుడు ఏమిచెయ్యటం అని నవ్వుతున్నా" అని మాటమార్చింది పార్వతి.

"మాటమీందే వుండాలి తెల్సిందా" అంటూ వుయ్యాలదిగి పార్వతిదగ్గరికి వచ్చాడు ఆనందం.

జానకమ్మ కర్రచప్పుడువిని మళ్ళీ వుయ్యాలదగ్గరకి వెళ్ళాడు ఆనందం. "పువ్వులు ఇవిగోనే" అంటూ పార్వతి తల్లో పెట్టి అక్కడే కూర్చుంది జానకమ్మ.

చాలాసేపు చిన్నప్పటిముచ్చట్లు చెప్పింది.

ఆనందానికి, పార్వతికి జరగాల్సినపెళ్ళి ఎల్లా నిల్చిపోయిందో చెప్పి నిట్టూర్చింది జానకమ్మ.

పార్వతిలో భావం బయటపడకుండా మాటమార్చి "మీ కోడలి పుట్టిల్లేవూరు" అని మేనత్తని అడిగింది.

"ఆఁ, మీ నాన్నదగ్గరకి అస్తమానం చేబదులుకి వచ్చేవాడు గేపకముందా! ఆ వెంకటనారాయణ మేనగోడలే ఈ పిల్ల" అంటూ తేలిగ్గా చెప్పింది.

పొద్దుపోయేదాకా అవీ ఇవీ చెప్పుకుంటూ కూర్చున్నారు. ఆ దీపాలవెలుగులో ఎంత పొద్దుపోయిందీ కూడా తెలవలేదు. పదకొండోగంట వినగానే చలనంకలిగి లేచి వంటవాడికి పురమాయించాడు ఆనందం. ఇప్పుడేంతిండి బాబు, నాకు వద్దు అంటూ వెళ్ళిపోయింది మేనత్తవెనకే పార్వతి.

ఆనందం బలవంతంమీద తిరిగివచ్చి కొద్దిగా తిని లేచింది పార్వతి. "మీ సంసారంకబుర్లు చెప్పు" అంటూ మొదలుపెట్టాడు ఆనందం.

"ఆ, మాకేమి వుంటాయి. పొద్దుగూకేసరికి తిని సెయ్యటం. ఆయన చుట్టకాలుస్తూ పురారమ్మేట తిరిగివచ్చేసరికి

మాకో నిద్ర అయిపోతుంది. మళ్ళా కోడికూతవేళ లేచి పనుల్లో పడ్డామంటే మళ్ళా భోజనాలైందాకా ఏదోవకటి సరిపోతుంది. మళ్ళీ వో కునుకుతీసి లేచేసరికి సంధ్యగుమ్మాలు చిమ్మటం, సాయంత్రంపనులూ అవీ సరిపోతాయి.

"మీలా మేమేం జమిందార్లం కాముగా" అంది పార్వతి. "నిద్రవస్తోందా పార్వతీ" అని ఆప్యాయంగా అడిగాడు ఆనందం. లేదని తలవూపింది పార్వతి. అయితే మా వెనకవున్న ఇల్లు చూద్దువుగాని రా అని పిలిచాడు ఆనందం. ఆ దారిలో మెత్తనిగడ్డి పరచినట్టు వుంది. పైకి చూసేందుకు ఇల్లు ఏమంత కనపడకపోయినా లోపలికి వెళ్ళాక పార్వతికళ్ళు జిగేలుమని మెరిశాయి. ఏదో ఇంద్రభవనం వర్ణనలా వుంది. గదులన్నీ తిరిగింది. ఇంటిచుట్టూ చూసింది. చెరువుదగ్గరికి నడిచింది. మళ్ళీ ఇంటిముందుకే చేరింది. "చాలా బాగుంది" అని ఆనందంతో అని "ఇంక వెడదాము" అంటూ బయటికి నడిచింది. ఎదురుగా పాలరాతితో కట్టిన గట్టెక్కి కూర్చుంది. కొంగు పరుచుకు పడుకుంది. ఆనందం రాలేదు. పార్వతికి కునుకుపట్టింది. తోటలో దీపాలు ఒక్కసారి ఆరిపోయాయి. పార్వతికి మెళుకువ వచ్చింది. కీచురాళ్ళంటే భయం. తనదగ్గరగా ఎవరో కూర్చున్నట్లు అలికిడవుతోంది. మాట్లాడాలంటే భయం కంఠాన్ని చుట్టు కున్నార్చుంది. ఏదో చెయ్యి వీపునిమురుతోంది. తను దూరంగా జరుగుతోంది. ఆకారం దగ్గరవుతోంది. పార్వతి జరిగి జరిగి గట్టుచివరకు చేరింది. పడకుండా ఆ చేతులు ఆపాయి.

పార్వతి ఏదో చెపుతోంది. కీచురాళ్ళధ్వనిలా మాట పైకి రావటంలేదు. "వద్దు పాపం, తప్పు. తరవాత చెప్పు" అంటూ నవ్వుతున్నాడు. ఆ నవ్వు చీకటిని ఇంకా దట్టంగా చేసి పెద్దకొండలా చుట్టూ పెరిగి నిల్చింది. చీకటిని కాల్చే కోరిమి, ఆకాశంలో తెల్లగీర వెలిగింది...ఆనందం, పార్వతి చెయ్యిపట్టుకు లేవతీశాడు. ముందు బంగళా తలుపులు తీసే వున్నాయి. పార్వతి తూలి వుయ్యాల బల్లకి తగిలింది. రహస్యం తెల్సుకున్నట్లు చప్పుడుచేశాయి గొలుసులు. జానకమ్మ లేచి లైటువేసింది.

"నువ్వు ఈ వట్టి బల్లమీదే పడుకున్నావా? అయ్యో" అంటూ దుప్పటి తెచ్చి పరచింది.

ఇక్కడ భయంగా వుంది నీ గదిలో పడుకుంటానంటూ పార్వతి జానకమ్మగదిలోకి చేరింది.

సుభద్ర ఎప్పుడు వచ్చిందో తెలీదు. ఐనా పార్వతి లేచాకే నిద్రలేచింది.

తను చూసినవి వింతలుగా, గుక్కతిప్పుకోకుండా పార్వతితో చెప్పుకుపోతోంది.

"మనం ఏముందిలే అనుకుంటాముా! నేము ఎన్ని గంటలో చూసింది ఒక్క పావుకూడా కాదుట" అంటూ సినిమాతియ్యటం గురించి సుభద్ర చెప్తోంది.

అప్పుడే నిద్రలేచిన రాధాకుమారి కాఫీకోసం అయ్యర్ని తిడతోంది.

ఆనందం వుయ్యాలమీద కూర్చుంటూ "గొలుసులు చప్పుడు చెయ్యకుండా వుండేలా చేస్తే బాగుండును" అంటూ పార్వతికేసి వారగా చూశాడు.

పార్వతి మెల్లగా స్నానాల గదికి చేరింది. రాధాకుమారి స్నేహితురాండ్రు రానటంతో మేడపైకి వెళ్ళిపోయింది. సుభద్ర వుయ్యాలకి మరోచివర కూర్చుంటూ "మిమ్మల్ని తీసేటప్పుడు చూడాలనివుంది" అంటూ ఆనందాన్ని చేత్తో కొట్టి చెప్పింది. "ఏముందీ, ఇక్కడే ఆడేస్తా చూడండి" అంటూ తను చెప్పాల్సిన మాటలు కొన్ని చెప్పి, అటూఇటూ తిరిగి గెంతి హంగామా చేస్తున్నాడు ఆనందం.

పైనుంచిరాధాకుమారి గోలచెయ్యవద్దనికబురుపెట్టింది. 'చిత్తం,దేవీ'అంటూ ఆనందం ముడుచుకూర్చున్నట్టు నటించటం చూసి సుభద్ర పగలబడి నవ్వుతోంది. ఇంకా నవ్వేలా వికారాలు చేస్తున్నాడు ఆనందం. ఆరోజు అంతా ఆనందం వెనకే తిరుగుతోంది సుభద్ర. రాధాకుమారికి ఎప్పుడు కోపంవస్తుందో తెలీక ఆనందాన్ని తెగపొగిడింది సుభద్ర.

దానితో ఆనందాన్ని మేడదిగి కిందికిరాకుండా చేసింది రాధాకుమారి.

సుభద్రకి, ఆనందంపక్కన కూర్చుని కారులో తిరగాలన్న కోరిక తీరనేలేదు. ఆ మర్నాడు బయల్దేరకపోతే నరసమ్మగారికి కోపంరావచ్చునన్న భయంతో ఆ సాయంకాలం ఆనందంవున్నగదికే వెళ్ళి అడిగింది, వూరు చూపెట్టమని.

పక్కగదిలోవున్న రాధాకుమారి వెంటనే డ్రయివర్ని పిల్చి తీసుకువెళ్లమని పురమాయించింది.

ఆనందం సాయంత్రం వెళ్ళి మళ్ళా మర్నాడువచ్చాడు. జానకమ్మ తెప్పించిన చీర పార్వతిని కట్టుకోమంది, ఆనందానికి చెప్పేందుకు మేడపైకి వెళ్ళింది పార్వతి. రాధాకుమారి. గుమ్మంలో నిల్చుంది. ఆనందం పాదాలకి ప్రణామంచేసింది. పార్వతితల నిమిరాడు మెల్లిగా. కోపంతో రాధాకుమారి కిందికి వచ్చేసింది.

సుభద్రని, పార్వతిని రైలుకి పంపింది రాధాకుమారి. కాలంజరిగి పెరిగినకొద్దీ గతంలో జరిగినవి గతానికే వదిలి జీవితాన్ని నిండుకుండలా నిల్పుకుంది. సుభద్రకి, జీవితం అంటే నిర్లక్ష్యంగా వుంటూ, ఎప్పుడూ విసుగుతో, ఒక్కర్తే శూన్యం లోకి చూస్తూ కూర్చోవటం, లేకపోతే ఆనందంపేరు చెప్పి నవ్వటం అలవాటయ్యాయి. ఈ చేష్టలకి విసుగుపుట్టి, పుట్టింటికి పంపేశారు అత్తవారు. ఆ పిల్లకాపురం, పండుఅంటిది పాడుచేశాడని ఆనందంపై లోకం అభాండం విసిరింది. సుభద్ర కోరికలు గాలిగుఱ్ఱం కళ్లెంలా అందకుండా ఎక్కడో తిరుగుతూ కిందకి దూకుతూ ఉన్నాయి. దారితెలియని యాత్రికుడిలా జీవితాన్ని డొంకపై కప్పి, కారకులు ఎవరో తెల్సా అనే కథలు మిగిలినా, సుభద్రకి జవాబుచెప్పేస్థితి ఏనాడో మించి పోతుంది.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B124 |
| పుస్తకం పేరు | సుబ్బులక్ష్మి కథలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 315 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | N |
| లేని పేజీలు | 117,118 |
| తయారు చేసినది | Akshaya |
| పేజీలు విడదీసినది | Bonny |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |